సాహిత్య మాసపత్రిక

# భారతి

నవంబర 1984



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



నవంబరు 1984

సంపుటము : 61 సంచిక : 11

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## నవంబరు 1984



ముఖచిత్రం :
స్వర్గీయ
ఇందిరా ప్రియదర్శిని గాంధీ

# ఇందిరా ప్రియదర్శిని

అక్టోబరు 31 భారతదేశం చరిత్రలో ఒక అతి విషాదకరమైన దినం. కొన్ని రోజులలో అరవయిఐదు సంవత్సరాలు పూర్తి చేసుకోబోతున్న శ్రీమతి ఇందిరా ప్రియదర్శిని గాంధిని, ఆమె ఇంటిలో పనిచేసే రక్షకదళానికి చెందిన, సిక్కు తీవ్రవాదులు తుపాకులతో కాల్చి చంపివేశారు. ఒక వృద్ధ వనితని వారు ఇంత దారుణంగా ఎలాగ చంపగలిగారని కన్నీరు పెట్టని భారతీయులు ఉండి ఉండరు. భారతదేశం ఒక లౌకిక రాజ్యం. ఇది ఒక ప్రజాస్వామ్యం. ఇక్కడ దౌర్జన్యవాదులు కొందరు తమ దేశంయొక్క ప్రధానమంత్రిని హత్య చేశారంటే మతోన్మాదం ఎంత భయంకరంగా మారిపోగలదో కొంతవరకయినా ఊహించవచ్చు. శ్రీమతి ఇందిరాగాంధి అనుసరించిన విధానాలూ, పద్ధతులూ భారత జాతీయోద్యమంలో అభివృద్ధిచెందిన సంప్రదాయాలకి కొన్నిటికి విరుద్ధంగా ఉండి ఉండవచ్చు. ఆమె కాంగ్రెస్ పార్టీని చీల్చివేసి దానిని కేవలం తమకి విధేయులుగ ఉండేవారి రాజకీయపక్షంగా మార్చివేసి ఉండవచ్చు, కాని, పండిత మోతీలాల్ నెహ్రూ మనవరాలుగా, పండిత జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తెగానే కాకుండా అద్వితీయమైన రాజకీయ చాతుర్యం కల నాయకురాలిగా ఆమె భారతీయుల ప్రేమాభిమానాలని చూరగొన్నారు. గాంధీగారు ప్రజలనుబట్టి రాజు అని చమత్కరించేవారు. భారత దేశంలో వోటరులు తమ ఇష్టాయిష్టాలని ఎన్నికలలో తెలుపుతూనే ఉన్నారు. వాటిని శ్రీమతి ఇంధిరాగాంధి అర్థం చేసుకున్నంతగ ఇతర రాజకీయ నాయకులు అర్థంచేసుకోలేదని అనుకోవాలి. ఆమె 1966 జనవరిలో మొదటిసారి ప్రధానమంత్రి అయ్యారు. 1977 మార్చిలో పదవి నుంచి దిగిపోయి 1980 జనవరిలో మళ్ళీ ప్రధాని అయ్యారు. ఆమె పరిపాలనలో ఎంతో జరిగింది. ఎన్నో మార్పులు వచ్చాయి. వాటిని తగిన విధంగా సమీక్షించటానికి కొంతకాలం పడుతుంది. ఇంతలో భారతదేశం ఒక గొప్ప దేశభక్తురాలిని, రాజకీయ నాయకురాలిని కోల్పోయిందని సందేహం లేకుండా చెప్పవచ్చు.

# ఇందిరా నిర్యాణం

## "రసరాజు"

ఒక మనోహర దివ్య మహోదయాని
ద్దు నిలిచిన దెవ్వరి గడ్డమీద ?
ఎదురు చీకటి నిలువెల్ల పులుము కొన్న
తిరోగాము లెవ్వరమ్మా ? ధరిత్రి !

వ్వరా తంబూరా తీవె నిటుల త్రెంచి
భావి రాగోదయశ్రీ" నివాసమందు
లినిడలు పఱచిరి ? కాలకూట
షము చల్లిరి ? నిప్పులే విసిరినారు ?

తుపాకులతో రాజహంసకెవ్వరు
ంజరంగు పులిమిరి నిషాదవృత్తి ?
ంత దురదృష్టకరము ! భరింపఁ భేదు
రతీయ మానససరోవరము నేడు !

ఆ కరాంగుళులెవరివి ? ఆ కఠోర
కాలరాక్షసులెవ్వరు ? కంటిపాప
చిదిమి జగమెల్ల చీకటి చేసినారు........
మాతృహంతకులా ! నిజమా ! ధరిత్రి !

ఆ మతోన్మాద సహిత దురాత్ములెవరు ?
చెటిపి వేసిరి భారతేందిర ముఖాన
శ్రీరహించెడి ఒక గర్వరేఖనిపుడు_
అంగరక్షకులా ! నిజమా ! ధరిత్రి !

ఒక సుగంధసమన్విత— మొక ప్రశాంత
భరితమగు గులాబీ తల్లి ప్రక్క నిలిచి
రక్షణము సల్పు కంటకవ్రాతమకట
కాటువేసెనె ! ఎంతటి ఘాతుకమ్మొ !



డాక్టర్ యు. ఎ. నరసింహమూర్తి

# కవిత్వము - ఉన్మాదము

"కో వేత్తి కవితా తత్త్వం" అనేమాట ఇరవైయవ శతాబ్దాంతానికైనా తం అలాగే నిలిచివుండడం విడ్డూరమే. అనాదినుండి నేటివరకు కవిత్వాన్ని భూషించినవారూ ఉన్నారు. దూషించినవారూ ఉన్నారు. ఉన్మత్తులైనవారూ ఉన్నారు. ఉదాసీనులూ ఉన్నారు కవిత్వం తపస్సు అని కొందరంటే, పిచ్చి అని మరికొందరన్నారు. కవులను ఋషులని కొందరంటే పిచ్చివాళ్ళని కొందరన్నారు. ప్రాచీన భారత ధార్మిక ప్రతిపత్తి కావ్యాలాపాలను నిషేధించింది. వివేకం గల వ్యక్తి కవితా ద్వారం తలుపు తట్టడం వ్యర్థం అన్నాడు ప్లేటో. కవితాకన్యకు "అవివేకియె తోడబుట్టువు" అని భారతీయులు చెప్తే ఉన్నతమైన ఏ బుద్ధీ పిచ్చితనం లేనిదిగా వుండదని అరిస్టాటిల్ చెప్పేడు. అవ్యవస్థనుండి వ్యవస్థను రూపొందించడానికి ప్రాథమిక ప్రయత్నాలు కొనసాగించిన ప్రాచీన సమాజంలో సహజోద్రేకాలను నిరాఘాట సంచారానికి పురికొల్పే కవితా కళపట్ల ఈ రకమైన విరుద్ధ భావం కొంత యేర్పడినా కొద్ది కాలానికే ఆ అలజడి సద్దుమణిగింది. అందుకు కారణం కవిత్వం ప్రయోజన–సాపేక్షంగా పరిణమించడమే ననుకో వలసివస్తుంది. కవిత్వం ప్రచారసాధనమయింది. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్ర" మనేటట్లు నిలిచింది. భారతం పంచమవేదమయింది. పాశ్చాత్య వాఙ్మయంలోని మహేతిహాసాలుసైతం ఈ బాధ్యతనే నెత్తినపెట్టుకుని ఊరేగేయి. అంతటితో కవిత్వానికి ఒక గౌరవం ఒక ఆమోదం లభించేయి. కవిత్వం రాయడం గొప్పగాదు, కవిత్వాన్ని వినడం – పోషించడం ఒక నాగరక లక్షణంగాను పరిణమించింది. సరిగా విశ్లేషిస్తే ప్రాచీన సమాజంలో కవిత్వం కొందరికి ఉపాధి – కొందరికి వినోదం – కొందరికి ప్రచార సాధనం – కొందరికి పిచ్చి. కొద్దిపాటి తేడాలతో ఈ స్థితే ఇప్పటికీ కొనసాగుతూందని చెప్పవచ్చును.

రాచరికం బలపడినకొద్దీ కవిత్వానికి విలువ పెరిగింది. కవిత్వానికి విలువ పెరిగినకొద్దీ కాల్పనికలోకాలు విస్తరించనారంభించాయి. అలంకారశాస్త్రాలు కవిత్వానికొక తాత్త్విక భూమికను కల్పించి దానినొక నిర్వాణకల్పంగా తీర్చిదిద్దాయి కవిత్వం ఆనందపరమావధి అన్నాయి. కవిత్వంవల్ల సిద్ధించే అలౌకికానందం బ్రహ్మానందసహోదరమన్నాయి. ఒక కాలంలో కవితకు అక్షరలక్షలు కురిసేయి. ఒక కాలంలో కనకాభిషేకాలు జరిగేయి. ఇంకొక కాలంలో పల్లకీ ఎక్కి ఊరేగితే నిన్న మొన్నటి వరకు ఏనుగునెక్కి ఊరేగిన సంఘటనలూ ఉన్నాయి. ఇదంతా మధ్యయుగాలనాటి ప్రాభవం. దాని అవశేషాల ప్రభుత్వం పాశ్చాత్యలోకంలో ఏ గాసన్‌లాంటివాడో కవులను విదూషకులుగా, కవిత్వాన్ని అబద్ధాల తల్లిగా తిరస్కరించినా, ఏ పీకాక్ లాంటివాడో కవిని నాగరక సమాజంలో తిరిగే అనాగరకునిగా తేలిక చేసినా ఆ మాటలను ప్రపంచం పెడచెవిని పెట్టింది. ఒక విధంగా చెప్పాలంటే "విద్యలలోపల నుత్తమవిద్య కవిత్వంబు" అనే అప్పకవి మాటను నాగరక సమాజం వినమ్రంగా ఆమోదించింది,

ప్రాచీనకాలం నుండి ప్రతిభ కవిత్వానికి బీజమని నమ్మేరు, ప్రతిభ అనేది జన్మాంతరసంస్కార విశేషమన్నారు. ఆ సంస్కారం లేనిదే కవిత్వం పుట్టదన్నారు, ఒకవేళ పుట్టినా హాస్యాయతనం కాక తప్పదన్నారు. ప్రత్యగ్ర సంస్కారమే ప్రతిభాహేతువన్నారు. ప్రతిభావంతుడు అవహితచిత్తుడైనప్పుడు – అంటే ఏకాగ్రతతోకూడిన మనస్సుకలవాడైనప్పుడు కావ్యార్థాలను దర్శించగలడని చెప్పేరు. అందుకే కవికి ఋషిత్వం సంక్రమించింది, ఒక విధంగా ఋషికంటే కవికి ఎక్కువస్థానం ఇచ్చేరనుకోవచ్చును. దర్శనంతోపాటు వర్ణనానైపుణ్యంకూడా సిద్ధిస్తేనేకాని కవిత్వం అవతరించదన్నారు. ఆధునిక యుగం అవతరించిన వరకు ఈ విషయాలను ప్రశ్నించినవారులేరు. జన్మాంతరసంస్కారమనే మాటను అభ్యంతరకరమైన మాటగా ఎంచడంతో భౌతికవాదులు కవిత్వానికి ప్రత్యామ్నాయహేతువును అన్వేషించేరు, ఫ్రాయిడ్ రంగప్రవేశం చేసిన తర్వాత "అచేతనదశ" ఈ క్షేత్రంలో కాలూనింది అంతకు ముందు "ప్రతిభ" అనే భావన విశేష ప్రభావాన్ని నెరపినట్లుగా ఇరవైయవ శతాబ్దంలో అచేతన దశలోని మనస్సు ఒకవ్యక్తియొక్క జీవితాన్ని చర్యలను ప్రభావితం చేస్తుందనే భావన ప్రచలితమైంది.

పురాణేతిహాసాలు సమస్తదేశాల వాంఛాగతాలైన అభూతకల్పనల అస్తవ్యస్తచిహ్నాలనీ, మానవత తన యువావస్థలో కన్న కలల సమాహారమని ఫ్రాయిడ్ భావించేడు. నూర్పులతో, మార్మికతతో రచయిత పగటికలలలోని అహంకార స్వభావాన్ని ఉపశమింపజేస్తాడని, తన అభూతకల్పనలను మనకు అందించేటప్పుడు స్వచ్ఛమైన

పరిష్కారంతోకూడిన అలౌకికానందాన్ని లంచంగా ఇవ్వజూపుతాడని అతని తీర్పు. ప్రతివ్యక్తీ అజ్ఞాతంగా తన స్వప్నాలలో కవి అవుతాడన్న విషయంలో ఫ్రాయిడ్, యూంగ్‌లు ఏకీభవించారు, అన్ని కొత్త ఊహలు, ఊహాల కూర్పులు అచేతన దశలో ముందుగా యోచింపబడినవేనని వారి వాదం. అయితే స్వప్నరూపాలు విస్తృతమైన, ఎక్కువ పొందికగల నిర్మాణాన్ని పొందడమనేది చాలా అరుదు. ఇందుకు గాఢమైన కవితా=అపస్మారక వ్యక్తులు చాలావరకు అవసరమౌతాయని యూంగ్ ప్రతిపాదన

పసిపిల్లలు ఒంటరిగాను, తమ తోటివారితో కలిసీ, ఆడే ఆటలు పాడే పాటలు — చేసే ఊహలు విచిత్రంగా ఉంటాయి. ఈ దశలో స్వైరకల్పనలు బహుళంగా ఉంటాయి బాల్యదశ అంతరిస్తున్నకొద్దీ ఆ సహజాతాలు అణచిపెట్టబడుతూవుంటాయి. ఆ కలలకు—కల్పనలకు స్వేచ్ఛతో కూడిన వికృతుల లభించకుండాపోతుంది కాని ఉద్రేకాలు శాశ్వతమైన అణకువను పొందవు. వాటిని అణచిపెట్టడంవలన అంతరంగంలో ఒక సంఘర్షణ ఆరంభమవుతుంది. ఆ సంఘర్షణల మూలపీఠం అచేతనదశలో వుందని ఫ్రాయిడ్—అతని అనుయాయులు చెప్తున్నారు. ఈ సుప్తోద్రేకాలు అణకువగా ఉండే ఓర్పును కోల్పోయినప్పుడు అవి మానసిక నాడీరుగ్మతారూపంలో వెల్లడయ్యే సమయం ఆసన్నమౌతుంది. అది యథాతథంగా వెల్లడైతే ఉన్మాదమౌతుంది. అచేతన దశ దానిని ఎదుర్కొని క్రమబద్ధం చెయ్యడంవలన సృజనరూపమౌతుంది. అందుచేత ఘర్షణలో కవితాబీజం ఉందనీ, సృజనాత్మక పరిష్కారాలను, నాడీరుగ్మతా సంబంధమైన పరిష్కారాలను, ప్రేరణచేసే అచేతనశక్తులు సమాంతరమైనవని ఫ్రాయిడ్ చెప్పడం జరిగింది.

వివేకము — తర్కము — హేతువు అనే మంచి లక్షణాలవల్ల ప్రపంచవ్యవహారాలన్నీ నిర్వహింపబడుతూ ఉంటాయి. అయితే తరచుగా కవితా సంబంధమైన ఊహాలకు ఇవి శత్రువులుగా కనిపిస్తాయి.

ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః
సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్, గుహ్యక స్తం యయాచే
కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనా చేతనేషు॥

యక్షుడు తన ప్రియురాలికి మేఘంద్వారా సందేశాన్ని పంపించడానికి పూనుకున్నాడు. వార్తను తీసుకుపోవడం మేఘానికి సాధ్యం కాదు. అది అచేతన పదార్థం వార్త మనుష్యులు మొదలైన ప్రాణులు చేరవేయదగ్గది. అయితే ఇదెలా సాధ్యం ? అనే ప్రశ్నకు కాళిదాసు ఈ శ్లోకంతో సమాధానం చెప్పుకున్నాడు. కాముకులకు యుక్తాయుక్త విచారంగాని, జడ - చేతన జ్ఞానం గాని వుండదు. గనుక ఇది యుక్తమే నన్నాడు. ఈ ప్రశ్న లోకానిది. ఊరకనే నిలుచుని మబ్బులతో ఓ మనిషి మొరపెట్టుకుంటే అది ఉన్మత్త చర్య అనడానికెవడూ సందేహింపడు. కాని ఆ ఊహ ఇప్పటికి ఒట్టిపోకుండా నిలచి కవితా ప్రపంచాన్ని పులకితం చేస్తూంది. ఈ బాణీలోనే షేక్స్పియర్ సైతం పిచ్చివాడు — ప్రేమికుడు — కవి చేసే ఊహాలు ఒక్కలాంటివేనని ప్రకటించడం ఎవరూ ఎరుగనిదికాదు యక్షుని నిస్సహాయస్థితి, ఏవిధంగానైన తన ప్రియురాలికి తన మాటను వినిపించాలనే వాంఛాతీవ్రత అసాధారణరీతిలో మేఘసందేశానికి ప్రేరణకల్పించాయన్నమాట. అంటే కవుల ఊహాలలో ఒక అసాధారణత్వం ఉందన్నమాట. సామాన్యజనంనుండి వేరుచేసి చూపించదగ్గ అసాధారణత్వం ఉన్మాదులలోనూ—కవులలోనూ కూడా కనిపిస్తుంది. కాని ఒకే కేంద్రంనుండి పైకుబికే ఈ రెండు చర్యలలోనూ తప్పనిసరిగా ఒక భేదం ఉండాలని భావించడం అసమంజసం కాదు,

ఏలొకో యెప్పుడో యెటులనోగాని
మాయమయ్యెద నేను మారిపోయెదను
నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ?
నాయిచ్ఛయే గాక నాకేటి వెరపు ?

అన్న కవి స్వేచ్ఛాగానంలో వాస్తవిక యోగ్యతలను తృణీకరించడం, సంతోషసూత్రానికి పట్టం కట్టడం అనే రెండు లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఉన్మాదులు సైతం ఈ రెండు లక్షణాలను ఇంత గాఢంగానూ కలిగి వుంటారు. ఇందులో ఏ భేదాన్ని ఆధారంగా చేసుకుని సహృదయులు ఉన్మాదులకు దూరంగా ఉండాలనీ, కవులకు సన్నిహితంగా ఉండాలనీ అనుకుంటున్నారు ? లేక కవులతోపాటు కవిత్వాభిరుచి కలవారందరూ మానసిక రోగులేనా ? అనే ప్రశ్నలు సహజమైనవి

ఇక్కడ ఒక విషయం సిగ్గుపడకుండా అంగీకరించాలి. "అంతా కవులము కామా" అనుకున్నట్లుగానే మానవులందరూ ఏదో ఒక స్థితిలోనైనా సముచితాన్ని కోల్పోయి ఉన్మాదానికి లోను కావడమనేది యదార్థమనుకోవాలి. సాధారణ మానవుడిలోని నియంత్రితోపకరణాలు ఆరోగ్యవంతంగా పనిచేయడంచేత అటు కవిత్వం - ఇటు పిచ్చి రెండూ కూడా ఎప్పటికప్పుడు అణచిపెట్టబడుతూ వుంటాయి. నియంత్రితోపకరణాల లోపంవల్ల ఉన్మాదులు ఉన్మాద లక్షణాలతో బాధ పడుతూ వుంటారు. అటువంటి రోగుల చర్యలు ఆధారంగా

రూపొందించబడ్డ ఫ్రాయిడ్ ప్రాథమిక మనస్తత్వ విశ్లేషణ సిద్ధాంతాలు అతని అనంతర కాలంలో అనేక విమర్శలకు గురయ్యాయి.

ఉన్మాదుల్లాగే కవులు కూడా బలమైన అహాన్ని కలిగివుంటారని ఫ్రాయిడ్ భావన. "అలనన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగము" అని విశ్వనాథ అన్నప్పుడూ, "నేనొకదుర్గం నాదొక స్వర్గం" అని శ్రీ శ్రీ పలికినప్పుడూ ఈ అహంకారం కనిపిస్తుంది. అయితే ఇక్కడ అహాన్ని అణచిపెట్టడం వలన కాక అహంకార ప్రవృత్తిని దాని ఆదిమ దశకు తిరోగమింపజేయడం వలన కవిత్వం పుట్టిందని ఎర్నెస్ట్ క్రిస్ భావించేడు. క్రిస్ ఆలోచనల్లో కవిత్వానికి ఉన్మాదానికి మధ్యగల సంబంధం ఇంతో అంతో నిర్వహింపబడుతూ వచ్చినా కవిత్వం యొక్క నిశ్చితస్థానం అచేతన దశనుండి ప్రచేతన దశకు బదలాయింప బడింది. కవిత్వానికి ఒక విధమైన శైశవ చేష్టను ఆపాదించడంలో మాత్రం క్రిస్ ఫ్రాయిడ్‌కు సన్నిహితంగా ఉన్నాడు. కవితారహస్యాన్ని భేదించడానికి మనస్తత్వ విశ్లేషణ సిద్ధాంత పడికట్టు కాక గ్రహణ సిద్ధాంతం ఉపయోగిస్తుందని వాదించిన షాక్‌టాల్ సృజనకు ఉద్రేకోపశమనం కాక ఉద్రేకాన్వేషణమే - అంటే "నిష్కపటంగా ప్రపంచంతో తలపడడమే" మూలమన్నాడు. సృజనాత్మక పద్ధతిలో అచేతనస్థితి ప్రవేశించడం దానికి మిక్కిలి హానికరమని వాదించిన వారిలో ప్రముఖుడు కుబి అనే శాస్త్రజ్ఞుడు ప్రచేతన రీతుల చర్యల వలననే సృజనసౌలభ్యం సిద్ధిస్తుందని కుబి అభిప్రాయం. ప్రచేతన ప్రవృత్తులు ఎంతో స్వేచ్ఛను కలిగివుంటాయి. అయితే అవి అచేతన చేతన దశలనే రెండు కొండల మధ్యనుండి ప్రయాణించాలి. అచేతన శక్తులు ఆటంకపరచేకొద్దీ అవి దృఢమైన - అస్తవ్యస్త ప్రతీకలుగా మారిపోతాయి. చేతనశక్తులు వాటిని పరిశోధించి విమర్శించి, సంస్కరించడం వల్ల గతాను గతికమైన సామాన్య విషయాలుగా పరిణమిస్తాయి. ఈ ఒత్తిడులకు లొంగకుండ స్వేచ్ఛగా సంచరించినప్పుడు ప్రచేతన శక్తులు ఒక నూత్నసృష్టి అందించగలవన్నాడు కుబి "యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే"॥ అనే అమూల్యోక్తిలో ఈ ప్రచేతన దశాప్రవృత్తి ఫలితమేకాని ఉత్పత్తి ఉన్మత్తఘోష కాదనే విషయం ఈ వాదనవల్ల తేటపడుతుంది.

ఏంథోనిస్టార్ మనస్తత్వ విశ్లేషణాత్మక వ్యాఖ్యలలో కళారూపాలకు సంబంధించి ద్విముఖమైన బలహీనత ఉన్నాయని పేర్కొన్నాడు. అవి 1 ఉత్తమకళకు అధమకళకు మధ్యగల భేదాన్ని నిర్ణయించలేకపోవడం 2. కళారూపానికి ఉన్మత్తచర్యకు గల భేదాన్ని నిర్ణయించలేకపోవడం, ఇతరులు ఏ విషయాలను అణచిపెట్టున్నారన్న విషయాల్లో అతి మెలకువగా ప్రవర్తించే స్రష్టలు అణచివేయబడ్డ విషయాలకు నివాసభూమియైన అచేతనదశ చెప్పినట్లుగా ప్రవర్తిస్తారన్న వాదాన్ని ఇతడు తీవ్రంగా ఆక్షేపించేడు. కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చేస్తుందన్న తిలక్ మాట ఈ విషయాన్ని మనసుకు హత్తుకునేలా చెప్తుంది. కవులు ప్రకృతికి భాష్యప్రణేతలన్న ప్రాచీన కవి సైతం కవిత్వం యొక్క పరేంగితావగాహకత్వము విశదం చేస్తూనే వచ్చాడు.

మనిషి మనసు చూసుకుంది
తన నీడను అరణ్యరూపాలుగా
రసాహంకృతి కూర్చుకుంది
రక్తిని చైతన్య కోశాలుగా -

అని చెప్తుంది విశ్వంభరాతత్త్వం. ఇక్కడ ఎలాఒకనీడనుండి అరణ్యరూపాలు ఆవిర్భవించాయో అలాగే మానవుని మానసిక ప్రపంచంలోకూడా ఎన్నో అరలుంటాయి. సామాన్యులకంటే రసాహంకృతి కలవారిలో ఈ చైతన్యకోశాలు హెచ్చుగా ఉంటాయి. అందుచేత మనలోని చాలామందికంటె వారు హెచ్చుగా విభక్తులైవుంటారు. మార్పుచెయ్యటానికి, సిశ్లేష్యంచెయ్యటానికి, అణచిపెట్టడానికి ఏవిధమైన ఉపాయంలేని రీతిగా తమలోని పరస్పరవిరుద్ధస్వభావాలను సమైక్యంగా నిర్వహించే అసాధారణశక్తి — ఇతర సాధన సామగ్రి వారివద్ద వుంటుంది. సృజనశీలురు — అందునా శక్తివంతమైన సృజనచేసేవారు బహుధావిభక్తమైన తమ ఆంతరంగ సంఘర్షణలో బాధపడుతూ వైక్లబ్యాన్ని పొందుతారు. కాని తప్పనిసరిగా ఉన్మాదాన్ని ప్రదర్శిస్తారనడానికి లేదని ఏంథోనిస్టార్ అభిప్రాయం. మన కవులను గురించి చెప్పుకునే కొన్ని మాటలు ఈ సందర్భంలో జ్ఞాపకం తెచ్చుకోవలసివుంటుంది. కాళిదాసు మొదట వెట్టిమొద్దుగా తిరిగేవాడనే కథ ఒకటుంది. బాణభట్టు తన మేనత్తకు సంక్రమించిన వైధవ్యాన్ని చూచి మనోవైక్లబ్యాన్ని పొంది ఆ గాఢవేదనతోనే మహాశ్వేతను సృష్టించేడని చెప్తారు. నన్నయ అరణ్యపర్వం కొంతవరకూ రచించేటప్పటికి పిచ్చివాడయ్యాడంటారు. గోచికట్టి ఊళ్ళు తిరిగిన వేమనది వైరాగ్యమని కొందరంటే వెట్టి అని మరికొందరంటారు. మన మధ్య రెండు కవితోద్యమాలకు నాయకత్వం వహించిన కృష్ణశాస్త్రి — శ్రీశ్రీ

ఒకానొక సందర్భంలో మానసికరుగ్మతకు లోనయ్యారన్నది ఉన్న మాట. ఆరోగ్యంలో ఉన్నప్పటికంటెకూడా అనారోగ్యంగా ఉన్నప్పుడే నాకు విశేషించి రచన సాగడం అనుభూతం అన్నారు చెళ్ళపిళ్ళవారు. మానసికరోగులు కొందరు పరాకు చిత్తగించేవారుగా, అన్యమనస్కులుగావుండడం, కొన్ని ప్రత్యేక సందర్భాలలో తీవ్రమైన ఉన్మాదానికి లోనుకావడంవుంటె కొందరు కవులుకూడా ఈ రకమైన అలవాట్లను కలిగివుండడం గమనార్హమైన విషయం. కుళ్ళిన యాపిల్‌పళ్ళ వాసన తగిలేసరికి ఫ్రేడరిక్ షిల్లర్‌కి రాయాలనిపించేదట. వేడినీళ్ళ బొక్కెనలో కాళ్ళుపెట్టుకుని కూర్చుంటే తుర్గనీవ్‌కు రచన కొనసాగేదట. బాల్జాక్‌కు విపరీతంగా కాఫీ డికాషను తాగడంవల్ల రచన సాగేదట, శ్రీశ్రీకి సముద్రాన్ని చూసినప్పుడల్లా ప్రేరణ కలిగేదట. కుందుర్తి తరచుగా "అర్ధరాత్రి నేను కవిత్వం రాసుకునే వేళ" అనడం వుంది. పెద్దన్న ఏమన్నాడో మళ్ళీ చెప్పనక్కరలేదు. ఇలాగే రచయితల మతిమరపు మనస్తత్వంసైతం ఎవరికీ కొత్త విషయంకాదు.

మానసికరోగి తన అదుపులోగాని - ఇతరుల అదుపులోగాని వుండడు. ఉన్మాదం చెలరేగినపుడు గొలుసులతో కట్టిపడేసినా గింజుకుంటూనేవుంటాడు. కవిత్వం విషయంలోసైతం ఈ స్థితి ఎదురౌతుంది. అందుకే చెళ్ళపిళ్ళవారు "కవిత్వం పిచ్చివంటిది - పిచ్చివంటిదే కాదు. యేలాంటిదో చెప్పటానికి నాకు తోచడంలేదు. నా అనుభవములో కవిత్వమనేది తోచకనేపోవాలిగాని తోచినతర్వాత దాన్ని కాగితంమీద కెక్కించకపోతే అది వ్యాధినికూడా కలిగించి శరీరానికి అపాటవాన్ని తెస్తుందనే నమ్మకం" అన్నారు. కవిత్వం రాయాలనే తపనతో కొట్టుకునే అశక్తుడూ, తోచినదాన్ని వెంటనే కవిత్వంగా అనువదింపజేయడంలో విలంబనాన్ని సహించని శక్తిమంతుడూ అనుభవపూర్వకంగా మాత్రమే తెలుసుకోదగ్గదీవిషయం.

"నా వలెనె యాతడున్మత్త భావశాలి
ఆగికోలేడు రేగునూహల నొకింత"
"ఇంత చిరుగీతి యెదవేగిరించునేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును"

అనే చరణాలు ఈ అంశానికి బలమైన సాక్ష్యాలు "నా హృదయము నిత్యవేగి. నొంతవిలంబన మోర్వదు" అన్న విశ్వనాథ మాటలు కూడా ఇక్కడ స్మరింపదగ్గవి. ఇలాంటి విషయాలన్నింటిని ఆకళించుకున్నప్పుడు - సృజనాత్మకత మానసిక రోగలక్షణంతో కూడిన ఒకానొక మార్గం కావచ్చును. కాని ఉన్మాదం లేదా మతిచాంచల్యం ఎంతమాత్రం కాదు అన్న ఏంథొనిస్టార్ అభిప్రాయం ఎంతో విలువైనదిగా కనిపిస్తుంది. సృజనాత్మక మనోవిక్షిప్తికి చెందిన ప్రాంతంలో మనస్తత్వశాస్త్రజ్ఞుల ఆధునిక సాంకేతిక పరిజ్ఞానమంతా గుంటఓనమాలు దిద్దుడులో వుండుటే, మన మాశ్చర్యపోనక్కరలేదంటాడు ఫ్రాంక్‌బేరన్.

"కాల్పనికత హద్దు మీరితే ఉన్మత్తతలోకి దింపుతుంది" అంటారు కృష్ణశాస్త్రి. ఒక స్థాయిలో ఇది నిజమనిపిస్తుంది. భావకవుల కల్పనలు కొన్ని ఈ విమర్శను ఎదుర్కోవలసి వచ్చింది. అవి "అర్థమ్ము కాని భావగీతమ్ము" లని కొందరంటే "ఎవరికి తెలియని ఏవో పాటలు" అని మరికొందరన్నారు. కవులు కాల్పనిక ప్రపంచాన్ని అనంతంగా విస్తరించినప్పుడు, కవులు ఊహించిన దానిని పాఠకులు గ్రహించలేని సమయంలో పుట్టిన విమర్శ యిది. విశ్వనాథ కల్పనలు కొన్ని ఇందులోని మొదటి వర్గానికి చెందుతాయని కొందరి భావన. మనలో చాలామంది ప్రతిపదార్థానికి అలవాటు పడడంచేత తాత్పర్యానికి అనువుగాని కవిత వ్యర్థలేక ఉన్మాద ప్రలాపమని అనుకోవడం సహజమంటారు. ఆచార్య రోణంకి రానురాను కవితలో అస్పష్టత పెరుగుతున్నకొద్దీ ఈ దశ విస్తరించింది.

"సప్తసముద్రాలు జట్టుకట్టుకొని
అలతరంగిణి వాయిస్తున్నాయి
ఆకాశం చిరిగిపోయిన అరటిదొప్పలా
ఒక మూల పడివుంది
ఉల్లిపొర కాగితంలాగ
మృతించిన శేషుడు
భూమిని చుట్టుకొని ఉన్నాడు"

అని రాసిన కవి వస్తుతః ఉన్మత్తుడు కాదు కాని ఈ సంవిధానం వేగుంట చెప్పిన "గమ్యమే లేని జానేదేవ్ గాలి" వంటిది కావడంచేత అర్థతాత్పర్యాలను ఆశించే పాఠకుల దృష్టితో ఇది ఉన్మత్తకల్పనగా

మిగిలిపోతుంది. విజయనగరంలో అలాటి గీతాలను ఆలపించిన కవి అనాడు కొందరి దృష్టిలో ఉన్మత్తుడే అయ్యాడు.

ఈనాడు కలంపట్టిన ప్రతివాడు విప్లవం అనే మాటతో తన పేరును ఏదో విధంగా జత పరుచుకోవాలని ఉబలాట పడుతున్నాడో అలాగే మూడు నాలుగు దశాబ్దాల కిందట ఫ్రాయిడ్‌ను-వ్యక్తావ్యక్తాన్ని జపించడానికి కొంతమంది ఉత్సాహపడేవారు. వ్యక్తావ్యక్తంలో ఈత కొట్టడం సాహిత్య వృక్షంమీద చిటారుకొమ్మన కూర్చుని ఊగిసలాడడం తన పని అన్నాడు నారాయణ బాబు మనస్సంచారంలోని అసంలక్ష్య క్రమాన్ని పైకి తేవడం తనపనిగా శ్రీశ్రీకూడా పరిశ్రమించాడు. యథార్థానికి వ్యక్తావ్యక్తం సాహిత్య వృక్షానికి చిటారుకొమ్మా కాదు. మన స్సంచారంలోని అసంలక్ష్యక్రమాన్ని పైకి తెచ్చిన అతి నవీన కవితా మాధుర్యాన్ని ఇప్పటికి మేలుకున్న ప్రజలెవరూ దోసిళ్ళతో తాగనూ లేదు. ఎందుచేత ? దీనికి మూలం విశదం కాకపోవడంచేత అస్తవ్యస్తమే ఒక రూపంగా ఒక క్రమంగా భావించిన అధివాస్తవికులు అది తమ చైతన్యపరిధి నతిక్రమించి ప్రవర్తిస్తూన్న దనడానికి సరియైన దాఖలాలు చూపించలేరు. అది వారు సరించిన వెఱ్ఱి. తన అంతరంగ ప్రపంచాన్ని మార్పు చేయడానికి కవిత్వం చైతన్యపరిధి అంతటా శోధన కొనసాగిస్తుందని "క్రిస్టోఫర్ కాడ్వెల్" చెప్పిన మాట ఇక్కడ స్మరించదగ్గది. ఉద్దేశపూర్వకంగా ఎవడుమాత్రం అచేతన దశలోకి తన ఆలోచనలు మళ్లించగలడు ? కొందరు రచయితలు తమ గొప్పగొప్ప ఊహలకు అచేతనదశ మూలమని చెప్పడంవుంది. ఇది ఒక వైరుధ్యం,

"నిరంకుశాః కవయః" అనే మాట ఈనాటిదికాదు. ఈ రకమైన నిరంకుశత్వం మానసికరోగుల్లోనైతేం కనిపిస్తుంది, అయితే మానసిక రోగి తన నిరంకుశత్వానికి లోకం ఏవిధంగా ప్రతిస్పందిస్తుందనే ఊహనుకలిగివుండడు. కవి ఎంత విపరీత ప్రవృత్తికలవాడైనా లోకంయొక్క ఆమోదాన్ని కోరతాడు. సమకాలీనసమాజంలో అది లభించకపోతే రాబోయేకాలంలోనైనా ఆ ఆమోదం లభిస్తుందని ఆశపడతాడు. కాళిదాసు సమకాలీనులను అనునయించడానికి ప్రయత్నించడం, భవభూతి సమకాలికుల్ని లెక్కజేయక భవిష్యత్తుపై ఆశలు పెంచుకోవడం ఇందుకు తార్కాణాలు. అయితే లోకనిర్ణయం ఒక్కొక్కప్పుడు దాక్షిణ్యరహితంగా వుంటుంది. విపరీత ప్రవృత్తిని ప్రదర్శించిన వ్యక్తి ఆ నిర్దాక్షిణ్యస్థితిని ఎదుర్కోలేక తిరోగమిస్తే అతని స్వ… అంతటితో అంతరిస్తుంది.

"కాదన్న మాదన్న యెవడన్నా ఉండే
వేమన్న యేమన్నాడో చూడమందాం"

అంటూ వేరొక మార్గాన్ని ఆశ్రయించి స్వేచ్ఛాపతాకను ఎగురవే… ఉద్దేశపూర్వకంగా — ప్రకటంగా — బహిరంగంగా వింతగా ప్రవర్తి… అవహేళనకు గురికావడంద్వారా సిద్ధమైన తన శ్రమకు మూల్యం చెల్లించవలసివస్తుంది, ఫ్రెంచి సింబలిస్టు "ఆర్థర్ రింబాడ్" తీవ్రవా… ధోరణికి చెందిన కవితలు రాసేడు. కవితా ప్రపంచాన్ని వాస్త… ప్రపంచాన్ని ఒకటిగాచేయ సంకల్పించి విఫలుడయ్యాడు. కవిత్వ… అశక్తతను గుర్తించి విరక్తిచెంది తన కవితలను తానే తగులబెట్టి తనదేశం, ఖండం విడిచిపెట్టి దూరంగా సూడాన్‌లో వ్యాపారంచేసాడు చనిపోయేవరకు మరి కవిత్వం జోలికి పోలేదు. ఇలియట్ ఆధునిక నాగరికతలోని అల్పత్వాన్ని, వెలితిని వేలెత్తిచూపి దుఃఖించి చివరికి మతాన్ని ఆశ్రయించి మనశ్శాంతి పొందాడు. తన తీవ్రభావాలతో ఆంధ్రదేశాన్ని గంగవెర్రులెత్తించిన చలం అన్నిటినీ అధ్వాన్న… టడవిలో వదలి అరుణాచల శిఖరంమీదనుండి పరలోకం వెలుగుల… కుమ్మరించేడు. ఎంతటి విలువైన దైనా లోకానికి దానిని స్వీ… కరించే సంసిద్ధత లేనప్పుడు అది కేవలం వెర్రిమొర్రి ఊహగానే పరిగణించబడుతుంది. ఎందరో శాస్త్రజ్ఞులు, కళాకారులు తమ అమూల్య… భావాలను ప్రకటించడం ద్వారా లోకం దృష్టిలో పిచ్చివాళ్ళు కాలేదు

ఉర్విలోన మహాకవి మూగి యుండి
వాడు సర్వమ్ము భావనా పథిని జూచు
నల్పులం బోలె బ్రతుకులో ననుభవించె
ననుకొనుట పామరమ్మైన యూహ.

అనే విశ్వనాథ మాట కేవలం భారతీయ సాంప్రదాయ మార్గాన్ని వ్యక్తపరచేదిమాత్రమేకాదు ఆధునికపాశ్చాత్య విమర్శకుల…

సైతం కొందరీమార్గంలో వున్నారు. మానసికరుగ్మతను_సృజనవ్యాపారాన్ని ప్రేరేపించే అచేతనదశ ఒకటేనా అనే సందేహం ఒకటుంది. దానికి మారిషన్ ఒక సమాధానాన్నిచ్చివున్నాడు. అతని దృష్టిలో రెండు అచేతనదశలున్నాయి. ఆ రెండూకూడా జాగ్రదవస్థయొక్క గ్రహణకు అందనివే. అందులో ఒకటి సజీవమైన జలంతోకూడిన ప్రచేతనదశాసంబంధమైన శక్తి. రెండవది రక్తమాంసాలు _ సహజాతాలు — పురానుభవాల తాకిడులు _ అణగారిన భావాలు_వదలని జ్ఞాపకాలతో కూడిన గుప్తమైన లేదా స్వయంచోదితమైన అచేతన దశ. ఇందులో సృజనకారకమైన మొదటిదైన ప్రచేతనదశ దివ్యమైనదిగాను రెండవదైన అచేతనదశ స్వయంచోదిత లేదా బధిర అచేతనదశగాను అతడు పేర్కొన్నాడు. ఆధునికయుగంలోని మాంద్యమంతా ఫ్రాయిడ్ చెప్పిన ఈ రెండవ రకానికి చెందిన అచేతనదశను అభిమానించి మొదటిదైన ప్రచేతనదశను తిరస్కరించడం వల్లనే కలుగుతూందని అతని అభిప్రాయం. ఇక్కడకు చేరుకునేటప్పటికల్లా సృజనప్రాంగణంలో తిరిగి దివ్యత్వం అవతరించడం జరుగుతుంది. "యథామూషికమూషికః" అనే మాట గుర్తుకువస్తుంది. "అదేదో రాయిస్తుంది, అర్థమనర్థం. అదేది రాయిస్తే అదే కవిత్వం" అన్నాడు నారాయణ బాబు "పలికించెడువాడు రామభద్రుండట" అన్నాడు పోతన్న. ఇద్దరూ అజ్ఞాతశక్తి ప్రమేయంవల్ల కవిత్వం వ్రాస్తున్నామన్నవాళ్లే. అయితే ఒకరు ఫ్రాయిడ్ చెప్పిన అచేతనదశను, ఇంకొకరు దివ్యమైన అచేతన దశను విశ్వసించినవారు. ఇందులో మనం దేనిని విశ్వసించాలి? ఏది ఆరోగ్యవంతమైనది? ఏది మానసికరుగ్మతకు ప్రతిఫలం? అనే ప్రశ్నలున్నాయి. మనఃప్రపంచపుటావర్తాలకు కేంద్రమేది అనే విషయం ఇంకా శాస్త్రవిజ్ఞానానికి అందుబాటులో లేదు, అందుచేత పై ప్రశ్నలకు తార్కిక సమాధానాలు లభించవు. అక్కడ విశ్వాసం మాత్రమే పనిచేయగలదు. ఇతఃపూర్వం సుస్థాపితాలైన విషయాలు పునర్విచారణకు గురయ్యే సమయంలో ఇదమిత్థమనే సమాధానాలు లభించడం కష్టం. అంతవరకు కవిత్వం ఒక తీయని ఉన్మాదం.

## సంప్రదించిన గ్రంథాలు :


1. ది క్రియేటివిటీ అండ్ ఇంటెలిజెన్స్ — జాకబ్ డబ్లియు గెట్సలెస్ అండ్ ఫిలిప్ డబ్లియు జాక్సన్.
2. ది డైనమిక్స్ ఆఫ్ క్రియేషన్ _ ఆంతోని స్టార్.
3. ది రిలేషన్ ఆఫ్ ది పొయెట్ టుడే _ డ్రీమింగ్ : సిగ్మండ్ ఫ్రాయిడ్.
4. ది కలక్టెడ్ పేపర్స్ ఆఫ్ యంగ్ వాల్యూమ్ 4_1_17.
5. క్రియేటివ్ పర్సన్ అండ్ క్రియేటివ్ ప్రాసెస్ _ ఫ్రాంక్ బారన్.
6. ది యాక్ట్ ఆఫ్ క్రియేషన్ _ ఆర్థర్ కోస్ట్లర్.
7. మేఘసందేశం - కాళిదాసు.
8. కథలు-గాథలు - చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.
9. వ్యాసావళి-2 దేవులపల్లి వేంకట కృష్ణ శాస్త్రి.
10. కృష్ణపక్షము - దేవులపల్లి వేంకట కృష్ణ శాస్త్రి.
11. ఖడ్గసృష్టి - శ్రీశ్రీ.
12. రుధిరజ్యోతి - నారాయణబాబు.
13. విశ్వంభర - సి. నారాయణరెడ్డి.
14. చితి-చింత - వేగుంట మోహనప్రసాద్.

# బహిష్కరించకు!

వందారు జన మందారా!
అన్నమయ్య సంకీర్తనల నడిగి
భాస్వరతల్ని
వరదయ్య పదాల నడిగి
ప్రసన్నతల్ని
త్యాగయ్య కీర్తనల నడిగి
నాణ్యతల్ని
పోతన్న కైతల, నడిగి
చొక్కారాల్ని
గోపన్న భజనల నడిగి
మాధుర్యాల్ని
విశ్వనాథ రసధ్వనుల నడిగి
సుకుమారాల్ని
పట్టుకొచ్చి
ఒక్కటిగా ఉండకట్టి
నివేద్యంగా
"కవితల రూపంలో"
నీ ఎదుట - విరాళితో
ఉపాయనంగా పెడుతున్నాను :
అది "నీ సొంతం" కాదని
నన్ను అవమాన పెట్టకు।
అల్లరి పెట్టకు।
అల్లటు పెట్టకు
బహివెట్టకు।
బహిష్కరించకు।
అనుగ్రహించు। ఆదరించు।

# "వెలమగడు"

వంహాడు ముత్క
వేసేంతవరకు
"గాంధి"!
ఆ పైన
"గాడ్సే!"

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

కుమారి పి. చూడామణి

# కాకతీయ త్రిభువనమల్లుని నాటి మిట్టపల్లి శాసనము

ప్రస్తుత యీ శాసన శిలాస్తంభము మెదక్ జిల్లాలోని సిద్ధిపేట తాలూకాకు చెందిన మిట్టపల్లియను గ్రామములోనిది. ఇట్టి మిట్టిపల్లి గ్రామము సిద్ధిపేట హన్మకొండ మార్గమున సిద్ధిపేటకు సుమారు 10 కి. మీ. దూరముననున్నది. కాకతీయ త్రిభువనమల్లుని పేర్కొన్నది ఈ శాసన స్తంభము స్థానిక ఆంజనేయస్వామివారి ఆలయములో ప్రతిష్ఠింపబడియున్నది. నల్లఇసుకరాతి స్తంభములపై నలువైపుల చెక్కబడిన యీ శాసనము గల స్తంభ అడుగు భాగము ఆలయ వేదిక నిర్మాణమున పూడ్చబడియున్నది. అట్లు పూడ్చబడిన శాసన భాగమున స్థానిక మాండలికుని ప్రశస్తి సామాన్యముగా శాసన చివరి భాగములందు ధార్మిక శ్లోకాలు యుండియుండవచ్చునని యూహించుట కవకాశము గలదు.

శిల అరుగుదల వలన శాసనాక్షరములు అచ్చటచ్చట లుప్తమైనను, లేఖకుడు అక్షరములను లోతుగా చెక్కుటవలన శాసన సారమును సులభముగా గ్రహించుటకు వీలగుచున్నది. ఇందలి లిపి 11వ శతాబ్దము నాటిదగు తెలుగు–కన్నడ లిపి, భాష కన్నడము పూర్ణానుస్వారమును పంక్తిక్రమములోగాక అక్షరమునకు పైన కుడివైపున వ్రాయుటను నాటి కాలమునాటి శాసనములన్నింటివలె యిందుగూడ మనము గమనింతుము. – ఇందు లేఖకుడు కొన్ని పొరపాట్లు జేసినట్లు గూడ మనము గ్రహిస్తాము. మొదటివైపు 1/వ సూక్తిలో "ృ" త్వమునకు బదులుగా "ల" వ్రాసినదికి రెండవ వైపు 11వ పంక్తిలో "ల"కు బదులు "శ"ను చెక్కినాడు. ఇట్టివి కొన్ని మినహాయించిన శాసనమంతయు చక్కగానేయున్నది.

కళ్యాణి రాజధానిగా 11వ శతాబ్దము నాలుగవ పాదమునుండి 12వ శతాబ్దమునుండి రెండవపాద ప్రారంభమువరకు పరిపాలించిన చాళుక్యరాజగు త్రిభువనమల్ల, విక్రమాదిత్యుని (1076–1126 క్రీ.శ.) రాజ్యకాల వర్షములు 22లో (క్రీ శ 1098) వేయబడిన యీ శాసనమున అతని సామంత మండలేశ్వరుడగు కాకతి త్రిభువనమల్లుడు, అతనికి సామంతుడుగా "సబ్బిసాయిరము" లోనిదగు పుల్లునూరు నేలుచుండిన "పీరపరెడ్డి" యను పేర్కొనబడినారు. ఈ శాసనమున పేర్కొనదగిన కాకతి త్రిభువనమల్లుడెవరు? అతని రాజ్యతంత్రవరకు విస్తరించియుండెను. ఈ చరిత్రాంశములను చర్చించుటయే యీ వ్యాస ప్రధానోద్దేశము.

## శాసన విషయము :

శాసనను "స్వస్తి శ్రీ జయశ్చాభ్యుదయశ్చ" యను సంస్కృత వాక్యముతో ప్రారంభమగుచున్నది. పిదప శ్లోకములో శంభునికి నమస్కారము గావింపబడినది. పిదప కన్నడ గద్యలో చాళుక్యాది కులక్రమానత ప్రశస్తి శ్రీ త్రిభువనమల్లుని విజయరాజ్యముత్తరోత్తరాభివృద్ధి ఆచంద్రార్కముగా వర్ధిల్లుచుండవలెనని కీర్తింపబడినది. ఆపై అతని సామంతుడును, మరో మండలేశ్వరుడును, హన్మకొండ పురవరేశ్వరుడును పరమమాహేశ్వరుండును, పతిహితచరిత్రుండును, సుజనైక మిత్రుండును వినయ విభూషణుండును, రిపుబలశిరోశూలుండునునైన కాకతీయ త్రిభువనమల్లుని పేర్కొనదగినవాడు అతనికి సామంతుడు సబ్బిసాయిరము నేలుచున్న "పీరపరెడ్డి"ని ప్రశస్తిగల భాగము పూడ్చబడినది. అతను గావించిన దానము పేర్కొనుచున్నది. ఈ పీరపరెడ్డి చాళుక్య విక్రమ వర్షము 22లో బహుధాన్య సంవత్సర చైత్రబహుళ పంచమి బుధవారమున నాటి విషు సంక్రాంతి నిమిత్తమున క్రీ శ 1098 పుల్లునూర – 70కి చెందిన అగ్రహారం మిట్టపల్లి యందలి సోమేశ్వరదేవుని రంగభోగములకు, నిత్యనైవేద్యానందాది దీపములకు జీర్ణోద్ధరణ మొదలగువానికొరకు దాని యాచార్యుండగు బలిదేవుని పండితునికి గొట్టికుంట, మాదరాటడగట్లరో 2, కిరంబమత్తములు 40 గాణ 1 లు గల భూములను ధారాపూర్వకముగా సర్వబాధాపరిహారముగా గావించిన దానమును పేర్కొనుచున్నది. మిగిలిన శాసన భాగము ఆలయవేదికలో పూడ్చబడినందున యింతటితోనే, శాసన విషయము పరిసమాప్తియగుచున్నది నలువైపుల

గల శాసన పాఠము ననుసరించి చూచిన యిట్లు లుప్తమగు చున్నది. శాసన భాగమున స్థానిక మాండలికుడగు వీరపరెడ్డి ప్రశస్తి శాసన చివరి భాగములందు సామాన్యముగానుండు ధార్మిక శ్లోకాలు బహుశ యుండియుండవచ్చుననుటకు అవకాశము గలదు.

## చర్చనీయాంశములు :

సామాన్యముగా శాసనములందుండు దానముల వివరముల నింపక నటుండనిచ్చిన యీ శాసనమందు ప్రధానముగా చర్చకు వచ్చు అంశములివి,

1. చాళుక్యరాజగు త్రిభువన మల్లుని విక్రమాదిత్య – 6 (1076 - 1126 క్రీ. శ.) కి సామంతుడిగా నుండిన కాకతీయ త్రిభువన మల్లుడెవరు ?

2. అట్టి కాకతీయ త్రిభువనమల్లుని స్థానిక సామంతుడగు వీరపరెడ్డి ఎవరు ?

మొదట యీ శాసనమందు పేర్కొనబడిన కాకతీయ త్రిభువన మల్లు డెవరో విచారింతము.

చాళుక్య త్రిభువన మల్లునికి (విక్రమాదిత్య-6 1076 – 1126 క్రీ. శ.) సామంతత్వము నెఱపిన కాకతీయ రాజు మనకు ముప్వురు గనబడుచున్నారు. అట్టి ఆ ముగ్గురి కాకతీయ రాజుల, వంశ క్రమమును మన అవసరమేరకు గ్రహింతుము.




ఇట్లు మనకు చాళుక్య త్రిభువనమల్లుని (1076–1126) పరిపాలన కాలమున అతని సామంతులుగా కాకతీయ రాజులగు రెండవ బేతరాజు (1076–1107) అతని కుమారులగు త్రిభువనమల్ల, దుగ్గనృపతి[2] మరియు రెండవ ప్రోలరాజు (1116–1157)లు కానగుచున్నారు. ఈ ముప్వురిలో రెండవ ప్రోలరాజుకు త్రిభువనమల్ల బిరుదమున్నట్లు అతని శాసనములోగాని, అతని సంతతివారి శాసనములలోగాని,అతని మాండలికులు వేయించిన శాసనములలోగాని కానరాదు. కనుక మనకు మిగిలినవారు త్రిభువనమల్ల, దుగ్గనృపతి, మరియు అతని తండ్రి రెండవ బేతరాజు. వీరిలో ఎవరో ఒకరు మాత్రమే

మన ప్రస్తుత శాసనములోని కాకతి త్రిభువన మల్లుడు. మొ త్రిభువనమల్ల దుగ్గనృపతిని గురించి విచారింతుము– ఇంతవరకు ( మైన శాసనములలో మనకు యితని గురించి తెలిసికొనుటకు వే చిన ఖాజీపేట దార్గశాసనమొక్కటే[3] యాధారము. ఈ శాసనమం దుగ్గనృపతి"విక్రమచక్రి"బిరుదము గలిగిన తన తండ్రియైన ( రెం బేతరాజు గావించిన దానమును పేర్కొనుటయు, తాను స్వయమ గావించినన్ని దాన విషయములు గలవు. ఈశాసనమున (క్రీ.శ. 10 మూడవవైపున 16వ పంక్తి నుండి యితని ప్రశస్తి గలదు– అదెట్ల

పంక్తి 16 ............ ఆ బేతరసన
17 సుపుత్రః ॥ కుః విశకం సకళి చ
18 గత్రిశకం సౌజన్య సావ్వర్ భౌమ నె
19 నిప్పగ్గళకెగె (ఱ) స్త మహామన్ట్
20 శేశ్వరం దుగ్గనృపతి త్రిభువన మల్లం ॥

అని గలదు. అనగా 20వ పంక్తి ప్రకారము దుగ్గనృపతికి త్రిభు మల్లయని బిరుదము గలదన్నమాట. ఈ శాసన కాలము బహుదా సంవత్సరము ( శ. 1020 ) క్రీ. శ 1098 అగుచున్నది. ప్రస్తుత శాసన కాలము గూడ 1098 (సి. వి. 22) దే. కావున మిట్టపల్లిశాసనోక్త త్రిభువన మల్ల సామంతుడగు అనుమకొండా చాళుక్య వరేశ్వరుడైన కాకతీయ త్రిభువన మల్లుడు యీ దుగ్గన యనుటకు అవకాశము గలదు ఇందుకు మరింత సాక్ష్యాధారమ యితని ఖాజీపేటదార్గ శాసనమును, మరియు రెండవ బేతర శాసనములను వుగ్గడింపవచ్చును. ఖాజీపేట దార్గా శాసనమున మొ వైపుగల పంక్తులు 18 నుండి 22 వరకు యీ బేతరాజు అభివర్ణితు

పంక్తులు 18 సూనురస్య (ప్రోల) పరభూపద
19 వాగ్నిర్కోళమాలవ మదేభ మృ
20 గారిః విక్రమణ భువి విక్ర
21 మ చక్రి బేత భూపతి రతి ప్ర
22 థితో భూత్ "

అని గలదు. దీని వలన (రెండవ) బేతరాజుకు "విక్రమచక్రి యను బిరుదున్నటుల మాత్రమే స్పష్టమగుచున్నది. గాని "త్రిభు మల్ల" బిరుదమున్నట్లు కానరాదు. మరియు యీ శాసనమున రెండవవైపు 17 నుండి 25 వరకు.

పం_క్తి 17 తత్పాద

18 పద్మోపజీవి సమధిగత పంచ

19 మహాశబ్ద మహామణ్డలేశ్వర

20 నన్మకొణ్డాపురవరేశ్వరం పరమ

21 మహేశ్వరం ఏవిహిత చరి

22 త వినయ విభూషణం శ్రీ

23 మన్మహామణ్డలేశ్వర కాకతి

24 య బేతరస నన్మకొణ్డాపుర

25 ద నైరితి దిగ్భాగ దోట శివపు

ని గలదు. ఇందెచటను బేతరాజుకు త్రిభువనమల్ల బిరుదమున్నటుల రెండవవైపు) కానరాదు. ఈ శాసనాధారముగనే కీ॥ శే॥ శేషులైన ః నేలటూరి వెంకట రమణయ్యగారు (రెండవ) బేతరాజుకు త్రిభువన ల్ల బిరుదమున్నటుల పేర్కొనినారు.[4] కాని యీ శాసనాధారమునే ప్రామాణికముగా జూపుచు బేతరాజుకు త్రిభువనమల్ల బిరుదమున్నట్లు ప్పినవారి యభిప్రాయము సరియైనదిగాదు. ఇది యే కారణము తనో పొరపాటుగా దొర్లినది. ఈ శాసనమందెచటను అందుకు ఋజువు లేదు బహుశ బేతరాజు అనంతకాలమున అతని సంతతివారు యించిన శాసనములాధారమున వారు నిర్ధరించి యుందురు. ఇంత రకు తేలినదేమనగా దుగ్గ నృపతికి త్రిభువనమల్ల బిరుదము గలదని, సీసము యీ ఖాజీపేట దార్గ శాసనకాలము నాటికి (రెండవ) క్రీ. శ. 1098) బేతరాజుకు "త్రిభువనమల్ల" బిరుదము లేదని ్పష్టమగుచున్నది.

ఇక (రెండవ) బేతరాజు కాలమునాటి పుపలభ్యమగు శాసనములను గూడ పరిశీలింతుము—మనకు (రెండవ బేతరాజు) కాలమున బేతరాజును గురించిన శాసనములు బహుళముగా లభ్యముగాలేదు. లభ్యమైన మరికొన్ని అతని శాసనములలో కుమరాపల్లి[5] (వరంగల్ జిల్లా) బాలాజిపేట[6] (వరంగల్ జిల్లా) శనిగరం[7] (కరీంనగర్ జిల్లా) శాసనములు గలవు. శ 1001 (క్రీ. శ. 1079) తేదీ గల కుమరాపల్లి శాసనమందు పం_క్తి—

1. శ్రీ మాన్విక్రమ చక్రి శ్రీ బేత [మ]

2. ణ్డలి కోత్తమః ప్రాదాత్తోపిలీశ్వరేశాయ

3. దీపమా చంద్ర వారకం ॥ స్వస్తి శక వర్షకంబు

4. క్రీ. శ. 100 మగు సిద్ధార్థ సంవత్సర

5. సూర్య గ్రహణంబున శ్రీ మన్మహా మ

6. ణ్డలేశ్వర బేత రాజులు — — —

అని గలదు. ఇచ్చట (రెండవ) బేతరాజు "శ్రీమాన్ విక్రమ చక్రి శ్రీ బేత మండలి కొత్తమః" అని ప్రశంసించ బడినాడు. కాని ఇందెచటను అతనికి "త్రిభువనమల్ల" బిరుదమున్నటుల కానరాదు.

ఇక బాలాజీపేట శాసనమందు శ. 1004 క్రీ. శ. 1082) మొదటి వైపు 18 నుండి 26 వరకు.

పం_క్తి :

18 — — — సమ

19 ధిగత పంచమహాశబ్ద

20 మహా మణ్డలేశ్వరనమ్మ

21 కుణ్డపురవరేశ్వర

22 పరమ మహేశ్వర ప

23 తిహిత చరిత విన

24 య విభూషణ శ్రీ

25 మన్మహా మణ్డలేశ్వర

26 కాకతీయ బేతరసరో

అని గలదు. ఇందు కూడ బేతరాజు (రెండవ) రాజుకు త్రిభువనమల్ల "బిరుద మున్నటుల కానరాదు" - ఇక శకము.1022(క్రీ. శ. 1107) తేది గల శనిగరం (కరీం నగర్ జిల్లా) శాసనమున[8]

11 — —తత్పా

12 ద పద్మోపజీవి సమ

13 ధిగత పంచమహా శ

14 బ్ద మహా మండలేశ్వరం

15 నన్మ కొండా పురవ

16 రేశ్వరం (పర) మ మహే

17 [శ్వరం] పతిహిత చారి

18 — — య విభూషణం శ్రీ

19 మన్మహా మణ్డలేశ్వరం

20 కాకతీయ బేతరసర్

అని గలదు. (రెండవ) బేతరాజును దెలుపు శాసనముల లో నిది కడపటి శాసనము. క్రీ. శ. 1107) కాని యిందెచటను గూడ బేతరాజుకు త్రిభువన మల్ల బిరుద మున్నటుల కానరాదు.

పై పరిశీలన వలన తేలిన అంశము లేవియన కాకతీయ బేతరాజు (రెండవ) కుమారుడగు దుగ్గనృపతికి (క్రీ. శ. 1098) మాత్రమే "త్రిభువనమల్ల" బిరుదము గలదు, కాని బేతరాజుకు

మాత్రము అట్టి బిరుదము లేదు. కావున ప్రస్తుతమైన చాళుక్య విక్రమ శకము 22 (క్రీ. శ. 1098) తేది గల మిట్టపల్లి శాసనమున పేర్కొనబడిన చాళుక్య త్రిభువన మల్లుని సామంతుడుగా పేర్కొనబడిన కాకతీయ త్రిభువన మల్లుడు, బేతరాజు రెండవ కుమారుడైన త్రిభువనమల్ల దుగ్గ నృపతియే కావచ్చుననుటకు అవకాశమున్నది.

ఈ విషయమిటులుండనిచ్చి రెండవ బేతరాజు అనంతర కాలము నాటి కొన్ని శాసనాధారములను గూడ పరిశీలింతము.

1. హన్మకొండ పద్మాక్షి దేవాలయము లోని దగు రెండవ ప్రోలరాజు శాసనము.
2. హన్మకొండలోని రాజరాజ నరేంద్ర గ్రంథాలయ మందున్న శాసనము 10.

పద్మాక్షి దేవాలయము లోనిదగు కాకతి రెండవ ప్రోలరాజు శాసనములో ప్రోలరాజు (రెండవ) తాను త్రిభువనమల్ల మండళిక భూపాలుని పుత్రుడని చెప్పుకున్నాడు.

పంక్తి :-

70. ఆదక్కన్ నిత్య పూజనం ధూప దీప నివేద్య
71 క్కం పూజారి గాహార వస్త్రాదిక్గం
72. శ్రీమత్త్రిభువన మల్ల మండళిక భూపాల
73. శ పుత్ర నప్ప కాకతీయ పోళతిరసరణ రా
74. జ్య ముత్త రోత్న రాభి వృద్ధి ప్రవర్ద్ధమాన.

అనగా ప్రోల రెండవరాజు త్రిభువన కాకతీయ మల్లుని పుత్రుడనునది స్పష్టము. ఈ శాసనమందే రెండవ వైపు కాకతీయ వంశ క్రమమును దెల్పు పంక్తి 30 నుండి బేతరాజు (రెండవ) అభివర్ణితుడు. పిదప పంక్తి 42 నుండి ప్రోల (రెండవ) రాజు వర్ణింప బడినాడు. కనుక బేతరాజు (రెండవ) కుమారుడు ప్రోల రాజు (రెండవ) అనునది స్పష్టము. అనగా యీ శాసనములోని పంక్తులు 70–74 మరియు పంక్తులు 30 నుండి 41 వరకు గల దానిని సమన్వయించి చూడగా ] త్రిభువనమల్ల మండళికుడు, బేత రాజు రెండవ లు ఒక్కరే యనునది స్పష్టమగుచున్నది. అనగా రెండవ బేత రాజుకు "త్రిభువనమల్ల" బిరుదము గలదన్న మాటే.

ఇక హన్మకొండలోని రాజరాజ నరేంద్ర గ్రంథాలయ శాసనములో గల శాసనములో లకులీశాసమ వేదియగు రామేశ్వర పండితునకు, వైజన పల్లిని శివ పురముగా మార్చి తన (ప్రోల 2) జనకుడైన త్రిభువన మల్లావనీశుడు గావించిన దాన ధర్మములు వర్ణించబడినవి. ఈ విషయము నే త్రిభువనమల్ల దుగ్గ నృపతి నెలకొల్పిన క్రీ. శ. 1098 ఖాజీపేట దర్గా శాసనము ప్రతిపాదించుచున్నది. అందు

పంక్తి :-

20. ... ... విక్ర
21. మ చక్రి బేత భూపతి రితి ప్ర
22. థితో భూత్ ॥ అన్మకొండ పురేవా
23. టిం తద్ధ౯ శివపురాణ్యయం కృత్వా వి

అని గలదు.

ఈ శాసన మందే పంక్తి 6 నుండి 16 వరకు బేత రాజు (రెండవ) శ్రీ పర్వత మల్లికార్జున శివా చార్యుడైన రామేశ్వర పండితునికి గావించిన దాన ధర్మములు అభివర్ణింప బడినవి. అనగా ఖాజీ పేట దర్గా శాసనము లోని రామేశ్వర పండితునికి దానము గావించిన వాడు శివపురము నిర్మించిన వాడును యైన బేతరాజు (రెండవ), రెండవ ప్రోల రాజు, నాటిదగు హన్మకొండ లోని రాజ రాజ నరేంద్ర గ్రంథాలయము నందలి శాసనములో పేర్కొన బడిన యేట దాన ధర్మములు గావించిన జనకుడైన (ప్రోల 2 కు) త్రిభువన మల్లాధీశుడు కాని యీ శాసన ప్రమాణము లన్నియు బేత రాజు రెండవ అనంతరము అతని సంతతి వారు వేయించిన వని గుర్తించు కొన వలసియున్నది. ఒక్కడే యనుట నిర్వివాదాంశమని— అనగా రెండవ బేతరాజుకు త్రిభువనమల్ల బిరుదము గూడ గలదనుట స్పష్ట మగుచున్నది. కాకతీయ రుద్రుని హన్మకొండ శాసనము గూడ యీ విషయమునే ధృవీకరించుచున్నది. (2 ప్రోలరాజుకు జనకుడు)

పై చర్చవలన మనము రెండవ బేతరాజు కుమారుడు దుగ్గ నృపతికి త్రిభువనమల్ల బిరుదము గలదనియు, మరియు అతని జనకుడైన బేతరాజుకుగూడ అతని అనంతర శాసనము మూలమున "త్రిభువనమల్ల" బిరుదము గలదనియు తెలిసికొంటిమి. కాని వీరిలో యొకరే మన ప్రస్తుత శాసనమందలి కాకతి రాజగు త్రిభువన మల్లుడుకాదగును. కనుక ఉభయవాదములను అందలి సత్యాసత్యముల నరసిననేగాని సరిగా మన కాకతి త్రిభువన మల్లుడెవ్వరో గుర్తించలేము.

త్రిభువనమల్ల దుగ్గనృపతి విషయమున అతనికి గల త్రిభువన మల్ల బిరుదమును గురించి మనకెట్టి ఆక్షేపణ కవకాశములేదు, అట్లుగాక రెండవ బేతరాజు విషయమున అతనికి "త్రిభువనమల్ల" బిరుద మున్నటుల జెప్పుచున్న అతని అనంతర కాలమున అతని కుమారుడగు రెండవ కుమారుడగు ప్రోలరాజు అతని సంతతివారు. వేయించిన శాసనములలోని విషయము పలు సందేహముల కాస్పదమగుచున్నది. శాసనాధారములలో బేతరాజు రాజ్యాధికార కాలము పరిశీలించి చూచిన

అతడు 1079 నుండి 1107 వరకు జీవించియున్నటుల స్పష్టమగుచున్నది. — కాని అతను పేర్కొను యీ మధ్యకాలమునాటి శాసనము యేదియు యితనికి, త్రిభువన మల్ల బిరుదమున్నటుల పేర్కొనుటలేదు. హన్మకొండ పద్మాక్షి శాసనములో ప్రోలరాజు తన తండ్రి దుగ్గరాజైన బేతనకు దండాదినాథుని ప్రోద్బలమున చాళుక్య చక్రవర్తియగు త్రిభువనమల్లుని దయాప్రసాదమున సబ్బిసాయిరమండలము సంక్రమించెనని చెప్పుచున్నాడు. కాని త్రిభువన మల్ల బిరుదముగూడ సంప్రాప్తించెనని తెల్పుటలేదు. నిజమున కిట్టిసందర్భమున అట్టి బిరుదమే రెండవ బేతరాజుకు కలిగినయెడల అట్టి ప్రస్తావన యీ శాసనమందు తప్పక ప్రోలరాజు చెప్పియుండవలసినది, కావున సబ్బిసాయిరమండలముతోబాటు బేతరాజుకు "త్రిభువన మల్ల" బిరుదము ప్రాప్తించుట అనునది సందేహాస్పదము. అందుకు ప్రమాణములేదు. కనుక ఇటీవల బయట పడిన శనిగర శాసనము మూలముననే బేతరాజు 1107 వరకు జీవించి యున్నటుల స్పష్టమగుచున్నది. కాని అందును ఇతని త్రిభువన మల్ల విశదమున్నటుల కానరాదు. బహుశః దుగ్గనృపతి తన తండ్రి బేతరాజు జీవిత కాలముననే గతించియుండవచ్చును. అతని బిరుదమును అతని యనంతరము వచ్చిన ప్రోలరాజాదులు గ్రహించి యుండవచ్చును. ఇట్టి బిరుదావళులను పరంపర గ్రహించుటను మనము అనేక రాజవంశ శాసనములందు తఱచుగా చూచుచుండుట గలదు. కనుక మన ప్రస్తుత మిట్టపల్లి శాసనము చాళుక్య విక్రమ శకం 22 బహుధాన్య చైత్ర బహుళ పంచమి విషు సంక్రాన్తి చైత్ర మాసములోని సంక్రాంతి అనగా మేషసంక్రాంతి (క్రీ. శ, 1098) ఫిబ్రవరి/మార్చి నాడు త్రిభువన మల్లుడను బిరుదము గల రాజు, కాకతీయ వంశస్థుడనుట వలన బహుశః దుగ్గనృపతికి ఖాజీపేట దర్గా శాసనకాలమునాటికి ముందే (అనగా మిట్టపల్లి శాసనము కాలము నాటికి ముందే (అనగా మన మిట్టపల్లి శాసనము కాలమునాటికి అనగా సుమారుగా 8 మాసములకు ముందే) త్రిభువనమల్ల బిరుదము లభించి యుండును. ఈ బిరుదము రెండవ బేతరాజుకు గలదను వాదము అతని అనంతరకాలము నాటిదగుట వలనను, అతని జీవిత కాలములో లభ్యమగు శాసనములందెచ్చటను విక్రమ చక్రి బిరుదముతోబాటు "త్రిభువన మల్ల" బిరుదము కానరాకుండుట వలన ప్రస్తుత శాసనోక్తి త్రిభువన మల్లుడు దుగ్గనృపుడౌనని నమ్ముటకవకాశమగుచున్నది. నాటికి దుగ్గనృపతి సజీవుడే యనునదిగూడ స్పష్టము.

ఇక రెండవ చర్చనీయాంశమును వీరపరెడ్డిని గురించి_

ఇతని గురించిన ప్రశస్తి గల శాసన శిలాభాగము ఆలయ వేదికలో పూడ్చబడినందున యతని వివరములరయుట కవకాశములేదు. కాని సబ్బిసాయిరములోనిదగు పుల్గనూర — 70 కి చెందిన భూభాగమునకి వీరపరెడ్డి యేలికయని మనము మిట్టయగ్రహారములోని సోమేశ్వరదేవునికి యితడు గావించిన దాన ధర్మముల మూలమున గ్రహింపవచ్చును. రట్టుడు, రడ్డి, ర్రెడ్డి యనునవి సమాన పదములు — ఈ వీరపరెడ్డి నేటి రెడ్డి కులస్థుడు కావచ్చునేమో. ఈ శాసనము వలన ప్రస్తుత సిద్ధిపేట ప్రాంతమంతయు (మిట్టపల్లి – సిద్ధిపేటకు 10 కి. మీ. కాకతి బేతరాజుకు అతని కుమారుడగు దుగ్గనృపతికి లోబడి యుండెనని తలంపవచ్చును.

మిట్టపల్లి అగ్రహారము – ఈ శాసనమందు మిట్టపల్లి యొక అగ్రహారమని నేటికీ అచ్చట సోమేశ్వరాలయమున్నట్లు ధృఢపడుచున్నది. నేటికి యీ ఆలయము మిట్టపల్లిలో గలదు. మరియు ఈ అగ్రహారము సబ్బిసాయిరములోనిదగు పుల్గనూరు 70 కి చెందినదిగా చెప్పబడినది.

పుల్గనూరు :– 70 – మన ప్రస్తుత శాసనమున పుల్గనూరు 70 అని దాని క్రింది గ్రామమే మిట్టపల్లి యని గలదు. ఈ పుల్గనూరు 70 అనగా 70ది గ్రామముల పరిమితమగు పుల్గనూరు మండలమని తాత్పర్యము. ఇట్టి పుల్గనూరు ప్రస్తావన శనిగరం శాసనమందును గలదు.[11] అందు "పుల్గనూర.– 70 ఱ బళయ సనీగరన" అని గలదు. అనగా యిట్టి మండల విస్తృతి నేటి కరీంనగర జిల్లాలోని శనిగరం మొదటకాని, సిద్ధిపేట తాలూకాలోని ప్రస్తుత మిట్టపల్లి వరకుండెననియు, యిది తొలి కాకతి రాజుల స్వాధీనమున నుండెననియు చెప్పవచ్చును.

## శాసన పాఠము

మొదటివైపు

1. స్వస్తి శ్రీ జయశ్చా
2. భ్యుదయశ్చ।
3. నమస్తుంగ శిర
4. శ్చుంబి చంద్ర చామ
5. ర చారవే త్రైలోక్య
6. నగరారంభ మూళ
7. స్తంబాయ శాంభవే ?
8. స్వస్తి సమస్త భువ
9. నాశ్రయ శ్రీ పృధ్వీ
10. వల్లభ మహారాజా
11. ధిరాజ పరమేశ్వర ప
12. రమ భట్టారకం సత్యాశ్రయ
13. కుళదిళకం చాళుక్యా
14. భరణం శ్రీ మత్త్రి

15. భువన మల్లదే
16. వర విజయ రాజ్య
17. ముత్తరోత్త్రి రాభి వ్రి (వృ)
18. ద్ధి ప్రవర్ధ మాన
19. మా చంద్రా ర్క తారం
20. సలుత్తు మీరె తత్పా
......... (మిగిలిన భాగము పూడ్చబడినది)

రెండవ వైపు :

1. శ్రీ పాదపద్మో ప
2. జీవి సమధి
3. గత పంచమహాశ
4. బ్ద మహా మణ్డ లే
5. శ్వర నన్మకుండా పు
6. ర వరేశ్వరం పరమ
7. మహేశ్వరం పతి హిత
8. చరిత్రం సుజనై క
9. మిత్రం వినయ వి
10. భూషణం రిపు జ
11. శ [ల] ధి శోషణం శ్రీ
12. మన్మహా మణ్డలే
13. శ్వరం కాకతీయ త్రి
14. భువన మల్లిరస
15. ర తత్పాద పద్మోప
16. జీవి [సబ్బి] సాసిర
(యీ భాగము పూడ్చబడి యున్నది)

మూడవ వైపు :

1. వీఅప రెడ్డి శ్రీమ
2. చ్చాళుక్య విక్రమ
3. వర్ష ద ౨౨ నేమ
4. బహుధాన్య సం వ
5. త్సరద చైత్ర బ
6. హుళ 01 బుద
7. వార దన్దిన విషు
8. సంక్రాన్తి నిమిత్త
9. డిం పుల్గనూరె
10. 10 అ బళియ
11. అగ్రహారం వి
12. ట్టపళ్ళియ సో
13. మేశ్వర దేవగెర్గాం
14. [బ్రహ్మే] శ్వర దీప
ఈ భాగము పూడ్చబడియున్నది.

నాలుగవ వైపు

1. న రంగ భోగక్కం నిత్య
2. నివేద్యక్కం నన్దా దీప
3. గెక్కం జీర్ణో ద్ధారన
4 వ కమ్మ క్కం వాగి అ
5. ల్లి మాచామ్మ [బ] ల
6. దేవ పణ్డిత దేవగ్గె
7. కాల్గెచ్చి దారా పూర్వ
8. కం గొట్టికుంట ౧ ఒ
9. మల్మాదో వాటణ ౧
10. గడ్డి మత్తే 2 కరంబ
1 . మత్త ళం గా ణ 11
12. ఇన్ని నితు మం సర్వ బా
13. ధా పరిహారం కా ముడ
14. వరి ధమ్మ
... ... ... గో బ్రాహ్మ
(ఈ భాగము పూడ్చబడినది)

## అధోజ్ఞాపికలు

1. కాకతీయులు, డాక్టర్ పి. వి. పి. శాస్త్రి. పేజి 36.
2 ఖాజీపేట దర్గ శాసనము, పేజి ౪3. పంక్తి 17-20.
3. అదే
4. వరంగల్ శాసనములు, పేజి 16.
పరిచ్ఛేదము, 2, 4వ పంక్తి.
5. కుమరాపల్లి శాసనము, పేజి 25 - 26.
6. బాణాజీపేట శాసనము, పేజి 26-30.
7. కనిగిరం శాసనము, పేజి 49-52.
8. అదే
9. హన్మకొండ పద్మాక్షి దేవాలయ శాసనము, పేజి 55-60.
10. వరంగల్ శాసనము, పేజి 92.
11. పైదే, పేజి 51 వరుస 32.




ఉదయం వేళ - ఆరూముప్పావు దాటింది. ఢిల్లీవెళ్లే కర్నాటక ఎక్స్‌ప్రెస్ సికింద్రాబాదు స్టేషన్‌లో సిద్ధంగా ఉంది.

క్రియామూర్తి స్టేషన్ బయట ఆదరా బాదరా ఆటో దిగాడు. రెండు చేతి సంచులతో కంగారు కంగారుగా ప్లాట్‌ఫారం మీదికొచ్చాడు. రిజర్వేషన్ చార్టుల దగ్గరకొచ్చి తన లగేజిని దింపుకుని రుమాలుతో మొహం తుడుచుకుని, తాపీగా జేబులోంచి టికెట్లు తీసి చూసుకున్నాడు. రిజర్వేషన్ చార్టుల్లో తన పేరు లేదు. మళ్ళీ మళ్ళీ కిందకీ పైకీ గుచ్చి గుచ్చి చూశాడు. ఎక్కడా తన పేరు లేదు. అదిరిపోయాడు.

లగేజినంతనీ మోసుకుంటూ గబగబా ప్లాట్‌ఫారం వైపునుంచే రిజర్వేషన్ రూమ్ దగ్గరకొచ్చాడు. అదృష్ట వశాత్తూ తలుపు తెరిచుంది. లోపలికెళ్ళి గళ్ళచొక్కా గుమాస్తాతో ఏదో చెప్పబోయాడు.

ఆ గుమాస్తా కర్కశంగా "మీరు లోపలికి రాకూడదు. అటు తిరిగి బయటినించి కిటికీ దగ్గరికి రండి!" అన్నాడు.

"బయట చాలా పెద్ద క్యూ ఉంది గదా" అన్నాడు క్రియామూర్తి.

"ఉంది. ఉంటే?...ప్లీజ్ గో అవుట్! కమ్ దట్ సైడ్!"

"వెళ్ళానుసార్, వెళ్ళక ఇక్కడ ఉంటానా ? ... ఈ రిజర్వేషను టికెట్ చూడండి. ఈ రోజు కర్నాటకకి పదిరోజుల క్రితం దీన్నిమీరే నాకు ఇష్యూ చేసారు. ఇప్పుడు చార్టులో నా పేరు లేదు. ఏం చెయ్యాలి. ?"

"ఏంటి, మీ పేరు లేదా?..." గుమాస్తా చటుక్కున తన వాచీ చూసుకున్నాడు. చకచకా రిజిస్టరొకటి తిరగేసాడు. చటుక్కున దాన్ని మూసేసాడు. మూర్తివైపు ఎగా దిగా ఓ సారి చూసాడు. అన్నాడు "ఉండే ఉంటుంది. చూసుకోండి ! టికెట్ ఇష్యూ చేశాక కోచ్ ఎల్లాట్ చేయకుండా ఉంటామా, చార్టులోకి ఎక్కకుండా ఉంటుందా. వెళ్లండి, వెళ్లి మరోసారి చూసుకోండి!"

మూర్తి తన లగేజి కిందికి దించాడు. నిశ్చయంగా అన్నాడు. "చూసానండి" మూడు సార్లు చూశాను. అన్ని పేర్లూ కింతస్థం కూడా చేశాను. కానీ నా పేరు లేదు."

"ఎందుకుండదండి ! ఉండే ఉంటుంది. వెళ్ళి మరోసారి చూడండి."

మూర్తి ఏదో అనబోయాడు. గుమాస్తా మీదపడి కొట్టినంత పనిచేస్తూ గదమాయించాడు. "ఇంకోసారి చూడమని చెబుతూంటే మీగ్గాదూ !... ఇదిగో, ఇంకో పది నిమిషాల్లో బండి వదిలేస్తున్నాడు... మీ ఇష్టం !"

మూర్తికి సహనం చచ్చింది అన్నాడు. "నో యూజ్ ఆఫ్ ట్రయింగ్ సార్ !...మీరొచ్చి చూపించండి థాంక్స్ చెబుతాను.... అసలు మీ దగ్గర చార్టుకాపీ ఉంటుంది కదా ! అందులో చూడండి !"

అమాయకుణ్ణి చూసినట్టు మూర్తిని చూసాడు గుమాస్తా. చటుక్కున సీట్లోంచి లేచి "సరే" నంటూ అంతవరకూ పక్కన నుంచుని చూస్తూన్న తెల్లచొక్కా గుమాస్తాతో "ప్లీజ్, నా వర్కు చూస్తుండండి" అని, చటుక్కున బయటికెళ్ళిపోయాడు.

రెండు మూడు నిముషాలు గడిచాయి. తెల్లచొక్కా గుమాస్తా, బయట క్యూలో ఉన్న వాళ్లిద్దరికి రిజర్వేషన్లు రాశాడు. మూర్తికి క్షణం ఒక యుగంగా గడుస్తోంది. అటూ ఇటూ చూస్తూ నుంచున్న వాడల్లా ఈ గుమాస్తాతో "ప్లీజ్, మీరైనా చూడండి, మీ ఆఫీస్ కాపీలోనైనా నా పేరుందో లేదో !" అన్నాడు.

తెల్లచొక్కా గుమాస్తా ఉండదుసార్, అక్కడ లేకపోతే ఇక్కడా ఉండదు. కావలిస్తే చూడండి" అంటూ అక్కడున్న ఫైల్లోంచి చార్టులు తీసాడు. పేజీలు తిప్పి మూర్తికి చూపించాడు. అన్నాడు "మీ పేరు చార్టులోకి ఎక్కలేదు. మిస్సయింది."

మూర్తి హతాశుడయ్యాడు. "నన్నిప్పుడేం చెయ్యమంటార పోనీ ఖాళీ బెర్త్ ఏదయినా ఉంటే ఇప్పుడు ఎల్లాట్ చెయ్యండి."

"బుకింగ్‌లో ఖాళీ ఒక్కటి కూడా లేదు. కాన్సిలేషన్సూ త్రూ బెర్త్ ఏదైనా ఖాళీ ఉందేమో, లేట్ కాన్సిలేషన్ ఏదైనా వ దేమో వెళ్లి కండక్టర్లని అడగండి."

మూర్తి టైము చూసుకున్నాడు. ఏడూ ఎనిమిది ! "ఇ ఖర్మండీ నాకు ! పదిరోజుల క్రితం రిజర్వేషను చేసుకున్నా న్యూసెన్సు తప్పుకపోవటమేంటండీ" అన్నాడు. చకచకా సంచ బయటికి నడిచాడు.

ఒక టి. టి. యి. ని కలిసాడు. తన సెకండ్ క్లాస్ టికెట్టు చూపించి తన పరిస్థితిని వివరించాడు. ఏ. సి. క్లాసులోనై సరే ఒక్క బెర్తు ఇప్పించమన్నాడు. కనీసం ఎక్కడైనా సీటు ఇప్పించమని దీనంగా బతిమాలుకున్నాడు.

కండక్టరు వింతగా చూసాడు. నవ్వాడు. అన్నాడు. "ఏ సార్, ఆసియాడ్ ఆటలు జరుగుతున్నాయి గదా, బెర్తులు వుంటాయా ! ఏ. సి. టికెట్టుతో గూడ్సు వాగన్లు ఎక్కమన ఎక్కేస్తారు. అట్లా ఉన్నారు జనం. సారీ, నేనేం చెయ్యలే నేనే కాదు ఏ. టి. టి. యీ. కూడా ఏమీ చెయ్యలేడు మీరాయ సొంత అల్లుడైనా సరే !"

సార్, సార్, ఈ బండీలో ప్రయాణం చెయ్యకపోతే జీవితమే నాశనమైపోతుంది. తప్పొకరిది శిక్షొకరిదీనా !... నేనేం చెయ్యాలో చెప్పండి, ప్లీజ్ !"

"మీరేం చేసినా చెయ్యకపోయినా ఈ బండీలో మా ప్రయాణం చెయ్యలేరు. ఐయామ్ సో సారీ సర్ !" టి. టి. య ఎటో వెళ్లిపోయాడు.

• • • •

పక్కన నుంచుని వింటున్న ప్రయాణీకులు ఇద్దర్లో ఒక "ఈ రైల్వే లం — కొడుకులింతేనండి. సీట్లు అమ్మేసుకుని అ పోయినయ్యంటారు. ఈదెక్కించడనుకోండి, ఇంకెవణ్ణో ఎక్కి నివ్వడు... ఓ పాతికో యాభయ్యో తీసి ఆడి జేబులో కుక్కెయ పోయారా! — ఏంటో అమాయకుళ్ళాగున్నార్రా!" అన్నాడు.

• • •

క్రియామూర్తికి ఏడుపొచ్చినంతపనైంది. స్టేషను సూపర్నెంట రిపోర్టు చెయ్యక తప్పదనుకున్నాడు. వెళ్ళాడు. సూపర్నెంట కలిసాడు. అన్నాడు : "సార్ రేపు సాయంత్రం నాకు ఢిల్లీ ఇంటర్వ్యూ ఉంది. ఎంతో శ్రమపడితేనే గాని ఈ ఇంటర్వ్యూ రాలే

' కన్యాయం జరిగింది. నా పేరు రిజర్వేషన్ చార్టులో లేదు. నికి బాధ్యత ఎవరని అడగటంలేదు. నాకిప్పుడు ఎకామడేషన్ ప్పించండి, ప్లీజ్! ''

సూపర్నెంటు " అరెరె! " అన్నాడు. చీప్ రిజర్వేషన్ న్స్పెక్టర్ దగ్గరకెళ్ళాడు. రిజర్వేషన్ చార్టునూ, మూర్తి టిక్కెట్లనూ రిశీలించాడు. "మీ పేరు చార్టు కెక్కలేదు. ఎక్కడో పొరపాటు రిగింది.'' అన్నాడు. రిజర్వేషన్ గదిలోకెళ్ళాడు. అక్కడ, ఇందాకటి ల్లచొక్కా గుమాస్తాయే కూర్చొనున్నాడు. ఆ రిజర్వేషన్ తను ౘక్ చెయ్యలేదనీ, చార్టు తయారుచేసేది కూడా ఆ ఇంకో గుమాస్తాయే నీ అతను చెప్పాడు. ఆ ' ఇంకో గుమాస్తా ', గళ్ళచొక్కా ుమాస్తాయే ననీ మూర్తికి అర్థమయింది.

"ఆయనేడి?" - అడిగాడు సూపర్నెంటు.

"లేడు సార్, బయటికెళ్ళాడు'' అన్నాడు ఆ గుమాస్తా.

సూపర్నెంటు చార్టుతో మళ్ళీప్లాట్ఫారంమీదికొచ్చాడు. ఎవడో ర్టర్ని పిలిచి ఎవర్నో కలుసుకుని బెర్తుండేమో కనుక్కు రమ్మని లిచాడు. రిప్లయి కార్డులాగా నిమిషంలో వెనక్కొచ్చేశాడు, "ఒకటి ండా ఖాళీలేదంట సార్!" అన్నాడు

సూపర్నెంటు హఠాత్తుగా టైము చూసుకున్నాడు. "అరె! యిదు నిమిషాలు లేటు. ఇంకా స్టార్ట్ వ్వదేంటి!'' అన్నాడు.

అక్కడే ఉన్న పోర్టరు "వాక్యూమ్ డౌనయింది సార్ ఇంకా ౩ నిమిషాలు పడుతుందిట'' అన్నాడు.

సూపర్నెంటు చటుక్కున కదలబోయాడు. మూర్తి, "సార్, మా దేంటి?'' అన్నాడు.

ఇహ తప్పదన్నట్టు మొహంపెట్టి సూపర్నెంటు, "ఒరేయ్, పీ. లో డి కోచ్ లో టి.టి.యీ. మోహితే ఉన్నాడు చూశావా ( బెర్తు లేటు కాన్సిలేషనయిందని ఆయన యిందాక నాతో న్నాడు, ఈయన్ని ఆయనదగ్గరికి తీసికెళ్లు'' అంటూ, మూర్తివైపు ిగి, "ఆంధ్రప్రదేశ్ కి మార్తారా? ఏ. సి. బెర్తు మరి! డిఫరెన్సు ట్టాలి!" అన్నాడు.

"మూర్తి ఆతృతగా "యస్ సర్'' అంటూ బయల్దేరబోయాడు

ఆ పోర్టరు రెండడుగులేసి చూసి, "ఏ.పీ. వదిలేసాడు సార్'' ు "వెడతాను సార్'' అంటూ వెళ్ళిపోయాడు.

స్టేషన్ వదిలి వెళ్ళిపోతోన్న సికింద్రాబాద్ న్యూఢిల్లీ వెళ్ళే ధ్రప్రదేశ్ ఎక్స్ప్రెస్ దూరంగా వెళ్ళిపోతూ తనని వెక్కిరిస్తున్న ుపించింది మూర్తికి.

సూపర్నెంటు, "సారీ సర్'' అంటూ కదలబోయాడు. మూర్తి "జస్టే మినిట్ సర్!" అంటూ అతనికి అడ్డు వెళ్ళాడు. అన్నాడు.

"మీ రైల్వే రూల్సు ప్రకారమే నాకు పది రోజుల ముందుగానే న్యూఢిల్లీకి రిజర్వేషన్ బుక్ చేశారు మీరు. ఈ రోజు చికాకు లేకండా నా బెర్త్ లో నేను ప్రయాణించగలనని అనుకున్నాను. మిమ్మల్ని నమ్మాను. మీరిప్పుడు నాకు ఎకామడేషన్ లేదంటున్నారు. నేనేం చెయ్యాలి ? ఈ ప్రయాణం నేను వాయిదావేసుకోలేను. ప్లీజ్ అడ్వయిజ్ మి !"

సూపర్నెంటు మూర్తివైపు వెర్రిగా చూసాడు. అన్నాడు : "నథింగ్ టు అడ్వయిజ్ యూ !"

అంతవరకూ ఆవేశంతోఉన్న అతని కంఠం తీవ్రంగా మారింది. మొహం ఎర్రబడగా మూర్తి అన్నాడు: "అయితే నేను ఈక్షణం రైల్ నిలయానికి, జనరల్ మానేజర్ కి ఫోన్ చేస్తాను. నాకు ఎకామడేషన్ ఎందుకివ్వరో చూస్తాను !''

సూపర్నెంటు మొహం చటుక్కున నల్లబడింది. రెండు మూడు క్షణాలు మిర్రిమిర్రి చూశాడు. అంతలో ఆ నలుపు విరిగింది. చిన్న చిరునవ్వు మొహం మీద తేలింది. ఉన్నట్టుండి "మీ ఇష్టం'' అని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు తన గదివైపు.

* * *

ముగ్గురు వయస్సుమళ్ళిన వాళ్ళు - పక్కన నుంచుని ఇదంతా గమనించినవాళ్ళు వాళ్ళలో వాళ్ళు అనుకుంటున్నారు :

"ప్చ్, లాభంలేదండి, లెథార్జీ, కరప్షన్, నెగ్లిజెన్స్ – ఇవ్వి పెరిగిపోయాయండి దేశంలో !.... ప్రతి డిపార్టుమెంటూ అంతేనను కోండి ! ప్యూన్నుంచి ప్రైమ్ మినిష్టరుదాకా స్వార్థం చూసుకొనేవాళ్లే గాని, పక్కవాడి ఇబ్బందులు చూసేవాడే లేడంటే నమ్మండి !''

"ఔనౌను! మారోజుల్లో-అంటే నేను నాగపూర్ సెక్షన్లో స్టోర్సు సూపర్నెంటుగా పనిచేసే రోజుల్లో దొరలు-ఏంటి, ఇంగ్లీషు దొరలు- ఆహా, ఏం పరిపాలన చేసేవాళ్ళంటే ! ఇదే ఆరోజుల్లో జరిగిందను కోండి, ఆ బుకింగు క్లార్కు దగ్గర్నుంచి ఈ సూపర్నెంటుదాకా అందర్నీ తోలు తీసి ఎండేసేవాళ్ళు. అంటే, లిటరల్ గా, ఎండెయ్యట మేనన్నమాట ! ఇప్పుడేముందిలెండి ! రోజులు మారిపోయాయి. మరిహ బాగుపడవ్ !''

"ఇంతకీ ఈ కుర్రాడి విషయం చూడండి పాపం! ఏ పరీక్షకో, రోగిష్టి తల్లిదగ్గరికో వెళుతున్నట్టున్నాడు. ఇంకేం వెడతాడు ! ఫోన్ చేస్తానంటున్నాడు, పౌరుషం బాగానే ఉంది ! పౌరుషంతో పన్లవుతాయి

టండీ, ఈ కుళ్ళురోజుల్లో! ఆ సూపర్నెంటుకే ఓ యాభై ఇస్తే ఇట్టే పనయిపోయేది! ప్చ్, పాపం!"

ఫోనెక్కడుందా అని దిక్కులు చూస్తుండగా ఈమాటలు చెవిలో పడ్డాయి మూర్తికి, వేడెక్కిన రక్తం తలకి ప్రసరిస్తూండగా, కాళ్ళకిందే భూమి కుంగిపోతూన్నట్టనిపించి కాళ్ళు తేలిపోతుండగా, కళ్లు తిరుగుతున్నట్టనిపించగా, పొర్లుకొచ్చిన దుఃఖం కళ్ళలోకి నీళ్ళు ఎగ తన్నగా రుమాలుతో తుడుచుకున్నాడు అతను. తను నిస్సహాయుడా? ఏమీ చెయ్యలేడా? ఎమ్. ఏ. చదువుకున్న తనకే ఇంత జరుగుతుంటే చదువు లేని కోట్లాదిమంది జనం గతేమిటి! తనకన్నా దౌర్భాగ్యులకు గతేమిటి?... నో, నో ఈ అన్యాయానికి అడ్డుకట్ట వెయ్యాలి! తను విజయం పొందక పోవచ్చు. కానీ ప్రయత్నం చేసితీరాలి! ఏం చెయ్యాలి! ఏం చెయ్యాలి!... ఫోనెక్కడ? ఫోనెక్కడ?'... ఇట్లా అనుకుంటూ ఉండగా, గార్డు విజిలూ, పచ్చలైటూ అతని దృష్టికొచ్చాయి.

కర్నాటక ఎక్స్ప్రెస్ కదిలింది. నెమ్మదిగా నడుస్తోంది.

* * *

మెరుపు లాంటి ఆలోచన అతనికి స్ఫురించింది.

క్రియామూర్తి ఒక్కఉదుటున తన లగేజితో పరిగెత్తాడు. పరిగెత్తి పరిగెత్తి ఎట్లాగోట్లా అందుబాటులో కొచ్చిన పెట్టెలో కెక్కేసాడు, టి.టి.యి. చెయ్యి అడ్డం పెట్టి వారిస్తున్నా మూర్తి ఆగలేదు.

ఎక్కీ ఎక్కగానే చటుక్కున అలారం గొలుసు వెతికాడు. ఒక్క దూకుతో దాన్ని అందుకున్నాడు. బలంకొద్దీ లాగాడు.

బయల్దేరిన బండి బయల్దేరినట్టే కీచు మంటూ ఆగింది. గట్టిగా యాభై గజాలు కూడా వెళ్ళలేదు! టి. టి. యి. నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

బండి ఆగీ ఆగగానే గార్డూ, స్టేషన్ సూపర్నెంటూ, ఫస్టు ఇంజన్ డ్రైవరూ పరుగెత్తుకుంటూ వచ్చారు. గార్డు తిడుతున్నాడు: "అసలే వాక్యూమ్ డౌన్‌తో బండి లేటు. ఈ స్కౌండ్రల్స్‌కి గొలుసు తప్ప ఇంకేం కనిపించలేదా లాగేందుకు, పిసికేదుకూ?— హూ యీజ్ హి!"

క్రియామూర్తి ప్లాట్ ఫారం మీదికి దిగాడు. "ఇటీజ్ ఐ సార్!"

వెనకాల్నించి దిగిన టి. టి యి. కూడా "అవును, ఇతనే! దిస్ యీజ్ ది మాన్!" అన్నాడు.

గార్డు కళ్ళల్లో నిప్పులు కురిసాయి. "యూ బ్లడీ ఫూల్, ఇ కర్నాటక సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ అనుకున్నావా కాకినాడ కొబ్బ బొండాల పాసెంజరనుకున్నావా!... నీ టికెట్ ఏది?"

మూర్తికి కాళ్ళు వణుకుతున్నాయి. గుండె విపరీతమైన వేగంతొ కొట్టు కుంటోంది. అయినా అతని మనసు మాత్రం పరమ ప్రశాంతంగా ఉంది. అతన్ని కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తోంది.

మూర్తి తాపీగా టికెట్లు తీసిచూపించాడు.

గార్డన్నాడు "నీది బి కోచ్. ఎఫ్ కోచ్‌లో ఎక్కావేమిటి? పోనీ ఎక్కావే అనుకో దానికి చెయిన్ లాగాలా? కాజీపేటలో మారొచ్చుగా?— ట్రెయిన్‌ను డిరెయిన్ చెయ్యటమంటే బాటరీ రైలును ఆపటమనుకున్నావా—?

మూర్తి "సార్, మాటలు అనవసరం మీరన్నట్లుగానే నా బి కోచ్. బి కోచ్‌లో నాకు ఎకామడేషన్ చూపించండి"

"దటీజ్ యువర్ అవుట్‌లుక్. వెళ్ళి టి. టి. యి. ని అ గాలి. నన్నా అడిగేది?"

"అడిగాను ఎకామడేషన్ లేదన్నాడు".

"ఈజిట్! .. ఇది...ఎప్పుడో ... పదిరోజుల కిందట.. ఇస్తూ అయిన... టిక్కెట్టులాగా ఉంది. ఎకామడేషన్ లేకపోవ మేంటి!— పద చూద్దాం ... ఎస్సి స్టేషన్లోనే డిలే అయితే అ మేంటయ్యా!" గార్డు కదలబోయాడు.

సూపర్నెంటు కల్పించుకున్నాడు "మిస్టర్ శీవరత్నం, అతని రిజర్వేషనయితే బుక్ అయింది కానీ ఆ బుకింగ్ చార్టులో కెక్కలేదు బి కోచ్‌లో ఎకామడేషన్ లేదు"

గార్డు అర్థమైనట్లు చూసాడు. "ఐ సీ! సమ్ స్లిప్ అన్నమాట!.. మరేమయ్యా, ఎకామడేషన్ లేకుండా బండెక్కి ట్రావెల్ చేద్దామన కున్నారా! ఇండియన్ రైల్వేస్ నీ తాత సొమ్మనుకున్నావా! చదువుకున్న వాడివి బుద్ధిగా ప్రవర్తించు! ... ఎక్కేముందే ఎకామడేషన్ చూసు కొని ఎక్కాలి. ఎక్కాక లేదని తెలుసుకొని, బండాపి దిగటం కాదు.... రూల్సు ప్రకారం నువ్విప్పుడు అయిదొందలు ఫైను కట్టాలి కాని కుర్రాడవని వదిలేస్తున్నాను, టేక్కేర్!" అన్నాడు.

మూర్తి మాట్లాడలేదు.

గార్డు మళ్ళీ ఈల ఊదాడు. చేతిలో ఉన్న పచ్చలైటు చూపించాడు.

మూర్తి మళ్ళీ చటుక్కున అదే పెట్టెలో కెక్కాడు!

అంతా నిర్ఘాంతపోయారు!

గార్డు అన్నాడు: "మళ్ళీ ఎక్కావేంటి?"

తాపీగా అన్నాడు మూర్తి: "కదలాక మళ్ళీ లాగుతాను."

"మళ్ళీ కదల్తే మళ్ళీ లాగుతావు! మళ్ళీ మళ్ళీ కదల్తే మళ్ళీ మళ్ళీ లాగుతావు. అట్లా లాగుతూ లాగుతూ లాగుతూనే ఉంటావు, అవునా?"

"యస్ సర్, ఎగ్జాట్లీ!"

గార్డు మొహంలో విపరీతమైన కోపం తొంగి చూసింది. సూపర్నెంటు వైపు తిరిగి "ప్లీజ్, సర్, ఈ అలారం దుర్వినియోగ కేసు మీకప్పగిస్తున్నాను. రసీదిస్తారా?" అన్నాడు.

మూర్తి చటుక్కున ఉద్వేగంగా అందుకున్నాడు: యస్సార్, నాకదే కావల్సింది! అరెస్ట్ చెయ్యండి. పైస ఫైను కట్టను. కాని ఏం చేస్తానో తెల్సా జనరల్ మానేజర్‌కి అప్పీలు పెట్టుకుంటాను, నా మీద కేసు నేను ఒప్పుకుంటూనే, నాకీ దుస్థితి కలిగించిన బుకింగ్ క్లర్కుమీద రెట్టింపు నేరం ఉందని ఋజువు చేస్తాను. ఏమీ పట్టనట్టున్న ఛీఫ్ బుకింగ్ ఇన్‌స్పెక్టర్, ఈ సూపర్నెంట్, టి.టి.యి., చివరికి మీరు — మీ అందరి మీదా అంతకు రెట్టింపు నేరం ఉందని ఋజువు పరుస్తాను. అవతల నాకు రాబోయే ఉద్యోగం పోయినందుకు మీరంతా బాధ్యులు కాబట్టి, దాన్ని తిరిగి నాకు రప్పించే బాధ్యత మీదేనని కూడా వాదిస్తాను. అవసరమైతే ఇందుకోసం నా తల తాకట్టు పెట్టయినా డబ్బు తెస్తాను .... చెయ్యండి సార్, అరెస్ట్ చెయ్యండి! నాకదే కావాల్సింది!"

గార్డుకి తల తిరిగిపోయింది! చుట్టూమూగి వినోదం చూస్తున్న ప్రయాణీకులకీ విషయం అర్థమైంది. తలకోరకంగా విమర్శ మొదలైంది. సూపర్నెంటు చిరాగ్గా అటూ ఇటూ చూస్తున్నాడు. అతని ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్న రైల్వే ఎస్. ఐ. పకడ్బందిగా సిద్ధంగా ఉన్నాడు. ఇంజన్ డ్రైవర్ టి.టి.యి. ని పక్కకి పిలిచి "ఎక్కడో క్కడ దూర్చేయవయ్యా గోల!" అంటున్నాడు.

గార్డ్ సూపర్నెంటుతో "ఎవరయ్యా ఆ క్లర్కు ఉండుండి హఠాత్తుగా మనకి కొంపలంటించేసాడేంటి!" అన్నాడు.

సూపర్నెంటు గార్డుతో "ఆ క్లర్కెవరోతెల్సా? — ఇట్రండి" అని పక్కకి తీసికెళ్ళి చెవులో ఏదోచెప్పాడు.

"మైగాడ్!" అరిచాడు గార్డు. తేరుకొని "అయితే అతన్నే పిలవండి! ఏం చెబుతాడో చెప్పుకోమనండి! అన్నాడు.

సూపర్నెంటూ, ఎస్.ఐ, పోర్టర్లు, తలకో దిక్కులోనూ పరిగెత్తారు, చివరికి రెఫ్రెష్‌మెంటు హాల్లో కాఫీ తాగుతున్న గళ్ళచొక్కా గుమాస్తాని బయటికి లాక్కొచ్చారు.

గార్డన్నాడు "ఏమయ్యా, ఈ కుర్రవాడికి ఎకామిడేషన్ చూపించి మమ్మల్ని పంపిస్తావా, మమ్మల్ని అట్టేపెట్టి బండి కదిలేంత వరకూ పోషిస్తావా?" అన్నాడు.

ఆ గుమాస్తా తంబిరుసుగా ఏదో మాట్లాడ బోయాడు. సూపర్నెంటు అతన్ని పక్కకి తీసికెళ్ళి రెండుమూడు నిముషాలు హితబోధ చేసాడు.

ఏడుపు మొహం పెట్టేసాడు గుమాస్తా, అందరూ గుంపుగా అతని వెనకాల నడచిరాగా అతను బి కోచ్ వైపు కదిలాడు. బికోచ్ టి. టి యి ని కలిసాడు.

అన్నాడు "గురూ గురూ పొరపాటయి పోయింది, మినిష్టరు గారబ్బాయికి ఇవ్వకతప్పలేదు. ఇచ్చేదాక నాప్రాణం తీసాడు. ఇది ఇంత గొడవవుతుందను కోలేదు. ఎస్కేప్ అవుదామన్నా వీల్లేని పరిస్థితి. ప్లీజ్, ఎట్లా గొట్లా ఈ టిక్కెట్‌ని తీసికెళ్ళండి".

టి. టి. యి. తన చార్టువైపు చూపిస్తూ "ఎట్లాతీసికెళ్ళనయ్యా బాబూ! అంగుళం కూడాఖాళీ లేదయ్యా, ఎట్లా?" పైగా కాజీపేట, నిజాముద్దీన్ సెక్షన్‌లో స్క్వాడ్ తిరుగుతోందిట!" అంటూ లో గొంతుతో ఇంకా అన్నాడు.

"మా పెద్దమ్మాయికీ మా ఆవిడకి ఒకేసారి కాన్పొచ్చే రోజులు. ఈయన్ని తీసికెళ్ళి నేను సస్పెండయి కూర్చుంటే ఎట్లా?"

గుమాస్తా టి. టి. యి. చేతులు చటుక్కున పట్టుకున్నాడు. బొంగురు గొంతుతో అన్నాడు. "ఈయన్ని తీసుకెళ్ళక పోతే నేను సస్పెండవుతాను. ఇవ్విచేతులుకావు బాబ్బాబు! కాజీపేట తర్వాతకదా స్క్వాడ్, అంతవరకూ మీ సీటియ్యండి. అక్కడ ఎదో వేకెన్సీలో ఎడ్జస్ట్ చెయ్యండి".

"అక్కడేం ఖాళీ అవ్వావ్ !"

"పోనీ, బల్లార్షా, వార్ధా, నాగపూర్, ఇటార్సి, భోపాల్, ఎక్కడోక్కడ బాబూ, ఎక్కడోక్కడ! ఇస్తానని చెప్పండి సార్ అసలెక్కించండిబాబూ ముందర !"

టి. టి. యి. అయిష్టంగానే మూర్తితో "ఎక్కండి సార్! ఇంతకీ గాలి ఒచ్చింది నా సీటుకన్నమాట!" అన్నాడు.

ఎవ్ కోచ్‌లోంచి తన రెండుసంచులూ, సూటుకేసూ తెచ్చుకుని బి కోచ్ ఎక్కి, టి. టి. యి. సీటులో కాలుమీద కాలేసుకు కూర్చున్నాడు, క్రియామూర్తి, 'కర్తనేవాడుంటే క్రియ ఫలించగలుగదా? అనుకుంటూ. నిముషం తర్వాత ముప్పావుగంట లేటుతో హడావిడిగా బయల్దేరింది కర్నాటక ఎక్స్‌ప్రెస్.

# బింబమై - పురా బిందువై

## శ్రీ మాదిరాజు రంగారావు

నగరం నాటకం వలె ఉంది
అంతలో ఔతుంది అరణ్యం
సమయం దర్పణం వలె ఉంది
అంతలో ఔతుంది సముద్రం
పట్టపగలే దేనికోసమో
తడుముకుంటూ సాగేజనం
ఇక్కడక్కడ చూస్తేనో
ఎక్కడక్కడ రాస్తాల్లో
సంధ్యాచరణ పంక్తులు కళ్ళలో
పక్షులెగిరే సవ్వడి ఊహాలో
రాత్రి ఐనా దేనికోసమో
కలలు మ్రింగే ఊగిపోయే జనం
కాళ్ళ క్రింద అలలై తెప్పలతో
ఊహాలలో చిరుకత్తుల తళతళతో
రాత్రులువస్తున్నాయిపోతున్నాయి
చీకట్లను కళ్ళలో గుప్పించీ
పగళ్లు పోతున్నాయి వస్తున్నాయి
భయాలను గుండెల్లో చొప్పించీ
ఆరాటం జీవికకై
పోరాటం వీథుల్లో
అలలుగా అగ్నులై
పొగలతో మంటలతో
కాలం కదులుతుంది ఇక్కడ
గుర్తించలేనట్లు మనల్ని
ఒక్కొక్కప్పుడు గుడ్డిగా
మరొక్కపుడు తుంటరిగా
ఇంకొకప్పుడు చెవిటిగా
మనస్సు ఉండీ లేకుండానో
ఉన్నా పక్కకు తొలగిపోయో
ఏ మొగమాటమూ లేకుండా
ఎత్తైన మేడ క్రింద నుండి
చూస్తుంది నీడ పైకి వెలుగుకై
మట్టిలో నిద్రపోయి లేచి
చూస్తుంది నీడ కలలకై క్రింద
జనం! జనం! జనంలోఎవరికివారు
తిరుగుతున్నారు ఒంటరిగా
గాలి వినిపిస్తుంది నిరంతరం
చెవిలో దూరని కథలు, రొదలో
వెలుగు చిత్రిస్తుంది అంతటా
చూపుకి నిల్వనిచిత్రాలు వేగంలో
ఎత్తైన మేడపై నుండి చూస్తే
గోడనంటి ముడుచుకున్న నీడలు!
అరణ్యంలో గుహలో వసించి
జలధిపై ప్రయాణించడం నేర్చి
భయాన్నికష్టాన్ని అరచేతుల్లోనిల్పి
ఇంత దూరం సాగివచ్చిన ఈ
మనిషి నుండి మనిషి
రేఖ నుండి చిత్రమై !
మనిషిలో మానవుడు
సంస్కృతీ నవ బింబమై
మనిషిలో అరణ్య తత్త్వం
సింధువై, పురా బిందువై

శ్రీ ఎ. విజయ దత్తాత్రేయ శర్మ

# గుంటూరు జిల్లా గ్రామ నామములు ఒక పరిశీలన

( గత సంచిక తరువాయి )

## రాజ వంశముల పాలకుల నామప్రభావము

### చందవోలు (బా)

"ధనదుప్రోలు అనునది ధనదప్రోలు, ధనదవోలు, ధనద పురము. ధనదుపురము, ధనదపట్టణము, సనదవోలు, చంద్రపట్టణము, చంద్రగిరి పట్టణము అను విభిన్న నామములతో వ్యవహరింపబడ్డ చరిత్ర ప్రసిద్ధి గాంచిన ఒక ప్రాచీన నగరము. క్రీస్తునకు పూర్వము రెండవ శతాబ్దిలో ధనదుపురము మహావైభవముతో వర్థిల్లుచుండినట్లు భట్టిప్రోలు బౌద్ధస్తూపముతో లభించిన ఒక శాసనములో విశదమగుచున్నది. ఆనాడు దానిని కుబేరరాజు పరిపాలించినాడట. కుబేరునకు ధనదుడను పేరు గలదు. కుబేరుడేలు ప్రోలు కాబట్టి, దానికి ధనదుప్రోలు (ధనదు పురము) అని నామకరణము చేసియుందురు.[109]"

### భట్టిప్రోలు (రే)

"దానికి ప్రతిపాలపురమని నామాంతరము గలదు. విక్రమార్క మహారాజు సోదరుడును మహామంత్రియైన భట్టి ఇచ్చట జన్మించినట్లు తెలుపు ఒక ఐతిహ్యము ప్రచారమునందున్నది"[110] ఈ గ్రామం ఒకానొక విష్ణువర్థన మహారాజు పాలనలో నుండినప్పుడు ఈ గ్రామం 'విష్ణువర్థనేశ్వరం' గా పిలువబడిందట.[111] ఈ విష్ణువర్థనుడు తూర్పు చాళుక్య ప్రభువులలో నెవరైనా కావచ్చును.

### శాతవాహన

"సాత లేక సాతవాహన శబ్దములతో సంబంధముగల స్థల నామము లెన్నియో కలవు. గుంటూరు జిల్లాలో శాతవాహనపల్లె అను సత్తెనపల్లి ఉన్నది... నరసరావుపేట తాలూకాలోని సాతులూరు"[112] కూడ ఈ కోవలోనే లెక్కింపబడినది.

### పల్లవ

"పల్లవులు ఆంధ్రదేశపు దక్షిణ భాగమును క్రీ.శ. మూడవ శతాబ్ది మధ్య నుండి తొమ్మిదవ శతాబ్దము వరకు పాలించిరి. వీరి జన్మస్థానము గుంటూరు జిల్లాలోని పలనాడు ప్రాంతమని చారిత్రకులు భావించుచున్నారు."[113] పల్లవులకును పల్నాటిసీమకును గల సంబంధము ఇంతకు పూర్వమే వివరించబడినది.

### విష్ణుకుండిన

"విష్ణుకుండిన శబ్దము వినుకొండకు సంస్కృతీకరణ మనియు, వారి కుల దైవము శ్రీ పర్వతస్వామియైన మల్లికార్జునుడనియు, నే తత్కారణము వలన వారి యాదిమ నివాసస్థాన మిప్పటి గుంటూరు మండలములోని వినుకొండ ప్రాంతమనియు కొందరు చెప్పుదురు. (ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ్, పు 4౽2 - 27). కాని యిది సంశయాస్పదము. విష్ణుకుండి శబ్దము వినుకొండయొక్క సంస్కృతీకరణము గాజాలదు. 'విను' యొక్క సంస్కృతరూపము 'విష్ణు' కాదు, కుండియన గుండము 'కుండి' కొండ కాజాలదు. వినుకొండకు సంస్కృతమున శ్రుతపర్వతమని పేరు 'చెల్లుచుండెనని' క్రీడాభిరామము వలన తెలియుచున్నది. కావున విష్ణుకుండి శబ్దము వినుకొండకు సంస్కృతీకరణ యనుట తగదు."[114]

### కాకతీయ

కాకతి గణపతిదేవుడు (క్రీ. 1199 – 1262) తన కుమార్తె గణపాంబను (క్రీ. 1241 - 84) కోట రెండవ కేతరాజు మనుమడు బేతరాజున కిచ్చి వివాహం చేసాడు. ఈ జిల్లాలోని గణపవరములు (బా&స) ఈ తండ్రి, కుమార్తెలలో నెవరిపేరునైన రూపెత్తియుండ వచ్చును. కోట భూమీసులలో గణపతి (శ. 1180) నామదేయు డొకడు కలడు. త్రిపురాంతక శాసనప్రకారం[115] కాయిస అంబ దేవుడు గురిందాల వాలకుడైన శ్రీపతి గణపతి అనువానిని జయించినట్లు

తెలియుచున్నది. ఇటువంటి స్థానిక ప్రభువులు కూడ 'గణపవర' గ్రామ నామ ప్రేరకులు కావచ్చును. కోటి రెండవ కేతరాజు (శ 1105 - 1131) కోట వంశీకులలో ప్రముఖుడు. ఈతనొక గ్రామానికి తన బిరుదు పరంగా 'పగమెచ్చు గండాపుర' మని పేరుంచి నట్లు తెలియుచున్నది.[116] కేతవరం (స) కాతెపరం (తె) ఈతని పేరున వెలసిన వై యుండును. కాకతి గణపతిదేవుని తల్లియైన బయ్యలదేవి పేర బయ్యవరం (స) ఏర్పడి యుండవచ్చును.[117] మూడవకోట కేతరాజు (శ. 1158 – 1162) భార్య నతవాడి రుద్రుని కుమార్తెయైన బయ్యలదేవి పేరుకూడ ఈ బయ్యవరమునకు వచ్చియుండవచ్చును. బేతపూడి (రే&స) గ్రామనామములు గణపతి దేవికి జామాత, గణపాంబ భర్తయైన బేతరాజు పేరున రూపెత్తియుండుటకు వీలున్నది.

## హైహయ :

పల్నాటి హైహయ వంశ రాజ్యస్థాపకుడు అనుగురాజు (క్రీ.శ. 1110-1170) పల్నాటి తాలూకాలోని ప్రస్తుతం ఆకురాజుపల్లి అనబడు అలుగురాజుపల్లి అలుగుభూపతి పేరున ఏర్పడినట్లు తెలియుచున్నది.[118] ఈ అలుగురాజుపల్లి అనుగుభూపతి పేరునను, కామరాజు గడ్డ(రే) అను గ్రామము అనుగురాజ కుమారుడు పల్నాటియుద్ధనాయకుడైన నలగా (కా) మరాజు పేరునను రూపెత్తినట్లు భావింపవచ్చును. అలుగుమల్లిపాడు(ప) కూడ పల్నాటి వీరులలో నొకరి పేరున వెలసినట్లు అనిపించును.

## కొండవీటి రెడ్డి :

కోడూరు(బా) నకు, అనవేమపుర మని నామాంతరము కలదు. ఆ అనవేముడు కొండవీటిరెడ్డిరాజు అనవేమారెడ్డి (క్రీ.1364-1386)[119] వేమవరము (స అండ్ ప) లు కూడ సామాన్యముగ వేమాభిధానముగ గల రెడ్డిప్రభువులలో నెవరి పేరుననైన వెలసియుండును.[120]

## విజయనగర :

మాచర్లలోని "వీరభద్రాలయములోని శాసనమందు సదాశివ రాయలు (క్రీ. 1542-63) విజయనగరసామ్రాజ్యమును పరిపాలించుచుండగా నాగార్జునకొండ సీమ తిమ్మానాయనింగారి ఏలుబడి క్రింద నుండెనని, ఈయన భార్య లింగాంబ[121] తనపేర లింగాపురమును కట్టించి వీరభద్రునకు సమర్పించెననియు కలదు. లింగాపురమను గ్రామము సత్తెనపల్లి తాలూకాలో గలదు.

సదాశివదేవమహారాజు కాలంలో శ్రీమహామండలేశ్వర రామరాజ తిరుమలరాజయ్యదేవ మహారాజు కొండవీడునకు పాలకుడుగానుండెను. ఆయిన శక సం॥ 1486 లో నందివెలుగు అగ్రహారమును 74వృత్తుల మాన్యమును దానంజేసాడు. "తిరుమల రాజయ్య పేర ఈ గ్రామమునకు తిరుమలరాజపురమని పేరుపెట్టబడెను"[122].

శ॥ సం॥ 1474 లో సదాశివరాయలు ఆతపల్లి (గు) గ్రామ దానంచేయునపుడు దానికి తిమ్మరాజపురమని పేరుంచబడినది. ఈ దానము రాజ్యసంరక్షకుడైన అళియరామరాజుల సోదరుడు ఉదయగిరి పాలకుడూ ఆయిన తిరుమలరాజు కోరికపై జరిగినదిగావున ఆ గ్రామమునకు ఆతని పేరు ననుసరించి నూతన నామకరణము చేయబడి యుండవచ్చును.[123]

శ॥ సం॥ 1476లో సదాశివరాయలు రేవుండి గ్రామదానము చేయునపుడు దానికి శ్రీమత్ తిరుమలస్వామిపురమని పేరుంచబడినది. ఈ దానముకూడ తిరుమలుని ప్రేరణచేతనే జరిగినది గావున ఆతని పేరున గ్రామమునకు నూతన నామకరణము చేయబడియుండును.[124]

సిద్దిరాజు అవుభళ రాజుగారి పుత్రుడు తిమ్మరాజు. అళియ రామరాజు మేనల్లుడు. కొండవీటి రాజయిన పులిక్షితుడు. ఈతని శాసనము కాజ (గుం) గ్రామమునందలి లక్ష్మీనరసింహస్వామి ఆలయమున గలదు (యస్. ఐ. ఐ. 55 నెం. 709 శ. 1480). ఇందు అవుభళాపుర ప్రశంస గలదు. "ఇట్టి గ్రామములు రెండు కలవు. తాళ్ళూరు గ్రామమునకు అవుభళాపురమని ప్రతినామ మీయబడినది. అట్లే గోళ్ళమూడికి కూడ అవుభళాపురమని ప్రతినామము పెట్టబడినది. అవుభళాపుర రాజుగారు తిమ్మరాజువారి తండ్రి కావున అతడు తాళ్ళూరు గోళ్ళమూడి గ్రామములకు తన తండ్రి పేర అవుభళాపురమని క్రొత్త సంకేతము చేసియుండవచ్చును. మేడుకొండూరు (స) గ్రామమునకు పొన్నమాంబాపురమని ప్రతినామము శాసనములలో కన్పించుచున్నది. పొన్నమాంబ తిమ్మరాజువారి తల్లియేమో"[125].

తిమ్మాపురం (ది&న) గ్రామ నామములు పైన చెప్పబడిన తిమ్మనాయక, తిరుమల, తిమ్మరాజాదులలో నెవరి పేరునైనా దాల్చియుండవచ్చును.

గౌరిజవోలు (స) "ఈ గ్రామాన్కి పూర్వం నుంచి గౌరిజవోలు అనే వాడికె వున్నది. పిమ్మట శ్రీరంగదేవరాయలు ప్రభుత్వం చేస్తూ ఈ గ్రామానికి శ్రీరంగపురమనే అభిధానం చేసినారు... యిందుకు శాసనములు (గలవు.)"[126] తెనాలి తాలూకాలోని శ్రీరంగాపురం శ్రీరంగదేవరాయల పేరుమీదగా నేర్పడినది కావచ్చును.

అప్పాపురం (బా) నాదండ్ల అప్పమంత్రి దానములలో నితడు వినుకొండ కుంతీనది మధ్య ప్రాంతమునందు అప్పాపురమను

గ్రామమును నిర్మించి వినుకొండలోని గోపినాథస్వామికి దాన మిచ్చెనని మంగళగిరి శాసనములో గలదు. (ఎ. ఇం 6 నెం. 12, శ. 1489).[127]

## జమిందారీ యుగము

నరసరావుపేట (న) "రాజా వేంకట నరసింహారాయణింగారు సంస్థాన పాలకులలో చాల ప్రసిద్ధులు. ఈయన పదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగమునందు వినుకొండ పరగణాకు దేశముఖి మన్నావరుగాం గూడ నుండినట్లు తెలియుచున్నది. వీరు రాజధాని 'అట్లూరు' అను గ్రామమునకు మార్చి అచట పెద్ద కోటను, మంచి పేటను గట్టించి, తోటలను బాటలను వేయించి అట్లూరు అను పేరుమార్చి 'నరసరావుపేట' అని క్రొత్తగా తమపేర వెలయించిరట".[128] ఈతని వారసుడు పెదవేంకట గుండారాయణింగారు (1784-1814) "1797 లో ఈ గుండారాయణింగారు అట్లూరికి తూర్పున కోట పేటలను గట్టించి దానిని తమ తండ్రి నరసరాయని పేర 'నరసరావుపేట' అని వ్యవహరించినట్లు కొందఱభిప్రాయపడిరి. (గుంటూరు మండల సర్వస్వం - 161; విష్ణుభొట్ల సూర్యనారాయణ, నరసరావుపేట తాలూకా గ్రామ చరిత్ర, పు 3, 4). నరసరావుపేట నిర్మాతలు ఈ తండ్రీ కొడుకులలో నెవరో నిష్కర్షగా చరిత్రకారులు నిర్ధారింపవలసి యున్నది".[129]

## ముస్లిం పాలనా ప్రభావము

అమీనాబాద్ (న) అసలుపేరు కుండినపురము కాగా అమీన్-ఉల్-ముల్క్ అనే సర్దారు తన పేరును బట్టి ఊరి పేరును మార్చాడు.[130]

కొండవీడు "మహమ్మద్ కులీ కుతుబ్‌షా సేనానియైన ముర్తజాఖాన్ పేర ముర్తుజా నగరమని ఈ గ్రామమునకు పూర్వ వ్యవహారము గలదు".[131]

శేకూరు (గుం) షేక్ + ఊరు = షేకూరు. ముస్లింలో నొక తెగయైన 'షేక్' పరంగా ఏర్పడినదని తెలియచున్నది.[132]

వినుకొండ తాలూకాలోని ముర్తజాపురము కూడా పైన చెప్పబడిన ముర్తజాఖాన్‌కు నామ ప్రభావమున ఏర్పడినదిగా తోచును. కాజీపాలెం (బా), నిజాంపట్నం (రే), హాసన్‌బాదా అగ్రహారం, హౌజనౌషా, హుస్సేన్‌పురం, జలాల్‌పురం, మన్నెసుల్తాన్‌పాలెం (అన్నాస), శిఖరస్‌ఖాన్ (శింగిస్కాను) పేట (గుం), రాజా అన్నవరం(వి) వంటివి ఇతర ముస్లింప్రభావ సంజనిత గ్రామనామములై యున్నవి.

## పోర్చుగీసు ప్రభావం :

ఫిరంగిపురం (న) శ॥ 1476 నాటిదగు సదాశివరాయల రేవుండి తామ్రశాసనములో ప్రసక్తమైన ఫిరంగిపురం ఆనాటికే ఆ ప్రాంతమున పోర్చుగీసువారు స్థిరపడినట్లు తెలియజేయుచున్నది. ఫిరంగి లనగా పోర్చుగీసువారని అర్థము.[133]

## వ్యక్తులపేర నేర్పడిన ఊరి పేర్లు

### అన్నపర్రు / రాజుపాలెం (గుం)

"యీ స్థలమందు పూర్వం జయనులు కాపురం చేసిన స్థలమయిన దిబ్బ వకటి వున్నది. గనుక దానియందే పురము వున్నది. జయనులు ఖిలమయ్ని తర్వాతను, దక్షిణాపన వుండ్డబడ్డష వంటి బిరుదన కాపురస్తులయ్ని రాజులు అన్నంరాజు, కోనంరాజు, జిగిలిరాజు అనేవారలు అన్నందమ్ములు. అర్థవంతులై యుండి నొకానొక యుపద్రవం చేతను యీ దేశంకు వచ్చి అన్నంరాజుత్న పేరిట అన్నంపర్తి అనే గ్రామం కట్టించినాడు. కడసారివాడైన రాజు వారి దగ్గరనుంచి లేచిపోయి యీ గ్రామాన్కు దక్షిణపార్శ్వనం రాజుపాలెం అనేది వేరే పాలెం కట్టుకొని కాపురం వుండినాడు. తతిమ్మా యీ ముగ్గురు "అన్నపర్తి" లోనే వున్నారట. యీ హేతువు వల్ల అన్నపర్రు అనే పేరు వచ్చింది."[134]

కేసనపల్లి (ప)

'కేసరి' అనే ఆమె ఈ గ్రామ నిర్మాత యగుటచే ఆమె పేరునే గ్రామం ఏర్పడినది.[135]

పేరిచర్ల (గుం)

అనవేమారెడ్డి కంచి, పేరి, పొన్ని అనే దేవదాసి అక్కచెల్లెళ్ళకు ఇచ్చిన భూదానంబట్టి వారిలో నొకరైయైన 'పేరి' పేరున ఏర్పడిన గ్రామమట.[136]

### లక్కరాజు గార్లపాడు (స)

ఈ గ్రామ కరణముల మూలపురుషుడైన గార్లపాటి లక్కరాజు అనే వ్యక్తి పేరున గ్రామ నామం ఏర్పడినది.[137]

మూడుపదుల వరకు గ్రామముల వ్యక్తి నామములు ఆదియందును 'పాలెము' అను నామాంతమును కలిగియున్నవి. ఇవి చాలవరకు జమిందారీ యుగమున వెలిసినవి కావచ్చును. స్థల విచారమున తత్ గ్రామనామ కారకులెవరైనదీ తెలియగలదు. ఉదా. చంద్రాజుపాలెం, మాచయపాలెం, నరసింగపాలెం, పాపయ్యపాలెం, వన్నయ్య

పాలెం, వెంకటాయపాలెం (అన్నిస), దేవరాయ భొట్లపాలెం, రామచంద్ర పాలెం (అగ్రహారం), అంకిరెడ్డిపాలెం, మల్లయ్యపాలెం (అన్నిగుం); చిన్నయ్య పాలెం, (ప); నరసాయిపాలెం, వల్లభవారి పాలెం (బా), అయ్యనపాలెం, బొమ్మరాజుపాలెం, కొండయ్యపాలెం, నారాయణపాలెం, నరసరాయనిపాలెం, నాయనిపాలెం, తిమ్మయ్యపాలెం, (అన్నివి) చోడయపాలెం, గంగడిపాలెం, రాంభొట్లపాలెం (అన్ని తె). పుల్లారెడ్డిగూడెం (ప), వి త్తిమిరాజుపల్లి (వి) వంటి గ్రామములు కూడ ఈ కోవలోనికి వచ్చునవే అయి ఉన్నవి.

## ఊరిపేర్లు-ఇంటిపేర్లు :

ఊరిపేరుకాని ఇంటిపేరు ఉండిన వుండవచ్చునుగాని, ఇంటిపేరుకాని ఊరిపేరు కాదనిన అతిశయోక్తికాదు. అయితే, గ్రామ-గృహనామముల పరస్పర ప్రభావమును నిర్ధయించుట కష్టసాధ్యమే. అయినప్పటికి కొన్ని తావులందు అందుకు వీలుకలుగుచున్నది. ఆటుల నూజెండ్ల(వి) గ్రామమున కాపేరు కలుగుటకు ఆ ఇంటి పేరుగల వ్యక్తి ఆ గ్రామస్థాపకుడగుటయేనని తెలియుచున్నది.[138] "అరవెల్లి" అను గృహనామము అరవెల్లివారికి "అరవెల్లి" అను గ్రామమున నివసించుటవలన కలిగినట్లు తోచుచున్నది. — వీరు నివసించిన గ్రామము గుంటూరు జిల్లాలోని ఆరేపల్లి (రే) అయియుండునని తోచుచున్నది. ఆరేపల్లి అను గ్రామనామమే వారికి గృహనామముగా ఏర్పడి, అదియే క్రమముగా జనవ్యవహారమున ఆరేపల్లి, ఆరేవల్లి, అరవెల్లి అయి వుండవచ్చునని భావింప వీలగుచున్నది,[139]

పిట్టలవారిపాలెం (బా), బొమ్మవారిపాలెం (తె), పెట్లూరివారి పాలెం, కుక్కపల్లివారిపాలెం, మానుకొండవారిపాలెం, కంతేటివారి ఖండ్రిగ (అన్నిన) వంటి గ్రామనామములు ఆయా ఇంటిపేర్లవారివలన వచ్చినవని వాటిపేరును బట్టియే తెల్లమగుచున్నది.

## కుల, వృత్తి, సంబంధములు :

అగ్నిగుండాల (:) కంచరపేట (వి)

"ఈ వూరునకు 6 ఫర్లాంగుల దూరములో కంచర పేట గ్రామముండెడిది. కంచరులు ఇచ్చట నివసించుటచే దీనికాపేరు కలిగెను. ఈ గ్రామమునకు పడమరగా మూడుమైళ్ళ దూరములోనున్న అడవిలో కంచుగనిని వారు కని పెట్టిరి.... కొన్నిదినములయిన తదుపరి కంచరివారు గనిలో పనిచేయుచుండగా హఠాత్తుగా గనిగోడలుకూలుటచే వారందరు చనిపోయిరి. స్త్రీలందరు సహగమనము చేసిరి.... సతీసహగమనమునకుత్తర్వైన అగ్నిగుండము గల గ్రామమునకు అగ్నిగుండాల అను పేరు కలిగెను".[140]

కైతేపల్లి (రే)

కవిత్వము (కైత) చెప్పువారు ఎక్కువగానుండిన గ్రామమగుటచే ఆపేరు కలిగెనని ఒక వివరణగలదు.[141]

బ్రాహ్మణ కోడూరు (బా)

"గోపరాజురామ మంత్రి ఈ కోడూరు గ్రామమును కౌండి గోత్రులును, ప్రథమశాఖవారును అగు బ్రాహ్మణులకు ఇచ్చినా అందుచే దీనికి బ్రాహ్మణకోడూరు అను పేరువచ్చినని."[142]

## గామాల పాడు (ప)

'గామాలు' (కుస్తీపట్టేవారు) ఎక్కువగా ఈ గ్రామమున పూర్వము నివసించుటలో అట్టిపేరు కలిగినదట.[143] కాని శ॥సం.1[...] నాటి శాసనములోనే దీనికి గాములపాడు అని పేరుగానవ[...] చున్నది.[144] ఆనాటికే 'గామాలు' పల్నాటి సీమలో ప్రవేశిం[...] అను సందియము కలుగక మానదు.

## కంకణాల వల్లి (ప)

కృష్ణదేవరాయలు "గాజులు తొడిగేవాన్కి యిచ్చెనుగనుక కంకణాలపల్లి అనిరి. భట్టుకు యీనామము యిచ్చి.... భట్టుపాలెం [...] గ్రామంఆయెను.... జంగాలపల్లి అనేగ్రామం జంగాలకు ఇచ్చెను."[...] భట్టుపాలెం(ప) దేవరాయభొట్ల పాలెము (గుం) లలోపై భట్టుపాలె[...] ఒకటి కావచ్చును. జంగాలపల్లి సంప్రదించిన గ్రామముల జాబితా[...] కానరాదు.

బ్రాహ్మణపల్లి, సెట్టిపల్లి(వి) గొల్లపాడు,, రెడ్డిగూడెం([...] పాతరెడ్డిపాలెం(తె) వంటివి కూడ కుల, వృత్తిసూచిత గ్రామనామము[...] యున్నవి.

## వృక్ష జంతు సంబంధములు :

## గురజాల (ప)

"గురజాలకు గురివింద స్థలము అను నామముగూడ శాసన[...] లలో గాన వచ్చుచున్నది."[146] గురివింద లేక గురిజ పొదలు విస్తా[...] ముగా నుండిన ప్రదేశమున ఏర్పడిన గ్రామముకావున గురిజాల అ[...] నామము సిద్ధించినది.[147]

## గారపాడు (ప)

"పూర్వం యీస్థలమందు విస్తరించి గారచెట్లు, బలిసి అరణ్య[...] గావున్నందున అరణ్యం ఛేదించి యిక్కడ గ్రామనిర్మాణం చేసి[...]

దున దీనికి గారపాడు అని నామం వాడికి వచ్చినది. అందుకు దాఖలా యిక్కడ గారచెట్లు విస్తారంగా వుండివున్నవి"[148]

## జొన్నలగడ్డ [గుం]

అమరేశ్వరాలయములోని కులోత్తుంగ రాజేంద్రచోడుని కాలము (శ. 1095 = అర్ 1173) నాటిదగు నొకశాసనములో 'జొన్నలు' విస్తారముగా పండు ప్రదేశమగుటయే నందురు.[149]

## జొన్నలగడ్డ [న]

స్థానిక దేవాలయములో శ॥ 1214 సం॥నాటి ఒక శాసనములో ఇదే నామముతో చెప్పబడిన ఈగ్రామనామ కారణముకూడ పై విధము గనే వివరించబడినది.[150]

## తుబాడు [న]

దీని తొలినామము 'తుంగబాడ'నియు తుంగబాగా బలిసిన చెరువుమీద నిర్మించబడుటచే ఆపేరుకలిగిననియు, స్థానిక వినాయక అలయములోగల నాగఫలకముపైగల శాసనములో గ్రామనామము నంబర్రు, లేక తుంబర్రిఆని లిఖించబడినదనియు తెలియుచున్నది.[156]

## పువ్వాడ [తె]

యదార్థనామము పువ్వులవాడ అని తెలియుచున్నది.[152]

## మోదుకూరు [తె]

మోదుగ చెట్లునరకగా ఏర్పడిన స్థలమందు నిర్మితమయినగ్రామ మగుటచే ఈ పేరు వచ్చెనందురు.[153]

### రావిపూడి (న)

స్థానిక రామలింగేశ్వరాలయ ప్రాంగణమున గల నొక శాసనములో (శ. 1199) 'రావూరు' అని లిఖింపబడిన ఈ గ్రామము నకు ఆ ప్రాంతమున రావిచెట్లు విస్తారముగా యుండి యుండుట వలన వచ్చియుండునని తలంపు.[154]

### రాయపూడి (గుం)

శ॥ సం॥ 1183 నాటిదగు శాసనములో ఈ గ్రామ నామము 'రావిపూడి' అనియే పేర్కొనబడినది.[155] గ్రామ నామ కారణము పైన వివరించినట్టిదే అయివుండును.

### రేమిడిచర్ల (తె)

రేగు పొదలు విస్తారముగా నుండిన ప్రాంతమున నిర్మించబడిన దగుటచే ఈ పేరు కలిగెనని చెప్పుదురు.[156]

దొండపాడు, గరికపాడు (రి), దొండమూడి, గరికపాలెం, మామిళ్ళపల్లి (అన్ని బా); కొత్తపల్లి నారికేళపల్లి, పులిచింతలపాలెం, రావికంపాడు, వడ్లమూడి, గురివిందపల్లి (అన్ని తె); ఆముదాలపల్లి, తోటపల్లి, పెసర్లంక (అన్ని రే); చింతపల్లి, మిరియాల, రెంటచింతల, కందులకుంట (అన్ని ప); చింతపల్లి, గరికపాడు అగ్రహారం పెదకూరపాలెం, పొట్లపాడు, పులిచింత (అన్ని స); గోరంట్ల, గారపాడు, మర్రిపాలెం, రావిపాడు (అన్నీ గుం); గోగులపాడు (న) వంటివి కూడ ఈ కోవలోనికే వచ్చునవిగా నున్నవి.

## జంతు సంబంధములు :

### ఎడ్లపల్లి (తె)

పూర్వమీ గ్రామమునందు 'ఎడ్లు' ఎక్కువగా నుండుటచే గ్రామమున కాపేరు స్థిరపడెనందురు.[157]

### గోవాడ (తె)

ఇక్కడ ఉండిన గోసాలయందు గోవులు ఎక్కువ సంఖ్యలో ఉండేవని, ఆ ప్రదేశమున గ్రామ నిర్మాణం జరుగుటచే గోవాడ అను పేరు వచ్చెనని చెప్పుదురు, [158]

### చినకాకాని / పెదకాకాని (గుం)

చినకాకానికి కుక్కకాకాని,శునకకాకాని అని పేర్లుకూడ కలవట. విశ్వాసమునకు ఉదాహరణయైన తన శునకమును దాని యజమాని పొరపాటున చంపివేసుకొన్నటువంటి ఒక కథ ఈ గ్రామావతరణకు సంబంధించినదిగా చెప్పుదురు.[159] సీవెల్ ఇట్టి వివరణనే పెదకాకానికి సంబంధించినదిగా పేర్కొనినాడు.[160]

### చిలకలూరిపేట (శ)

చిలకలూరిపాడు అని పూర్వవ్యవహారము. గ్రామనిర్మాణం జరిగిన ప్రదేశమున వుండియుండిన ఒక రావిచెట్టుపై చిలకలు ఎక్కువగా చేరుతూ ఉండేవని అందువలన గ్రామనామము ఆవిధముగా నేర్పడినదని అందురు.[161]

### యనమదల (గుం)

మెకంజీ కథనం ప్రకారం ఈచోట రెండు గేదెల కొమ్ములు పొదలలో గల నిధి మూటలకు చిక్కుకున్న వైనం ప్రకారం గ్రామ నామమేర్పడినది. స్థానికంగా దీనికి 'ఏనుగుమండల' అని వ్యవహార ముండేదనియు, రెడ్డిరాజుల పరిపాలనా కాలంలో ఇక్కడ ఏనుగు మందలుండేవనియు తెలుస్తున్నది.[162] దీనికి ఏనుగుమండల అని పేరుతోపాటు 'వీరభోగ వసంతరాజపురి' అను సంస్కృత నామము కూడ ఉండేదని తెలియుచున్నది.[163]

ఏనుగులపాలెం, నాగులవరం, పిచికలపాలెం (అన్ని వి); నాగులవరం పులిపాడు(ప); ఎడ్లపాడు(న); సివంగులపాలెం(రే); పాములపాడు(గుం) మొ॥ కూడ జంతుసంబధములుగనే ఉన్నవి.

## గ్రామ నామముల పరిణామము-సంస్కృతీకరణము

ఉదా :-

ధరణికోట (గుం)

"అమరావతీ ప్రాకృత శాసనములలో 'ధమనకడ','ధఞ్ఞకటక', 'ధఞ్ఞకడ' అని యీ పురికి పేళ్ళు గలవు. ఇది చాల ప్రాచీన పదము. ఈ పదము యొక్క రూపాంతరమిది.

1. తెన్‌కడ — (దక్షిణ కటకము) తన్‌కడ - దనకడ - ధనియ కడ - ధనకిడ - ధనియకడ - ధన్యకడ - ధనకటక - ధాన్యకటక - ధాన్యవాటి.

2. ధనకడ - ధన్నకడ - ధన్నాడకోట - ధన్నాలకోట - ధన్నాడకోట - ధరణాలకోట - ధరణికోట.[164]

విప్పర్ల (న)

శివస్కందవర్మ పల్లవుని మైదవోలు శాసనము (క్రీ. శ. 275) లో విరిపర గ్రామ ప్రసక్తి గలదు. "విరిపర గ్రామమునకే తరువాత కాలమున విప్పఱ్ఱు, విప్పర్ల యను పేరు కానవచ్చును. తూర్పు చాళుక్య జయసింహ వల్లభుని శాసనము (క్రీ. 642) లో దీని విప్పర్తి అను ఔపవిభక్తి రూపము వాడనైనది. 'ఱ్ఱు' వర్ణము అంతమునందు గల శబ్దములు ఔపవిభక్తి రూపములుగా ప్రాచీన కాలమునందే గుర్తింపబడుటకు ఇది ఉదాహరణ",[165]

తాడికొండ (గుం)

"ఆనంద గోత్రజుడైన అత్తివర్మ గోరంట్ల శాసనమునందు తాన్టికొన్ఱ గ్రామముగుడవనైనది. నకారళకటరేఫ సంయోగము కలధ్వని తరువాత కాలమున 'డ' కారముగా పరిణమించినది. దీనిచే ఇప్పటి తాడికొండ రూపమేర్పడినది. తాడికొండ గుంటూరు జిల్లాలో ఇప్పటికిని ఉన్నది."[166]

ఆత్మకూరు (గుం)

"గుంటూరు తాలూకా ఆత్మకూరను గ్రామములోగల శాసన ములో అతుకూరు ప్రశంశ కలదు. ప్రస్తుత ఆత్మకూరుగ్రామమే పూర్వము అతుకూరు గ్రామముగా నుండి నటుల శిలాశాసనముల వలన తెలియుచున్నది. అతుకూరు అను పేర గ్రామనామములు శాసన బద్ధ మైనను, వుచ్చారణములో నేడు ఆత్మకూరుగా సంస్కృతీకరింపబడి నదిగా తోచును"[167]

పొన్నూరు [గుం]

"పొన్నూరునకు స్వర్ణపురమని మరియొకపేరుకలదు. 'పొన్ను' అనగా సువర్ణము. ఊరు అనపురము. కాగా స్వర్ణపురము- పొన్ను + ఊరు=పొన్నూరుగా మారియుండనగును. స్వర్ణపురము సాంస్కృ కము. పొన్నూరు అచ్చికము."[168]

గుంటూరు :

ఒక ప్రాంతమునకుగాని (ఉదా॥ వెల్నాడు, పల్నాడు) ఒక గ్రామమునకుగాని (ఉదా॥ మాచెర్ల) ఒక పేరు ఏర్పడుటకు వివిధమ లైన కారణములలో గాథలు జనశ్రుతిలోన ఉండుననుటకు గుంటూర ప్రముఖమైన ఉదాహరణగానున్నది.

"గుంటూరు పూర్వం "గుంట" (చెరువులో) కుగ్రామంగ యుండేదని చాలామంది భావిస్తున్నారు. ఇప్పటి ఎర్రచెరువు ప్రాంతం అప్పటి గుంటగా అంటుంటారు. ఒక "గుంట" వల్లనే "గుంటూరు" అని పేరు వచ్చిందని సామాన్యంగా చెప్పుకొంటారు. మరో వివరణ ప్రకారం ఈ గ్రామం ఒక "కుంట"లో యుండెడిదని, "కుంట ఊరు" అని అనేవారని క్రమంగా గుంటూరుగా మారిందని చెబుతున్నారు. స్థానికంగాయున్న ఒకరాజు పాలనా కాలంలో మధ్యాహ్న సూచికగా రోజూ తుపాకి పేల్చేవారని, అందుచేత తుపాకి గుండు సూచికగా "గుండూరు" అని పిలిచేవారని, ఆ పేరే గుంటూరుగా రూపాంతరం చెందిందని మరో వాదన"[169]. గుంటూరుకు తుపాకి గుండుతో కాదు గాని "గుంట" (చెరువు) మరియు "గుండు"లతో గూడిన ఐతిహ్య మొకటి స్థానిక చరిత్ర శకలాలలో నిక్షిప్తమై ఉన్నది. "గుంటూరు అనేది పూర్వం అరణ్యంగావుండి అగస్త్యులున్ను గౌతములున్ను పాలుగా గుళ్లు నిర్మాణంచేసి గ్రామం యేర్పరిచి అచ్చట వర పెద్దగుండు వున్నందున గుంటూదు అనే వుంచిరి. ఆ మీదట కలియుగానంతరం జయనులు మహాప్రభువులవారు కాశీనుంచి యీ ప్రదేశాన్కివచ్చి యీ సీమయావత్తున్ను ఆక్రమించుకొని యీ అరణ్యమందు వుండ్ని గుండ్లున్ను యీ లింగాన్నిన్నిచూసి ఇది మహాపురుషుల ఆశ్రయమన్నిన్ని యిక్కడ గ్రామ నిర్మాణం చెయ్యవలెనని యోచనచేసి యీ గుండుకు ఆగ్నేయభాగాన గ్రామనిర్మాణంచేసి గుంటూరు అనే నామముంచిరి[170] గుంటలో "గుండు"నకు సంబంధించిన కథ ఇంకొకటి గలదు. "గుంటూరునందు ఇప్పుడు ఎఱ్ఱచెరువు గల స్థలమున ఒక పెద్ద రాతి గుండు ఉండెడిదనియు, పూర్వము మోహనరాజు, గోపాలరాజు అను నిద్దరు రాజపుత్రులు కుష్ఠువ్యాధిచే పీడితులై తీర్థయాత్రా సందర్భ మున ఇచ్చటికి వచ్చి ఎఱ్ఱచెరువులో స్నానముచేసి యొడలు తుడుచు కొనగా వారి వ్యాధి కొంతవరకు తగ్గెననియు, అందుచే వారు ఈ గ్రామముననే ఆరు నెలలుండి ప్రతి దినము స్నానముచేసి పరిశుద్ధ

దేహులై ఆరోగ్యవంతులైరనియు, అచటి రాతిగుండును వారు పగులగొట్టించి దాని తావున పెద్ద తటాకమును గావించిరనియు, ఇచట అగస్త్యునిపేర అగస్త్యేశ్వరదేవాలయము గట్టించి ప్రతిష్ఠగావించిరనియు ప్రతీతి గలదు. ఒక పగులగొట్టబడిన గుండువలన ఈ గ్రామమునకు "గుండూరు": "గుంటూరు" అను పేర్లువచ్చెనందురు. పై విషయము లలోని సత్యాసత్యములు తెలియవు. ఒకప్పుడీగ్రామమునకు "గుంటూరు" అను పేరును సాధించుచు సి. పి. బ్రౌన్ పండితుడు వ్రాసియున్నలేఖ ఒకటి ఒకానొకప్రాచ్య పుస్తకాలయమున నున్నట్లుతెలియుచున్నది.[171]

## నదీనామచరిత్ర :

ఈ జిల్లాలో ప్రధానములైన గుండ్లకమ్మ, నాగులేరుల నామ చరిత్ర ఆసక్తిదాయకమైయున్నది.

### గుండ్లకమ్మ

"ఈ నదీప్రవాహము యొక్క వేగమునకు పెక్కు గులక రాళ్లను, పెద్దపెద్ద గుండ్లను కొట్టుకొని వచ్చుచుండును. ఈ కారణ మునుబట్టియే ఈ నదికి "గుండ్లకమ్మ"అను నామమేర్పడినదని పెద్దలు చెప్పుదురు. గుండ్లకమ్మ అను దానికి పూర్వ నామము "కుండిన" లేక "గుండిక" అను సంస్కృత నామమున్నట్లుగా కనబడుచున్నది. ఈ సంస్కృత నామము "గుండ్లకమ్మ" అను తెలుగు పేరుగా ఏ శతాబ్దములో ఎట్లు మారినదో ఇతమిద్ధమని తేల్చి చెప్పుట చాల కష్టము గుండ్లకమ్మ అను పదమును విడదీసినచో గుండ్ల + కమ్మ అను రెండు పదములు వచ్చును. గుండ్ల = గుండ్లతో పారు కమ్మ = కమ్మని నీటి ప్రవాహము గలది అని అర్థము చెప్పుచున్నారు.[172]

### నాగులేరు :

ఈ నాగులేటికి నాగానది, నాగేశ్వరనది, సర్పాఖ్య అని శాసన సాహిత్యవ్యవహారము కాననగుచున్నది. "ఈ నామోత్పత్తిని గూర్చి వివిధములైన వింత కథలు కానవచ్చుచున్నవి."పూర్వకాలమున ఈ ప్రాంతములో "నాగులు" అను నొక జాతివారుండిరనియు, వారా ప్రాంతమును పరిపాలించుచుండిరనియు, కావుననే ఈ ఏటికి నాగులేరను పేరు వచ్చెననియు పూర్వచరిత్రల వలన దెలియుచున్నది. ఈ ప్రాంతములో ఎక్కువగా నాగమ్మ, నాగయ్య అను పేర్లను పెట్టుకొను చున్నారు. నాగజాతివారికి ముఖ్యదైవము నాగరాజు గావున, బహుశః ఈ నదికి నాగులేరను నామకరణము కలిగియుండవచ్చును.[173] నాగు పాము యొక్క ప్రాణము తీసి మధ్యగా ప్రవహించుట వలన దానికి నాగులేరని పేరు వచ్చినట్లును మరికొందరు నుడువుచున్నారు"[174]

## భౌగోళిక సంబంధములు

అడివి, చెరువు (బా); అడవులదీవి, కోనేటిపురం (రే); చింతలచెరువు, కనుమలచెరువు, మొల్లవాగు, కొచ్చెర్ల (కొత్త + చెర్ల) (వి ; తుమ్మలచెరువు, వప్పిచెర్ల (ప); రొంపిచర్ల (న); తాళ్ళ చెరువు, కొండూరు (స) వంటివి గలవు నెమలికల్లు, ఒర్వకల్లు (స) కురవగల్లు, పొన్నికల్లు(గుం), ాలకల్లు, మంచికల్లు(ప) వంటి గ్రామముల నామాంత్యమందున్న కల్లు లేక గల్లు అనగా రాయి అను సామాన్యార్థమున్నను "పిడుగురాళ్ళ" (ప) వంటి కొన్ని గ్రామ ముల విషయములో అట్టి పేరుకు ప్రత్యేక వివరణ లభించుచున్నది. ఆ గ్రామము "పిడుగు" పడిన ప్రదేశమున నిర్మింపబడినదట.[175]

పెద్ద - చిన్న వగైరా

ఒకేపేరు గల గ్రామాలను వేరువేరుగా గుర్తించడానికి ఆయా పేర్ల ముందు పెద్ద — చిన్న అనే విశేషణం చేర్చడం ఒక పద్ధతి. ఉదా :- కాకాని (న) - చినకాకాని - పెదకాకాని (గుం); పాసుమర్రు- చినపాసుమర్రు (న): చినమక్కెన - పెదమక్కెన (స): చిన గార్లపాడు - పెదగార్లపాడు (ప); చినకొదమగుండ్ల — పెదకొదమ గుండ్ల (ప); చినరావూరు - పెదరావూరు (తె); చినపలకలూరు - పెదపలకలూరు (గుం) - చినఅగ్రహారం - పెదఅగ్రహారం (ప)

కావూరు-కొండకావూరు (న); కొండూరు-మేడికొండూరు (స); సంగం జాగర్లమూడి (గుం) - కొండ జాగర్లమూడి (తె); అనంతవరం (తె) - అనంతవరం అగ్రహారం (స) - అనంతవరప్పాడు అగ్ర హారం - మీసరగడ్డ అనంతవరం (గుం): మంగళగిరి - మంగళగిరి పాడు (గుం); లింగంగుంట్ల (న) - లింగగుంట్ల అగ్రహారం (స) పొణుగుపాడు - పొణుగుపాడు ఖండ్రిక (స) దేవరపల్లి అగ్రహారం- దేవరపల్లిసేరి (తె); పెర్వాలి - పెర్వాలిపాలెం (తె); అన్నవరం (గుం) - తాణాఅన్నవరం మొ॥ గ్రామములు పాడు, సేరి, ఖండ్రిక, తాణా వంటి విశేషణములను తమ పేర్ల ముందుగనో వెనుకనో కలిగి యుండి తమ ప్రత్యేకతను నిలుపుకుంటున్నవి.

వేర్పాటుగా గుర్తించుటకు ఎట్టి వీలును కల్పించని గ్రామ నామములు లేకపోలేదు. ఉదా :- తిమ్మాపురం (న & వి); బేతపూడి (స & రే); గణపవరం (స & బా); వేమవరం (స & ప); ముప్పాళ్ళ (వి & స); నాగులవరం (ప & వి); నరసాయపాలెం (బా & వి); అన్నవరం (గుం & న & తె); తక్కెళ్ళపాడు (గుం & ప); తాళ్ళూరు (2స); సిరిపురం (స & తె); జూపూడి (బా & స); కంభం పాడు (స & ప & వి); గరికపాడు (బా & వి); గొట్టిపాడు (గుం & న); ఉప్పలపాడు (గుం & న); తురుమెళ్ళ (తె & గుం); గుండ్లపాడు (ప & స).

## ముగింపు :

పౌరాణిక పరముగా నేర్పడినట్లు చెప్పబడు గ్రామ నామములు- గోదావరి జిల్లాలలో వలెనే ఈ జిల్లాయందు గూడ మిక్కిలిగా నున్నవి. వీటియొక్క సత్యాసత్యములు విచారణీయములు. పాలక వంశముల, వ్యక్తుల నామ ప్రభావము ఇంతవరకు గమనింపబడిన జిల్లాలలో వలెనే చెప్పుకోదగిన స్థాయిలోనే యున్నదిగాని జమిందారీ యుగమున సంస్థానాధీశులకన్న, స్థానిక ప్రముఖులే ఎక్కువగా గ్రామస్థాపకులై తమ పేర్లను నిలుపుకున్నట్లున్నది. కళింగాంధ్రములో 'వలసలు', గోదావరి జిల్లాలలో 'కోటలు', 'లంకలు', 'గూడెములు' వలెనే ఈ జిల్లాలో 'పాలెములు' 'పాడు' అనునవి తరుచు గ్రామనామాంత్యములుగ కానవచ్చుట గమనింప దగినది గ్రామ నామాంత్యములలో 'యెల్లి (కన్నడ మొళ = గుంట), గల్లు మొ॥ కన్నడ, తమిళ భాషా ప్రభావము కానవచ్చుచున్నది. గ్రామ నామ పరిణామమును గమనించుటకు పరిశోధనలకు మరింత భాషాశాస్త్ర పరిజ్ఞానము అవసరమని నిరూపణ మగుచున్నది. ఈ జిల్లా గ్రామనామముల విషయమై ఇంకను శాసన, సాహిత్య, భాషా శాస్త్రాదుల నాకళించుకొని, క్షేత్ర విచారణా దక్షతతో గూడ విస్తృత శాస్త్రీయ పరిశోధన జరుపబడవలసిన అవసరమును ఈ ప్రాథమిక పరిశీలన గుర్తించుచున్నది.

## అధోజ్ఞాపికలు

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, సంపుటము-3 (హైదరాబాద్, 1962) పు 361 ఇకపై 'కోశము' అని సూచింపబడుతుంది. 1970సం॥లో ఒంగోలు (నేటి ప్రకాశం) జిల్లాను ఏర్పాటు చేసినప్పుడు, అప్పటి గుంటూరు జిల్లాకు చెందిన ఒంగోలు తాలూకాను, బాపట్ల, నరసరావుపేట తాలూకానుండి వరుసగా 44, 41 గ్రామములను ఒంగోలు జిల్లాలో చేర్చుటవలన ఎల్లలలో మార్పులు సంభవించినవి.

2. ఆంధ్రప్రదేశ్ దర్శిని, (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ 1976) పు. 1048.

సౌలభ్యము కొరకు కుండలీ కరణములలో తాలూకాల పేర్లు సంక్షిప్తముగా పేర్కొనబడును. ఆ సంజ్ఞావివరణ. బా=బాపట్ల గుం=గుంటూరు, న=నరసరావుపేట, ప=పల్నాడు, రే = రేపల్లె, స = సత్తెనపల్లి, తె = తెనాలి, వి = వినుకొండ.

3. డి. భాస్కరమూర్తి 'ద మిడిల్ స్టోన్ఏజ్ సైట్ ఎట్ మద్దూర్ డిస్ట్రిక్ట్ గుంటూరు, ఇతిహాస్, (జర్నల్ ఆఫ్ ఏ.పి. ఆర్కైవ్స్ వాల్యూం 5. నెం. 1, హైదరాబాద్, జనవరి-జూన్, 1977) పు 17-24.

4. మూర్తి డి. ది & శ్రీనివాసులు కె. 'మిడిల్ పాలియోలిత్ ఫ్రమ్ నాగార్జునవగర్ అండ్ తుమ్మలపాలెం, డిస్ట్రిక్ట్ గుంటూ (క్వా, జె ఎమ్.ఎస్. వాల్యూం 221, నెం. 1.2, జాన్యువరి జూన్, 1980), పు 48-59.

5. పి. వెంకటేశ్వరరావు, 'మిడిల్ పాలియో లిత్స్ ఫ్రమ్ యమదల డిస్ట్రిక్ట్ గుంటూరు, ఎ. పి. (ఆంధ్రప్రదేశ్ హిస్టరి కాంగ్రెస్ ప్రొసీడింగ్స్ 4 అండ్ 5. సెషన్స్, 1980) పు 54-67.

6. ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిక్ట్ గజిటీర్స్ - గుంటూరు, (హైదరాబాద్ 1977) పు 33 ఇకపై గజిటార్ అని వ్యవహరింపబడుతుంది

7. ఈ ప్రకరణమునకు, పట్టి 2 నకు ప్రధాన ఆధారము కుంమూరి ఈశ్వరదత్తు 'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము (హైదరాబాద్, ద్వితీయముద్రణ, 1979)

8. ఎ. ఇం. వాల్యూం 10 ల్యూడర్స్ లిస్టు నెం. 1202, 1203 1204 ఎమ్. రామారావు, ఇక్ష్వాకూస్ ఆఫ్ విజయపురి (తిరపతి, 1967) పు 53.

9 ఎ. ఇం. 8 పు 233; 15, పు 250; 8, పు257.

10. యస్. ఐ. ఐ. 10 నెం. 248.

11. పైది నెం. 58.

12. పైది నెం, 606.

13. పైది 6 నెం. 124.

14. పైది 10 నెం. 73.

15. ఎ. ఇం 18, పు. 11.

16. ఎన్. ఐ. ఒంగోలు, 15 శా. శ. 1467

17. యస్. ఐ.ఐ. 6 నెం. 146 కృష్ణరాయలకాలమునాటిది.

18. ఎ. ఇం. 6 నెం. 22 శా. సం. 1442 కృష్ణరాయల కొండవీటి శాసనము.

19. ఆర్. సుబ్రహ్మణ్యం, ది సూర్యవంశ జగపతిస్ ఆఫ్ ఒరిస్సా (వాల్తేరు, 1957) పు. 140.

20. యస్. ఐఐ 10 నెం. 144.

21. పైది 6 నెం. 229.

22. పైది నెం. 103 శా. శ 1067.

23. తూర్పు చాళుక్య మొదటి విజయాదిత్యుని అల్లువాలు తామ్ర శాసనము. ఎపిగ్రాఫియా ఆంధ్రికా-3(హైదరాబాద్ 1974) పు 1-2.

24. అమ్మరాజ విష్ణువర్ధనుని వెలంబ్రు శాసనము- పైది పు 44.

25. ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళము, పు 25.
26. యస్. ఐ. ఐ. 6 నెం. 136. శా. శ. 1071 అండ్ నెం. 148 శా. శ. 1076.
27. ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళము, పు 33.
28. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము - ఐదవ సంపుటము (హైదరాబాద్, 1966) పు 198. ఆంధ్రదేశచరిత్ర - భూగోళసర్వస్వము - మూడవ సంపుటము (హైదరాబాదు, 1976) పు 487.
29. హిస్టరి ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పు 81.
30. ఎ. ఇం. 31. నెం. 12.
31. యస్. ఐఐ 10 నెం. 66.
32. పైది నెం. 119.
33. పైది నెం. 422.
34. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 205.
35. కోశము, ఐదవ సంపుటము, పు 196. ఆంధ్రదేశ చరిత్ర-భూగోళసర్వస్వము - మొదటి సంపుటము (హైదరాబాద్, 1971) పు 440, జర్నల్ ఆఫ్ ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటి, 24, పు 64.
36. 24 లో వలె.
37. యస్. ఐఐ 10 నెం. 177.
38. ఎ. ఇం. 5 నెం. 16.
39. యస్. ఐఐ 10 నెం. 112 శా. సం. 1065.
40. పైది 6 నెం. 236. శ. సం. 1104.
41. ఎ. ఇం 23. నెం, 25.
42. ఆంధ్రప్రదేశ్ చరిత్ర భూగోళసర్వస్వము 3వ సంపుటము పు64
43. కె. గోపాలాచారి, ఎర్లి హిస్టరి ఆఫ్ ది ఆంధ్రా కంట్రి, పు27.
44. భూగోళసర్వస్వము, మూడవ సంపుటము, పు 512.
45. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 52.
46. పైది, పు 50.
47. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు 404
48. ఆంధ్రప్రదేశ్ హిస్టరి కాంగ్రెస్,ప్రొసీడింగ్స్ ఆఫ్ సిక్స్త్ సెషన్ హైదరాబాద్, 1981, పు 43
49. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు రిపోర్టు ఆన్ ఎపిగ్రఫి-1965 పు. 99.
50. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము. పు 104.
51. జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. 24, పు 64.
52. భూగోళసర్వస్వము, మొదటి సంపుటము, పు 608.
53. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 45.
54. పైది. పు 105-106 అండ్ జె. ఏ. హెచ్ ఆర్. ఎస్. 19, పు. 649, 24 పు 64.
55. పైది. పు 116 అండ్ యస్. ఐ. ఐ. 10 నెం 471; 578; జర్నలు ఆఫ్ తెలుగు ఎకాడమి, 9. పు 319.
56. ప్రోలయవేమని మంచాళ్ళశాసనము. శా.శ.1262. రెడ్డిసంచిక అనుబంధము శాసనము 4.
57. ఎ. ఇం. 4 నెం. 22.
58. ఆర్. సుబ్రహ్మణ్యం ది సూర్యవంశ గజపతీస్ ఆఫ్ ఒరిస్సా, (వాల్తేరు, 1957), పు 141.
59. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, 115.
60. పైది. పు 188-189.
61. ఎ. ఆర్. 65 ఆఫ్ 1929-30.
62. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 242
63. పైది. పు 297.
64. ది సూర్య వంశ గజపతీస్ ఆఫ్ ఒరిస్సా, పు 141.
65. పైది, 140-141.
66. డా. వై గోపాలరెడ్డి, 'ది టెరిటోరియల్ డివిజన్స్ ఇన్ కాకతీయ ఏజ్' – మల్లంపల్లి సోమశేఖరశర్మ కమ్మెమొరేషన్ వాల్యూం, (హైదరాబాద్, 1976) పు 408.
67. యస్. ఐ. ఐ. 10 నెం. 90.
68. గజటీర్, పు 361.
69. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు 428.
70. పైది, పు 429.
71. పైది, పు 430.
72. కోశము, మూడవ సంపుటము, పు 97.
73. రాబర్ట్ సివెల్, ఏంటిక్వేరియన్ రిమైన్స్ ఇన్ ది ప్రెసిడెన్సి ఆఫ్ మద్రాస్, వాల్యూం 1 (ఇండోలజికల్ బుక్‌హౌస్, ఢిల్లీ) ఎపెండిక్స్, పు 19.
74. గజటీర్, పు 348
75. 'భీమేశ్వర' టెంపుల్ - చేబ్రోలు - 'ది ఏ. పి. జర్నల్ ఆఫ్ ఆర్కియోలజి, నెం 1. వి. వి కృష్ణశాస్త్రి (సం), (హైదరాబాద్, 1975), పు 109.
76. ప్రాచీనాంధ్ర శాసనములు, పు 317.

77. సి. డి. మేక్లిన్, గ్లోసరి ఆఫ్ ది మద్రాస్ ప్రెసిడెన్సి, (మొదటి ముద్రణ, 1983) ప్రస్తుతం సంప్రదించబడిన ముద్రణ : ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లి, 1982. పు 77. ఇకపై గ్లోసరి అని సూచింపబడుతుంది.
78. పైది, పు 758.
79. కోశము, మూడవ సంపుటము, పు 142-143.
గజిటీర్, పు 351.
గ్లోసరి, పు 723.
ఎర్లి డైనాస్టిస్ ఆఫ్ ఆంధ్రదేశ్, పు. 339.
80. గ్లోసరి, పు 77.
81. గజిటీర్, పు 338-39.
82. గ్లోసరి, పు 335.
83. పైది, పు 758.
గజిటీర్, పు. 364.
84. గజిటీర్, పు 338.
85. పైది, పు 365.
86. గ్లోసరి, పు 759.
87. పొలగుమ్మి పద్మరాజు, రెండవ అశోకుడి మూణ్ణాళ్ళ పాలన ఎమెస్కో, సికింద్రాబాద్, 1969), పు 5-6.
88. పైది, పుట 49
89. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, కథలు - గాథలు, ద్వితీయ భాగము, (వెంకటేశ్వరా పబ్లికేషన్స్, కడియం, 1959), పుట 838 - 839.
90. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు 405.
91. పైది, మూడవ సంపుటము, పు 487.
గజటీరు, పు 331.
92. కోశము, ఆరవ సంపుటము (హైదరాబాద్, 1969), పు 651
93. ఆంధ్రపత్రిక (దినపత్రిక, విజయవాడ) 2-4-1983, పు 8.
94. కోశము, ఐదవ సంపుటము, పు 613. గజటీరు, పు 338.
95. భూగోళసర్వస్వము, మూడవ సంపుటము, పు 93.
96. కోశము, మూడవ సంపుటము, పు 722-725.
97. గ్లోసరి, పు 723.
98. గజటీర్, పు 364.
99. పైది, పు 368.
100. ఆంధ్రభూమి (వారపత్రిక, సికింద్రాబాదు) 8-9-1981 పు 70.
101. గజిటీర్, పు 360.
102. గ్లోసరి, పు 335.
103. పైద, 335.

పౌరాణిక, మతపరమైన విశ్వాసాలననుసరించి గ్రామనామముల పుట్టుపూర్వోత్తరాలను వివరించేటప్పుడు-ముఖ్యంగా స్థానిక కథలకు ఆధారంగా గ్రహించే విషయంలో సునిశితపరిశీలన ఎంతైన అవసరం. ఉదా:- విశ్వనాథుని ఖండ్రిక(న). "విజయనగరం సదాశివరాయల కాలంలో" బాణాదార్లకు యినాం యిచ్చిరిగనుకను. యీ బాణాదార్లు కాశీవిశ్వేశ్వరుని పేరిట పాలెంకట్టి హద్దులు పొలిమేరల చేశిరి గనుకను విశ్వనాథుని ఖండ్రిక అనిరి" అని పేర్కొంటున్న కైఫియత్ (పుట 68) మళ్ళీ మరోచోట "సదాశివరాయల కాలంలో విశ్వనాథుడనే బ్రాహ్మణునికీయబడుటచే విశ్వనాథుని ఖండ్రిక అనిరి" (పుట 58) చెబుతోంది.-గ్రామకైఫియ్యత్తులు : గుంటూరు తాలూకా (ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ హైదరాబాద్, 1982)పు 58మరియు ఇకపై కైఫియత్ అని సూచింపబడుతుంది.

104. సాతవాహన సంచిక (ఆంధ్రేతిహాస పరిశోధకమండలి, 1950) పు 274.
105. గజటీర్, పు 357.
106. కోశము, నాలుగవ సంపుటము, (హైదరాబాద్. 1964) పు 679 మరియు 681.
107. భూగోళసర్వస్వము, మొదటి సంపుటము. 152.
108. యస్. గోపాలకృష్ణమూర్తి "జైన్ వెస్టిజెస్ ఇన్ ఆంధ్ర, (హైదరాబాద్, 1963) పు 38.
109. కుందూరి ఈశ్వరదత్తు, శాసనశబ్దకోశము, (హైదరాబాద్ 1967), పు 187.
110. కోశము, ఐదవ సంపుటము, పు 37-38
111. పైది. ఆరవ సంపుటము. పు 538.
112. ఆంధ్ర పత్రిక (దినపత్రిక, విజయవాడ), 2-4-1983, పు 8
113. సాతవాహన సంచిక, పు 45
114. భూగోళసర్వస్వము మూడవ సంపుటము, పు 420
115. డా. నేలటూరి వెంకటరమణయ్య, విష్ణుకుండినులు (పురాతత్వ పుస్తకమాల, హైదరాబాద్, 1973) పు 24-25.
116. యస్. ఐ. ఐ, 10 నెం. 402 క్రీ. శ. 1290,
117. డా. పి. వి. పరబ్రహ్మశాస్త్రి, ది కాకతీయాస్. హైదరాబాద్ 1978) పు 156
118. పైది. పు 199

119. సీవెల్, ఏంటిక్వేరియన్ రిమైన్స్ ఇన్ ది మద్రాస్ ప్రెసిడెన్సి పు 56
120. కోశము. మూడవ సంపుటము, 106
121. మల్లంపల్లి సోమశేఖరశర్మ, రెడ్డికింగ్‌డమ్స్, పు 39 అధస్సూచికలోని వ్యాఖ్య.
122. కోశము మూడవ సంపుటము, 726
123. భూగోళసర్వస్వము, మొదటి సంపుటము. పు 329
124. 'ది జడపల్లి గ్రాంటు ఆఫ్ సదాశివరాయ' కొపరేటివ్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ స్టేట్ మ్యూజియం, 2 (హైదరాబాద్. 1970) పు 22-23.
125. 'ది రేవుండి గ్రాంట్ ఆఫ్ సదాశివరాయ' పైది. పు 12-13.
126. భూగోళ సర్వస్వము రెండవ సంపుటము. పు 45.
127. కైఫియత్ పు 83
128. ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళము, పు 89
129. డా. తూమాటి దోణప్ప, ఆంధ్రసంస్థానములు సాహిత్య పోషణము (వాల్తేరు 1969) పు 191
130. పైది. పు 191
నరసరావు పేరుననే నరసరావుపేట వెలసినట్లు గ్లోసరి (పు566) పెదవెంకట గుండ్రారావ్ తత్‌గ్రామనిర్మాతయైనట్లు భూగోళ సర్వస్వము (మొదటి సంపుటము, పు 122) తెలుపుచున్నవి.
131. గజిటర్ పు 357
132. భూగోళసర్వస్వము, మొదటి సంపుటము, పు 624
కోశము మూడవ సంపుటము, 54-55
133. గ్లోసరి, పు 335
134. ఏ. పి. ఆర్కియోలాజికల్ సిరీస్ నెం. 28 (హైదరాబాద్,1970 పు 12-14.
135. కైఫీయత్, పు 184.
136. గజిటీర్, పు 353.
137. పైది, పు 340.
138. పైది, పు 359.
139. పైది, పు 367.
140. భూగోళసర్వస్వము, మూడవ సంపుటము, పు 272-273.
141. పైది. పు 525-26 అండ్ గజిటీర్, పు 366.
142. గ్లోజరి, పు 758.
143. కోశము, మూడవ సంపుటము, పు 106 అండ్ ఆంధ్రభూమి (వారపత్రిక, సికింద్రాబాదు) 22-12-1983, పు 36.
144. గజటీర్, పు 352.
145. యస్.ఐ.ఐ 10 నెం, 557 భూగోళసర్వస్వము, రెండవ సంపుటము, పు 42.
146. కైఫియత్, పు 55,
147. భూగోళసర్వస్వము, మూడవ సంపుటము, పు 94.
148. గజిటీర్, పు 352.
149. కైఫియత్, పు 13.
150. గజిటీర్, పు 3౪6.
151. పైది, పు 343.
152. పైది, పు 345.
153. పైది, పు 367.
154. ఆంధ్రభూమి, (వారపత్రిక, సికింద్రాబాద్) పు22-9-1983) పుట 74.
155. గజిటీర్. పు 334.
156. పైది, పు 3౹0.
157. పైది, పు 368.
158. పైది, పు 362.
159. పైది.
160. గ్లోసరి, పు 335.
161. సీవెల్, ఏంటిక్వేరియన్ రిమైన్స్... పు 74.
162. గజిటీర్, పు 343.
163. పైది, పు 342.
164. గ్లోసరి, పు 335.
165. కోశము, ఐదవసంపుటము, పు 197.
166. భూగోళసర్వస్వము, రెండవ సంపుటము, పు 483.
167. పైది, పు 485.
168. పైది, మూడవ సంపుటము, పు 64-65.
169. కోశము, ఆరవ సంపుటము. పు 651.
170. చలసాని రవీంద్ర, ''గుంటూరుకాపేరు ఎట్లా వచ్చింది? '' - ఆంధ్రపత్రిక (దినపత్రిక విజయవాడ) 2-4-1983, పు 8.
171. కైఫీయత్, పు 68-69.
172. కోశము, మూడవ సంపుటము, పు 368. మోహనరాజు, గోపాలరాజుల కథ. కైఫీయత్ నందుగూడ (పు 69) వివరించబడినది.
173 భూగోళసర్వస్వము, మూడవ సంపుటము, పు 371-372.
174. కోశము, ఐదవ సంపుటము, 167-68.
175. భూగోళసర్వస్వము మూడవ సంపుటము, పు 94.
176. గజిటీర్, పు 353.

[గ్రామ నామముల జాబితా వ్రాయుటలో సహాయపడిన కుమారి బి. భానుశ్రీకి రచయిత కృతజ్ఞుడు]

డాక్టర్ ఘంటా జవహర్‌లాల్

# అరుదైన గోవిందుని కాంస్య విగ్రహ

విష్ణువు సర్వవిశ్వరక్షకుడుగా గుర్తించబడినాడు. నాల్గు వేదాల్లోనూ విష్ణువు పేర్కొన బడినాడు. అయినా విష్ణువు పై వర్ణనలకంటె శివునిగూర్చి వర్ణనలు పుష్కలముగా లభ్యమైనవి. సర్వసామాన్యంగా విష్ణుప్రతిమలు నిలబడినట్లు, కూర్చున్నట్లు, శయనించినట్లు మాత్రమే వున్నట్లు శిల్పశాస్త్రాలు చాటుచున్నవి. నిలబడినట్లున్న విష్ణుప్రతిమను స్థానకమూర్తిగా, కూర్చున్న ప్రతిమను ఆసనమూర్తిగా, శయనించి వున్న ప్రతిమను శయనమూర్తిగా పిలువబడుటకద్దు. ఈ మూడు రూపాలు మరల యోగ, భోగ, వీర 'అభిచారికా' రకాలుగా విభజించిరి. వివిధ కోరికల సిద్ధికొరకు భక్తులువివిధ విష్ణురూపాలను సృష్టించిరేమో! యోగులు మాత్రమే విష్ణువు యోగరూపమును ప్రార్థిస్తే కష్టఫలితాన్ని అనుభవింపదలిస్తే భోగరూపమును,శౌర్యాన్ని కాంక్షించేవారు వీరరూపాన్ని, శత్రుసైన్యనాశనాన్ని కాంక్షించేవారు అభిసారికా రూపాన్ని, భక్తులు పూజిస్తారు. విష్ణు ప్రతిమలను వుత్తమము, మధ్యమము అధమములుగా గూడ శిల్పశాస్త్ర లాక్షిణికులు విభజించిరి. అయినా విష్ణుప్రతిమ ఎల్లప్పుడూ వుత్తమముగా శిల్పించవలసియున్నది.

మహాభారతములోని 'అనుశాసనపర్వము'లో విష్ణువును సహస్రనామములతో స్తుతించెను. కాని, బ్రాహ్మణులు నిత్యమూ విష్ణువును సహస్రనామములతో గాక ఇరువదినాల్గు నామములతో ప్రార్థించుటకద్దు. కావున విష్ణువిగ్రహాలు యీ ఇరువది నాలుగు రూపాల్లోనే చిత్రించబడినట్లు శిల్పశాస్త్రములు చాటుచున్నవి. ఈ ఇరువదినాల్గు ప్రతిమలను వేరువేరుగా గుర్తించుట చాలా శ్రమతో గూడిన విషయం. ఏలయన ఇరువది నాల్గు ప్రతిమలు స్థానకమూర్తి భంగిమలో నుండును. నాల్గు చేతులు శంఖము, చక్రము, గద మరియు పద్మము గల్గి కిరీటము, హారములు, కుండలములు యజ్ఞోపవీతము ధరించి పద్మాసనముపై నున్నట్లు శిల్పించి వుండును. కాని శంఖము, చక్రము, గద, పద్మము ఏవచేతుల్లో నున్నవో గమనించిన గుర్తించుట సులభము. పై శంఖము, చక్రము, గద, పద్మము గుర్తించినపుడు ఒకే వరుస క్రమం తీసుకోవాలి. శిల్పశాస్త్ర ప్రకారం ముందుగా వెనుక కుడిచేతి నుండి వెనుక చేయి, తదుపరి ముందు ఎడమచేయి ఆఖరిగా ముందు కుడిచేయి, [పరిగణనలోనికి తీసుకోవాలి. ఉదాహరణకు, కేశవమూర్తి విగ్రహం వె కుడి చేతిలో శంఖము, వెనుక ఎడమచేతిలో చక్రము, ముందు ఎ చేతిలో గద ముందు కుడిచేతిలో పద్మము విధిగా కల్గి వుండును. విధంగా ఇరువదినాల్గు విష్ణుప్రతిమలను గుర్తించ వచ్చును.



విగ్రహ శిల్పశాస్త్రములో రూపమండనమును ప్రామాణికముగ చరిత్రకారులు గుర్తించిరి. దానిలో నిచ్చిన ఇరువదినాల్గు విష్ణు మూర్తుల రూపాలను ఈ క్రింది పట్టికలో పొందుపరుస్తున్నాను. ఎవరికైనా విష్ణు రూపాలను గుర్తించుటకు ఈ పట్టికయే అధారం.

| వరుస సంఖ్య | మూర్తి పేరు | వెనుక కుడిచేయి | వెనుక ఎడమచేయి | ముందు ఎడమచేయి | ముందు కుడిచేయి |
|---|---|---|---|---|---|
| 1. | కేశవ | శంఖము | చక్రము | గద | పద్మము |
| 2. | నారాయణుడు | పద్మము | గద | చక్రము | శంఖము |
| 3. | మాధవ | చక్రము | శంఖము | పద్మము | గద |
| 4. | గోవిందుడు | గద | పద్మము | శంఖము | చక్రము |
| 5. | విష్ణు | పద్మము | శంఖము | చక్రము | గద |
| 6. | మధుసూదన | శంఖము | పద్మము | గద | చక్రము |
| 7. | త్రివిక్రముడు | గద | చక్రము | శంఖము | పద్మము |
| 8. | వామనుడు | చక్రము | గద | పద్మము | శంఖము |
| 9. | శ్రీధరుడు | చక్రము | గద | శంఖము | పద్మము |
| 10. | హృషీకేశ | చక్రము | పద్మము | శంఖము | గద |
| 11. | పద్మనాభుడు | పద్మము | చక్రము | గద | శంఖము |
| 12. | దామోదరుడు | శంఖము | గద | చక్రము | పద్మము |
| 13. | సంకర్షణ | శంఖము | పద్మము | చక్రము | గద |
| 14. | వాసుదేవ | శంఖము | చక్రము | పద్మము | గద |
| 15. | ప్రద్యుమ్న | శంఖము | గద | పద్మము | చక్రము |
| 16. | అనిరుద్ధుడు | గద | శంఖము | పద్మము | చక్రము |
| 17. | పురుషోత్తముడు | పద్మము | శంఖము | గద | చక్రము |
| 18. | అధోక్షజ | గద | శంఖము | చక్రము | పద్మము |
| 19. | నరసింహుడు | పద్మము | గద | శంఖము | చక్రము |
| 20. | అచ్యుత | పద్మము | చక్రము | శంఖము | గద |
| 21. | జనార్దనుడు | చక్రము | శంఖము | గద | పద్మము |
| 22. | ఉపేంద్రుడు | గద | చక్రము | పద్మము | శంఖము |
| 23. | హరి | చక్రము | పద్మము | గద | శంఖము |
| 24. | శ్రీకృష్ణుడు | గద | పద్మము | చక్రము | శంఖము |

మూడు మాసముల క్రితం శ్రీకాకుళం జిల్లా, సోంపేట తాలూకా మఠం సరియాపల్లెను సందర్శించితిని. అచ్చట శ్రీలక్ష్మీనారాయణ స్వామివారి మఠము గలదు. మఠాన్ని చాలా పవిత్రంగా మఠాధిపతులు పోషించుచున్నారు. పురావస్తువుల పరిశీలనలో ఈ అపురూపమైన గోవిందుని కాంస్య విగ్రహం నా దృష్టిలో పడింది. మఠాధిపతులు మాత్రము దానిని లక్ష్మీనారాయణునిగా పేర్కొన్నారు. పై పట్టికాధారంగా నారాయణమూర్తి వెనుక కుడి చేతిలో పద్మము, వెనుక ఎడమ చేతిలో గద ముందు ఎడమ చేతిలో చక్రము ముందు కుడి చేతిలో శంఖము విధిగా కల్గి వుండవలెను. దానికి భిన్నంగా యీ కాంస్య విగ్రహం వెనుక కుడిచేతిలో గద వెనుక ఎడమచేతిలో పద్మము ముందు కుడి చేతిలో శంఖము ముందు కుడిచేతిలో చక్రము గల్గి శోభాయమానంగా పద్మాసనము పై స్థానక భంగిమలో చిత్రించి యున్నది. పైపట్టికానుసారం గోవిందునిగా గుర్తించితిని. ఇది 30 సెం. మీ. ఎత్తు 12 సెం. మీ వెడల్పు గల్గి కిరీటము, హారము, కుండలాలు, యజ్ఞోపవీతము గల్గివున్నది.

విష్ణువు ఇరువదినాల్గు రూపాల్లోనే శిల్పాలు శిల్పించినట్లు శిల్ప శాస్త్రాలు తెల్పుచున్ననూ మన రాష్ట్రంలో యివి చాలా అరుదుగా కన్పడుచున్నది. కేశవమూర్తులు మినహా మిగిలినవి చాలా అరుదుగా బయల్పడుచున్నవి కర్నాటకలో ఎక్కువగా బయల్పడినట్లు దాఖలాలున్నవి. సుమారు నాల్గుసంవత్సరములకు పూర్వం రాతిలో మలిచిన నారాయణమూర్తిని కర్నూలుజిల్లా చెరువు బెల్‌గల్ గ్రామంలో కనుగొంటిని. దాని ఛాయా చిత్రముతో వ్యాసమును భారతిలో ప్రచురించి వుంటిని. ఇప్పుడా విగ్రహం కడపలో నున్న ప్రభుత్వ వస్తు ప్రదర్శన శాలలో భద్రపరచిరి. లోహంలో గోవిందమూర్తి లభ్యమగుట ఆంధ్రలో ప్రథమంగా వచ్చును. శిల్పపోలికలను బట్టి దీనిని క్రీ. శ. 16 – వ శతాబ్దానికి చెందవచ్చునని భావించుచున్నాను. ఇటువంటి విగ్రహాలు ప్రతిపల్లెలో నుండవచ్చును. వాటి వునికి పురావస్తు శాఖకు తెలిపి పునీతులు కండి.



శ్రీ కె. రామాంజనేయులు

# రాయవాచకంలో అన్యదేశ్యాలు

0.1 చారిత్రక దృష్టితో పరిశీలించినట్లయితే తెలుగు భాషమీద ప్రాచీనకాలం నుండి నేటిదాక అన్యభాషల ప్రభావం ప్రసరిస్తూనే ఉంది. ప్రాచీనదశలో తత్సమ తద్భవ పదజాలం ఎక్కువగా చేరిందని చెప్పవచ్చు. భౌగోళికంగా పరిసరస్థ భాషలైన తమిళ కన్నడ భాషల ప్రభావం మామూలే. తమిళం కంటె కన్నడ భాషా ప్రభావం తెలుగు భాషా సాహిత్యాలపై ఎక్కువగా ఉందని చెప్పవచ్చు. శాతవాహనుల కాలంనుండి మరఠ్వాడా, తెలుగు నాడులు భౌగోళికంగా కలసిపోయి నందువల్ల ఈ రెండు ప్రాంతాల్లోని వ్యవహృతభాషలు పరస్పర ప్రభావితమై ఉండుట నిర్వివాద విషయం.[1] తర్వాత మహమ్మదీయుల పరిపాలనా కాలంలో అరబిక్ పర్షియన్ భాషాపదాలు తెలుగువారి రాజకీయ, సాంఘిక రంగాల్లో వ్యవహారంలోకి వచ్చాయి.

0.2 తెలుగుభాషలోని పదజాలాన్ని దేశ్యం, అన్యదేశ్యమని ద్వివిధంగా విభజింపవచ్చు. మూలభాషనుండి సంక్రమించినవి, సహజ సిద్ధమైనవి దేశ్యాలు. తదితరాలు అన్యదేశ్యాలు. భాషలో కొత్తపదాలు చేరటానికి ముఖ్యకారణం ఆదానం. దీనికి విభిన్న భాషలతోటి సంసర్గమే మూలకారణం.

0.3 భాషల్లో ఆదానప్రదానాలు అనేక కారణాలవల్ల జరుగు తాయి[2]. ఒక భాషలోని పదాలు మరోభాషలోకి గౌరవంకోసంగాని లేదా అవసరాన్నిబట్టిగాని ఎరువుతెచ్చుకోటం జరుగుతుందని హాకెట్టుపేర్కొన్నాడు.[3] బ్లూంఫీల్డు ప్రకారం సాంస్కృతికమూ, సన్నిహితమూ, మాండలికము నని ఎరువుతెచ్చుకోవటం మూడు విధాలు.[4]

0.4 తెలుగు భాషలో కొన్ని అన్యదేశపదాలు బాగాస్థిరపడి పోయాలు. ఉదా॥కు రోడ్డు, టికెట్లు, బస్సు, సినిమా, రేడియో లాంటి ఇంగ్లీషుపదాలు ఖర్చు, చీటి, కాగితం లాంటి ఫారశీ పదాలు సామాన్య జన జీవితంలోకూడ నేడు నిత్యవ్యవహారాలైనాయ్. ఏభాష అయినా అన్యదేశ్యాల్ని స్వీకరించి సుసంపన్నమౌతుందన్నది సర్వజన విదితమే.

1. రాయవాచకం రాయల్ని గురించిన వాచకం. వాచక మనగా సమాచారం. రాయల్ని గురించిన సమాచారాన్ని అందిస్తుంది కాబట్టి రాయవాచకమనేది సార్థక నామధేయం. ఇది చారిత్రక వచన గ్రంథం. దీనికి పూర్వం ప్రతాపచరిత్ర, సిద్దేశ్వర చరిత్రలున్నవి. కాని ప్రాచుర్యంలో, ప్రాధాన్యతలో రాయవాచకమే విశిష్టమైంది. దీన్ని గురించి వ్రాస్తూ రామచంద్రరావుగారు, 'చరిత్రకారులకు బంగారుగని భాషావేత్తలకు వజ్రాలఖని' అని ప్రశంసించారు.[5]

1.1 రా.వా. లోని అన్యదేశ్యాల్ని పరిశీలిస్తే మనకు ఎక్కువగా కనిపించేవి. ఫారసీపదాలు. దీనికి కారణం కాకతీయ సామ్రాజ్యం పతనమై ఆంధ్రదేశం ముస్లింల హస్తగతమై చాలకాలం వారి పాలన క్రింద మ్రగ్గడమే. తెలుగు వాడుకభాషలో మిక్కిలిగా వ్యవహారంలో ఉన్న పారసీపదాలు ఎక్కువగా రాజకీయ పారిభాషికపదాలు, కొన్ని వేషభాషల్ని సూచించేవి వీటిని మనం రా. వా. లో చూడవచ్చు.

1.2 రా. వా. లోని అన్యదేశ్యాలు కొన్ని యథాతథంగానూ, కొన్ని కొద్ది మార్పులతోను, కొన్ని తెలుగు భాషాధ్వనులకు, నిర్మాణానికనుగుణంగాను మార్పులుపొంది తెలుగులో ప్రవేశించాయి. వాటిని గురించి వివరించటమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

**మార్పులేనివి :**

ఉదా : తిరు (113-18) (త) < తిరు [శ్రీ]
హెచ్చు (72-14) (క) < హెచ్చు [ఎక్కువ]
ధమామి (90-21) (ఫా) < ధమామి [ఢంకా]
హరువు (42-6) (క) < హరువు [జ్ఞానం]
ప్రసాపాటు (72-9) (త) < సాపాటు [భోజనం]
కై (జీతం) (43-18) (క) < కై [చేయి]

2. ధ్వనిమార్పులు :-

ఒక భాషనుండి వేరొక భాషలోనికి పదాలు చేరునపుడు కొన్ని ధ్వని మార్పులు కలుగుతాయి. ఆ ధ్వనిమార్పుల్ని రాయవాచకంలో ఉదాహరణలు ఆధారంగా వివరిస్తాను.

## 2.1 అజంతత :

తెలుగు అజంత భాష[6] కాబట్టి అన్యదేశ్యాలు అజంతాలై తెలుగులోకి వస్తాయి.

ఉదా : సలాము (56-6) < (ఫా) సలామ్ [నమస్కారం]

మహలు (46-8) < (ఉ) మహల్ [భవనం]

వజీరు (46-19) < (ఫా) వజీర్ [మంత్రి]

చబుకు (76-12) < (మ) చబక్ [కొరడా]

తాకీదు (104-12) < (ఉ) తాకీద్ [ఆజ్ఞాపత్రం]

కర్తారు (57-15) < (ఫా) కర్తార్ [తురుష్కుల దేవుడు]

రోజు (34-20) < (ఉ) రోజ్ [దినం]

2.2 దీర్ఘం, హ్రస్వం కావటం:-

పదాంతం లోని దీర్ఘం ఒక్కోసారి హ్రస్వం కావటం కనిపిస్తుంది.

భరవసము (55-2) < (ఫా) భరవసా (భరోసా) [నమ్మకం]

దట్టి (56-13) < (ఫా) దట్టీ [అంగవస్త్రం]

ఢిల్లి (66-5) < (ఉ) ఢిల్లీ [భారతదేశ రాజధాని]

తాణ్యము (111-20) < (ఉ) తాణా (111-20) [కాపల]

బయిద (40-22) < (ఫా) ప్యాదా (4) [యోధుడు]

2.3 ద్విరుక్తత:- రీ డూప్లికేషన్ ఆఫ్ సిలబుల్

కొన్ని పదాల్లో ద్విరుక్తత గోచరిస్తుంది. అయినా అర్థంలో మార్పేమీ లేదు.

పక్కీరు (60-9) < (ఫా) ఫకీర్ [బిచ్చగాడు]

కొత్తవాలు (55-4) < (మ) కొత్వాల్ [రక్షణాధికారి]

2.4 అసంయుక్తత:- డీకన్సొలిడేషన్:

తెలుగులో పదమధ్యంలో సంయుక్తత లేదు. కాబట్టి అన్యదేశ్యాల్లో సంయుక్తాక్షరాలు విడగొట్టబడ్డాయి. కొన్నిటిలో సంయుక్తత అలాగే నిలిచి ఉంది.

కొత్తవాలు (55-4) < (ఫా) కొత్వాల్ [రక్షణాధికారి]

లశికిరీ (తనాన) (47-11) < (ఫా) లష్కర్ [బానిసత్వం]

హజారము (87-5) < (ఫా) హుజ్రా [ఆస్థానం]

సురధాణి (65-21) < (ఫా) సుల్తాన్ [చక్రవర్తి]

సురతాణి (71-7)

హురుమంజ్జి (105-8) < (ఫా) హర్మజ్ [పారశీక దేశంలో ఒక ముఖ్యమైన రేవు]

బయద (40-22) < (ఫా) ప్యాదా

తురక (47-2) < (ఉ) తుర్క్ [టర్కీదేశం వాడు]

కుర్నీసులు (110-21) < (ఫా) కోర్నీస్ [వినమ్రశిరస్కుడై రాజుకు ఏడుసార్లు నమస్కారం చేయుట]

(అ) ముస్తీదు (41-6) < (ఫా) ముస్తయిద్ [నిశ్చయింపబడినవాడు]

2.5 వర్ణాధిక్యత:- అడిషన్ ఆఫ్ సిలబుల్:

కొన్ని అన్యదేశ్య పదాలు తెలుగులోనికి వచ్చినపుడు కొన్ని వర్ణాల్ని కలుపుకొని వస్తాయి.

మొగలాయి (75-10) < (ఫా) మొగల్ [ముస్లిం చక్రవర్తి]

కబాయి (43-2) < (ఫా) ఖబా [అంగవస్త్రం]

కుళ్ళాయి / (43-2) < (ఫా) కులహ్ [బట్టటోపి]

కుల్లాఇ (81-3)

డేరిజా (85-21) < (ఉ) డేరా [గుడారం]

2.6 వర్ణచ్యుతి:- లాస్ ఆఫ్ సిలబుల్:

భాషలో ఆదాన ప్రదానాలు జరిగినపుడు కొన్ని వర్ణాలు లోపిస్తాయి.

సరదు (28-21) < (ఫా) సర్‌హద్ [పొలిమేర]

జిరా / జీరా (34-17) < (ఫా) జిరహ్ [గుఱ్ఱంపై వేయు వస్త్రకవచము]

2.7 వర్ణ వ్యత్యయం (మెటాథీసిస్)

ఉచ్చారణలో దగ్గరగా ఉన్న వర్ణాలు పరస్పరం స్థానాన్ని మార్చుకోటాన్ని 'వర్ణవ్యత్యయం' అంటారు. హాల్ ప్రకారం ఒక పదంలోగాని, రెండు పదాల్లోగాని, వర్ణస్థానం మారడం వర్ణవ్యత్యయం[7]

కస్తిబడి (15-6) < ఖస్త్ (ఫా) సఖ్తి [కష్టబడి]

2. 8 లోపదీర్ఘత (కాంపెన్సేటరి లెంగ్తనింగ్)

కొన్ని అన్యదేశ్యపదాల్లో ఒక వర్ణంలోపించి దాని పూర్వాచ్చు దీర్ఘం కావటం కనిపిస్తుంది.

(అ) ముస్తీదు (41-1 < (ఫా)ముస్తయిద్ [నిశ్చయింపబడినవాడు]

దునేదారు (71-3) < (ఫా) దునియదార్ [జమిందారు]

జిరా(34-17) < (ఫా)జిరహ్ [గుఱ్ఱంపై వేయు వస్త్రకవచం]

**2. 9** స్వరభక్తి లేక స్వరవిశ్లేషణం (అనాప్టిక్సిస్)

సంయుక్తహల్లులకు మధ్య అచ్చు (స్వరం) వచ్చి ఆ రెండు హల్లుల్ని విడదీయటం స్వరభక్తి.

లశకరీ (తనాన) (47-11) < (ఫా) లష్కర్ [బానిసత్వం]

బయద (40-22) < (ఫా)ప్యాదా [యోధుడు]

హురుమంజి (105-8) < (ఫా) హుర్మజ్ [పారశీ దేశంలో ముఖ్యమైన రేవు]

తురక (47-2) < (ఉ) తుర్క్ [టర్కీదేశంనుండి వచ్చినవాడు]

హజారము (37-5) < (ఫా) హుజ్రా [ఆ స్థానం]

2. 10 స్వర సమీకరణం లేక స్వరాకర్షణం(ఓ వెల్ హార్మొని)

అన్యదేశ్యాల్లో ఈ మార్పు వైకల్పికంగా జరిగింది. పూర్వంలో గాని, పరంలోగాని ఉన్న అచ్చుల ఆకర్షణవల్ల ఒక అచ్చుమార్పు పొందుట స్వరాకర్షణ.

చబుకు (79-12) < (ఫా) చాబుక్ [కొరడా]

(ధోవతి) సం + లు > ధోవతులు (71-11) [పరిశుభ్రమైన అంగవస్త్రాలు]

తిరుపతి + లు > తిరుపతులు (113-18) [వేంకటేశ్వరుని పుణ్యక్షేత్రాలు]

నదురు (110-21) < (ఫా) నజర్ [కానుక]

మార్పుపొందనివి :

సామగ్రి + లు > సామగ్రీలు (94-6) [వస్తుసంభారం]

పట్టీ + లు > పట్టీలు (56-8) [జాబితాలు]

మావటీ + లు > మావటీలు (43-4) [ఏనుగులను నడిపించు వారు]

మావుతులు [43-20]

వజీర్ + లు > వజీర్లు (46-19) [మంత్రులు]

సరదు (59-11) > సరహద్ [పొలిమేర]

2.11 వర్ణసమీకరణం : అసిమిలేషన్

ఒక పదంలోగాని, రెండు పదాల్లోగాని దగ్గరగా ఉన్న వర్ణాలు సమీకరింపబడటం వల్ల ఒక వర్ణం మార్పు పొందుతుంది.

చావడి + లు > చావళ్ళు (56-10) [విశ్రాంతి ప్రదేశము]

నగరు + లోనికి > నగళ్లోనికి (56-18) [నగరం లోనికి]

2.12 మహాప్రాణం అల్పప్రాణం: యాస్పిరేషన్-అనాస్పిరేషన్

కొన్ని పదాల్లో మహాప్రాణం అల్పప్రాణంగా మారింది. కొన్ని పదాల్లో మహాప్రాణం, అల్పప్రాణం మధ్య వినిమయం కనిపిస్తుంది.

భేరి (90-21) ( < సం) భేరి [శంఖం]

ధూళి (92-4) ( < క) ధూళు [దుమ్ము]

ధోవతులు (71-11) ( < సం) ధౌతః [పరిశుభ్రమైన అంగ వస్త్రాలు]

భరవసముగా (55-2) ( < ఫా) భరవసా (భరోసా)[ విశ్వాసంగా, నమ్మకంగా]

మోర్చా (వేయు) (85-6) ( < (ఫా) మోర్చా [సైన్యాన్ని ఒక రహస్య ప్రదేశంలో దించు]

గుఢాచారుడు (87-10) ( < సం) గూఢచారి [రహస్యభటుడు]

శిఖా (55-2) ( < సం) శిఖా [జుట్టుముడి]

ముఖాములు (59-8) < ముఖామ్ ( < ఫా) [నిశ్చయింపబడినవాడు]

స్థంభము (60-11) ( < సం) స్థంభః [కంబం]

స్థళము (59-18) ( < క) స్థళ [ప్రదేశం]

భండారము (103-21) ( < సం) భండార్ [బొక్కసం]

భేటి శేసుకొని (110-19) (ఫా) భేటి [కలుసుకొని]

2.12.1 మహాప్రాణం అల్పప్రాణంగా మారటం:-

పక్కీరు (60-7) < ఫకీర్ (ఫా) [బిచ్చగాడు]

ఠాణ్యాం (85-4) < ఠాణా (ఫా) [ఉద్యోగులుండు చోటు]

నగారా (89-10) < నఖారా (ఫా) [యుద్ధభేరి]

2.12.2 మహాప్రాణ అల్పప్రాణాల వినిమయం:-

ధమామి/దమామి (◁ మ) (ఢంకా)
(90-21) (76-8)

ఠాణ్యము/ఠాణ్యం (ఫా) (ఉద్యోగులుండుచోటు)
(59-13) (85-4)

ఫిరంగి/ఫిరంగ్ (ఫా) (శతఘ్ని)
(51-7) (98-4)

రొఖ్ఖము/రొక్కం (◁ క) (డబ్బు)
(42-9) (42-4)

2.13 మూర్ధన్యీకరణం (రెట్రోఫ్లెక్షన్)

కొన్ని దంతమూలీయధ్వనులు మూర్ధన్యాలుగా మారాయి.

సురధాణి (65-21) ◁ (ఫా) సుల్తాన్ (చక్రవర్తి)

దివాణం (46-19) < (ఉ) దివాన్ (కొలువుకూటం)

ఇంకా కొన్ని ధ్వనుల మార్పులు,

-ష- ▷ -శ- లష్కర్ (ఫా) లశికిరి (47-11)(జానిసత్వం)

-జ- ▷ -ద- నజర్ (ఫా) ▷ నదురు (110-21) (కానుక)

ప- ▷ బ - ప్యాదా (ఫా) ▷ బయద (40-22) (బంటు)

అంతేగాకుండా కొన్ని ధ్వనుల మధ్య వర్ణవినిమయం కనిపిస్తుంది.

-క-/-గ - కాకితము (49-17) / కాగితము (59-11) ◁ కాగజ్ (ఫా)

-శ-/-ల స్థశం (62-21) స్థలం (49-19) < స్థళ (క)

-శ-/-స- నిజాంశాహు (48-8) /యెదులసాహు (48-8) ◁ శాహ్(ఫా)

2.14 హకార యుక్తపదాలు కొన్ని రా.వా.లో చోటు చేసుకున్నాయి.

హజారము (37-5) ◁ హుజ్రా (ఫా) [ఆస్థానం]

హేజీబు (46-21) ◁ హాజిబ్ (ఫా) [దౌత్యవ్యవహర్త]

హామిక (97-18) [మదం] [క.ర]

హోయలు (109-22) [విలాసం, ఒయ్యారం]

హర్మత్తు /హన్మత్తు (91-15) [పెద్దగా, గట్టిగా]

హెచ్చు (72-14) ◁ హెచ్చు (క) [ఎక్కువ]

హెచ్చరిక (72-18) ◁ హెచ్చరికె (క) [జాగ్రత్త]

హరవు శాయమని ◁ హరువు (క) [తెలియజేయమని]

మహలు (46-18) ◁ మహల్ (ఉ) [భవనం]

ప్రహరి (4-8) ◁ ప్రహరా (ఉ) [రక్షకకుడ్యం]

అహముదానగరము (61-5) ◁ అహ్మద్‌నగర్ (ఉ) [పట్టణం పేరు]

నిజాంశాహు (48-8)....శాహ్ (ఫా) [వ్యక్తిపేరు]

యెదులసాహు (48-8)—శాహ్ (ఫా) [వ్యక్తిపేరు]

హురుమంజి (105-8) ◁ హుర్మజ్ (ఫా) 'పారసీ దేశంలో ముఖ్యమైన రేవు'

3. అన్యదేశ్యాల్లోని పద పదాంశాల్లో మార్పాలజి

కొన్ని మార్పులు కలుగుతాయి. కొన్ని అన్యదేశ్యాల్లో తెలుగు ప్రత్యయం చేరినపుడు ప్రాతిపదికల్లో మార్పుండదు.

మార్పులేనివి :

ఉదా ॥ పట్టీ (ఫా) + లు ▷ పట్టీలు (56-8)

వజీర్ (ఫా, + లు > వజీర్లు (46-19)

3.1 బహువచనం : (ప్లూరాలటి)

కొన్ని అన్యదేశ్య నామప్రాతిపదికలకు తెలుగు బహువచన ప్రత్యయాలు చేరినపుడు ప్రాతిపదిక రూపం మారుతుంది.

కోర్నిష్ > కుర్నీస్ + ఉ + లు > కుర్నీసులు (110-21)

హాజిబ్ > హేజీబ్ + ఉ + లు > హేజీబులు (46-21)

జోర్‌జంగ్ > జవురుజంగ్ + ఉ + లు > జవురు జంగులు(50-7)

మొఖామ్ > ముఖామ్ + ఉ + లు > ముఖాములు (59-8)

ప్యాదా > బయద + లు > బయదలు (35-19)

సలామ్ > సలామ్ + ఉ + లు > సలాములు (56-6)

నాజ్దాద్ ▷ నామజాద్ + ఉ + లు ◁ నామజాదులు (51-12) (నియోగులు)

(గౌరవ బహువచనం) - గార్ + లు ▷ -గార్లు (5-13)

అన్యదేశ్యనామ ప్రాతిపదికకు అన్యదేశ్యబహువచనప్రత్యయం చేరిన తరువాత మరల తెలుగు బహువచన ప్రత్యయం చేరిన రూపం రా.వా. లో కనిపిస్తుంది.

అణ్ణ + కళ్ > అణ్ణగళ్(త) + ఉలు > అణ్ణగళులు (38-15) (వేత్రహస్తులు)

అణ్ణ (త) + గార్ (ఫా?) అణ్ణగర్ + లు > అణ్ణగర్లు (37-1)

**3.2** విభక్తిప్రత్యయాలు : (సఫెక్స్‌స్)

అన్యదేశ్యపదాలు తెలుగులోనికి వచ్చునపుడు అజంతాలవుతాయని చెప్పాం. కొన్ని పదాల్లో పదాంతంలోని 'ఉ' విభక్తి ప్రత్యయంలాగా వ్యవహరిస్తుంది.

నిజాంశాహు (48-8) < (ఫా) - శాహ్ (వ్యక్తిపేరు)

వజీరు (46-19) < (ఫా) వజీర్ (మంత్రి)

పక్కీరు (60-9) < (ఫా) ఫకీర్ (బిచ్చగాడు)

కర్తారు (57-15) (ఫా) కర్తార్ (ముస్లిం దేవుడు)

కొత్తవాలు (55-4) < (మ) కొత్వాల్ (రక్షణాధికారి)

చబుకు (76-12) < (మ) చబక్ (కొరడా)

—డు

గూఢాచార్యుడు < (సం) గూఢచారిః [రహస్య భటుడు]

తురుష్కుడు < (ఫా) టర్కిష్ [టర్కీదేశస్థుడు]

అంకుశఖానుండు < (ఫా) — ఖాన్ [వ్యక్తిపేరు]

—ము/-ం

ఉదా : స్థళం (97-6) < (క) స్థళ (ప్రదేశం)

పాళ్యము (46-15) < (క) పాళ్య [పెద్దఊరు]

కవళము (44-6) < (క) కవళ [ఆహారము]

రొఖ్ఖం (42-9) < (క) రొఖ్ఖ [డబ్బు]

సబళం (43-11) < (క) సంబళ [జీవితం]

జగడం (68-18) (క) జగళ [పోట్లాట]

భండారం (108-21) < (సం) భండార్ [బొక్కసం]

కాకితము (47-4) < (ఫా) కాగజ్ [కాగితం]

దివాణం (46-19) < (హిం) దివాన్ [ఆస్థానమందిరం]

—దారు

దునేదారు (89-5) < [హిం] దునియదార్ (జమీందారు)

**3.3** విశేషణం : (ఎడ్జెక్టివ్)

కొన్ని పదాల్లో అన్యదేశ్య విశేషణంగా ప్రయుక్తమైం కొన్ని విశేషణలు అన్యదేశ్యాలనుండి గ్రహించబడ్డాయి.

ఉదా :

పక్కీరు గోపోజి (61-6) < ఫా. ఫకీర్)

పిరంగ్గి నాదం (93-4) (< ఫా పిరంగి)

రొఖ్ఖ సిటపలు (42-4) (< క. రొఖ్ఖ)

కైజీతం (43-4) (< క. కయ్)

దొడ్డ నియ్యోగులు (48-18) (< క. దొడ్డ)

తిరుపతులు (3-19) (< త. తిరు)

**4.** సమాసాలు : (కాంపౌండ్స్)

సమాసాల్లో సిద్ధ సమాసాలని రెండురకాలు.

**4.1** సిద్ధసమాసాలు : (నాచురల్ కాంపౌండ్స్)

అన్యదేశపదాలతో మార్పులేక ఏర్పడిన సమాసాలు.

ఉదా : దాదిమహలు (43-18)

రొఖ్ఖరూపాయలు (62-22)

ప్రహరి బడగములు (4-8)

**4.2** సంకీర్ణ సమాసాలు : (హైబ్రిడ్ కాంపౌండ్స్)

ఇతరభాషా పదాలతో కూడినవి సంకీర్ణ సమాసాలు. వీ వైరి సమాసాలంటారు.

ఉదా : బీగ ముద్రలు (4-8) (బీగ(క) + ముద్ర(సం)

జీరీజు తాళ్లు (83-1) (జీరీజు(ఫా) + తాడు(తె)

తోలు కుళ్ళాయి (9-7) (తోలు(తె) + కులహ్(ఫా))

కమ్మకాకితములు (5-5) (కమ్మ(తె) + కాగజ్(ఫా))

సరదు రాజ్యములు (28-21) సర్‌హద్(ఫా) + రాజ్యం(స

రస్తు సామగ్రీలు (49-3) (రసద్(ఫా) + సామగ్రి(సం))

కైజీతం (62-19) (కయ్(క) + జీవిత(క)(సం))

9. క్రియలు : (వర్బ్స్)

అన్యదేశ్య ధాతువులకు తెలుగు సహాయక క్రియలు చేరి ఏర్పడిన క్రియా ప్రయోగాలు మనకు రా.వా.లో అక్కడక్కడ కన్పిస్తాయి.

మోర్చావేయు (85-6) [సైన్యాన్ని ఒక రహస్యప్రదేశంలో ఉంచు]

భేటిశేసుకొను (110-19) [కలుసుకొను]

ప్రసాబడు (65-9) [భోంచేయు] ఇట 'ప్ర'-అనేది.

హాజవుశాయు (42-5) [తెలియజేయు]

10. పై పరిశీలనవల్ల రా.వా.లో అన్యదేశ్యాలు తెలుగు ధ్వనులకు భాషానిర్మాణాని కనుగుణంగా వచ్చిచేరాయన్నది సుస్పష్టం. మన దేశంపై ముస్లింల దండయాత్రలవల్ల వారి పరిపాలనా ప్రాబల్యం వల్ల సాంఘిక రాజకీయ, పరిపాలనాది రంగాల్లో అన్యదేశ్యపదాలు విశేషంగా వచ్చిచేరాయి. రెండు భాషలు దగ్గరైనప్పుడు వాటి మధ్య పరస్పర ప్రభావం ఉండటం సహజం. రా.వా. కాలం నాటికే అనేక పదాలు ఇతర భాషలనుండి వచ్చి తెలుగులో స్థిరపడ్డాయి. ఆ నాటి నుండి ఈ నాటివాక అన్యదేశ్యాల్ని స్వీకరిస్తూ తెలుగులో అభివృద్ధి చెందుతూంది. ఇలా అభివృద్ధి చెందుతూ సుసంపన్నం కావటం భాషా లక్షణం.

సంకేతాలు : (సింబల్స్)

ఉ : ఉర్దూ
ఉదా : ఉదాహరణ
క : కన్నడం
త : తమిళం
మ : మరాఠీ
ఫా : ఫారసీ
రా.వా : రాయవాచకం
సం : సంస్కృతం
> : నుండి మారింది
< : నుండి వచ్చింది.
( ) బ్రాకెట్లలోని సంఖ్యలు రా. వా. లోని పుటల్ని పంక్తుల్ని సూచిస్తాయి.
[ ] బ్రాకెట్లలో పదాలకర్థాలు ఇవ్వబడ్డాయి.

ఆధార గ్రంథాలు : (రిఫరెన్స్)

(తెలుగు)


1. కృష్ణమూర్తి, భద్రిరాజు (సం) తెలుగు భాషాచరిత్ర. హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1974.
2. గోపాల కృష్ణారావు, కె. తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము. హైదరాబాదు, ఆంధ్రసారస్వత పరిషత్తు. 1968
3. దోణప్ప, టి. భాషాచారిత్రక వ్యాసావళి, హైదరాబాదు, ఆంధ్ర సారస్వతపరిషత్తు, 1972.
4. రామాంజనేయులు, కె. రాయవాచకం-భాషాపరిశీలనం, (ఎం. ఫిల్ సిద్ధాంతవ్యాసం) అము. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం, 198 .
5. గంగప్ప, ఎస్. 'కోలాచలం శ్రీనివాసరావు (1854-19)నాటకాలు అన్యదేశ్యాలు' తెలుగు, అక్టో-డిశం, 1976


(ఇంగ్లీషు)


6. బ్లూంఫీల్డు, ఎల్ లాంగ్వేజ్, న్యూయార్క్, హోల్ట్, 1933.
7. కాల్డ్ వెల్, ఆర్. ఎ కంపేరిటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ లేక సౌత్ ఇండియన్ లాంగ్వేజస్ రీ ప్రింట్ 1936 మద్రాసు మద్రాసు విశ్వవిద్యాలయం.
8. హాల్. ఆర్. ఎ. ఇంట్రడక్టరి లింగ్విస్టిక్స్, ఫిలడెల్ఫియా చిల్టన్, 1964.
9. హాకెట్, సి. ఎఫ్. ఎ కోర్స్ ఇన్ మోడరన్ లింగ్విస్టిక్స్. న్యూయార్క్ : మ్యాక్ మిలన్, 1958.


ఫుట్ నోట్స్ :

1. టి. దొణప్ప : భాషాచారిత్రకవ్యాసావళి — పేజి 147.
2. భాషలమధ్య అధిక సాన్నిహిత్యం "పాలితులపై పాలకుల ప్రభావం" ప్రజలు ఒక ప్రాంతంనుండి మరో ప్రాంతానికి వలసపోవటం, సాంస్కృతిక ప్రభావం మొ॥ వి.
3. సి. ఎఫ్. హాకెట్ : ఎ కోర్స్ ఇన్ మోడరన్ లింగ్విస్టిక్స్ - పేజి 403.
4. ఎస్. బ్లూంఫీల్డ్ లాంగ్వేజ్ - పేజీలు 444, 495.
5. సి. వి. రామచంద్రరావు [సం]: రాయవాచకం పీఠిక ఆం. ప్ర. సా. అ. ప్ర. 1982.
6. రాబర్ట్ కాల్డ్ వెల్ : ఎ కంపేరిటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ లేక సౌత్ ఇండియన్ లాంగ్వేజెస్ భాగం 1 పేజి 134.
7. హాల్ ఇంట్రడక్టరి లింగ్విస్టిక్స్ పేజి 35.

# పెళ్ళికొడుకు కనుమ


కన్నడమూలం: శ్రీమాస్తి వెంకటేశ అయ్యంగార్

అనుసరణ: జనుమద్ది హనుమచ్ఛాస్త్రి




[ శ్రీమాన్ మాస్తి వెంకటేశ అయ్యంగార్ ఆధునిక కన్నడ కథా పితామహుడు. నవల, నాటక, విమర్శ, జీవనచరిత్ర, అనువాదం, కథాకావ్య కర్తృత్వం, సంపాదకత్వం మున్నగు విభిన్న పీఠప్రశస్తి నందుకొన్న సాహితీమూర్తి. వారి కథాకావ్య సంపుటం 'అరుణలో' లో 'మదలింగనకణివె' ( పెళ్లికొడుకు కనుమ ) అతి విశిష్టమైనది. గ్రామనామ చరిత్ర ఆధారంగా రచింపబడింది. ]

మైసూరు ప్రాంతంలోని చిక్కనాయకనహళ్ళి తాలూకా కేంద్రానికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలోవున్న చిన్న పల్లెటూరు. "మదలింగనకణివె" (పెళ్ళికొడుకు కనుమ) ఈ గ్రామాన్ని "చుట్టు పల్లె" అనికూడా పిలుస్తారు. ఈ కనుమ చరిత్రలో దాగిన కథ రాతిగుండెలను సైతం కరగిస్తుంది. సరళమైన "రగడ"లో సాగిన యీ కథ గద్యశైలికి సన్నిహితంగావుంటుంది.

కొన్నేళ్ళక్రితం సంఘటన : కనుమప్రక్కన ఒక పల్లె: ఆ పల్లెటూళ్ళో అందంగావుండే అక్కచెల్లెళ్ళిద్దరు వుండేవారంటూ కవి కథను ప్రారంభిస్తాడు. అందగత్తెలు అన్న ఒక పదంతోనే వారిని చిత్రించాడు కవి.

పెళ్ళికొడుకు యువకుడు. సాహసప్రవృత్తి, స్వాభిమానం కలవాడు. చూపరులను ఆపే ఆకర్షించే విగ్రహం. పెద్దమ్మాయితో అతని పెళ్లి జరిగి మూడురోజులైంది. మంచి ముహూర్తం చూసుకొ ఇల్లాలితోపాటు స్వగ్రామం బయలుదేరాడు పెళ్ళికొడుకు.

మొట్టమొదటిసారి అత్తగారింటి కెళ్ళే కూతురును ఒంటరి పంపటం సంప్రదాయం కాదు. పెళ్ళికూతురుతో పాటు ఆమె త జాణ అన్న చెల్లెలు కూడా ప్రయాణం సాగించారు. సరసోక్తుల సల్లాపాల మధ్య ప్రయాణం సాగింది.

అక్క అత్తగారింటికి వెళ్ళిన తర్వాత తాను ఒంటరి వుండాల్సి వస్తుందన్న బెంగ చెల్లి జాణమ్మకు.

బరువైన గొంతుతో 'అక్కయ్యా, మమ్మలను వదలి వె టానికి మనసొచ్చిందా?' అని ప్రశ్నించింది చెల్లి.

చెల్లిని వదలి పోవటం ఆమెకెంతో బాధగా వుంది. ఆకు అకుగా అన్యోన్యంగా పెరిగారిద్దరు. చెల్లి మాటలు విన్న అక్క కన్నీరు కట్టలు తెంచుకుంది. మౌనం ఆవహించింది.

తల్లి, 'రేపు నీవు మాత్రం భర్తతో పాటు వెళ్ళకుండా వుంటావామ్మా? కొత్త అనుబంధాలతో మనసు మార్చుకోక తప్పదు' అన్నది.

జాణమ్మ ముసిముసిగా నవ్వుతూ, 'నాకు పెళ్ళే వద్దు' అన్నది.

అంతలో పెళ్ళికొడుకు, 'పెళ్ళికి ముందు అందరూ అలాగే అంటారు. వద్దు వద్దు అంటూ, ఎవడో ఒకడు వచ్చి చేపడితే అతని వెంట పరుగు తీస్తారు' అంటూ పరిహసించాడు.

జాణ, అసలు ఆ అమ్మాయి పేరే జాణమ్మ "ఇంకా పెళ్ళయి మూడు రోజులు కాలేదు. బావగారు అన్నీ తెలిసిన వాడిలా మాట్లాడటమే? అన్నది.

పెళ్ళికొడుక్కి మరదలితో సరసాలాడటం యిష్టం.

వయసు, అందం, చిలిపితనం పొంగే పిల్ల సరసోక్తులకు మారు పల్కని యువకుడుంటాడా?

"నాకు అన్నీ తెలుసో, లేదో నీకెలా తెలిపేది? అక్కను వదలి వుండటానికి ఇష్టం లేకుంటే మాతోనే వుండు. అప్పుడు నీకే తెలుస్తుంది' అన్నాడు కొంటె బావ.

మరదలు పిల్ల నవ్వింది.

ప్రయాణం సాగుతూ వుంది.

అక్క కూడా చెల్లెమ్మను తనతోపాటు వుంచు కోవాలనుకుంది.

'జాణను మాతో వుండనీయమ్మా' అని తల్లిని అడిగింది.

మరదలిపై మోజుపడిన పెళ్ళికొడుకు పెళ్ళాం కోరికకు ఒత్తాసు పలికాడు.

అక్కచెల్లెళ్ళ అనుబంధం అలాంటిది.

పెద్దికూతురి మాటలు తల్లికి అంతగా రుచించలేదు. కట్టుకొన్న ఒక పెళ్ళాంతోనే ఏగలేని వారెందరినో ఆమె చూచింది.

'మీలాంటివారు నిండు యవ్వనంలోని ఇద్దరు పెళ్ళాలను ఎలా ఏలుకుంటారు?

ఆ మాటలు పెళ్ళికొడుకు స్వాభిమానానికి ఈటెల్లా గుచ్చుకున్నాయి.

'అత్తమ్మా, నేనేం మగాణ్ణి కానా? మీ పెద్ద కూతురుతో పాటు, మరదల్ని ఏలుకో లేననుకున్నారా? ఇద్దరు పెళ్ళాలతో కాపురం చేసే వారెందరు లేరు?' అని సమాధాన మిచ్చాడు.

మాటల్లోనే వారు చుట్టుకనుమ దగ్గరికొచ్చారు.

కనుమ దాటితే పెళ్ళికొడుకు వూరు. కనుమగుండా వెడితే మూడు మైళ్ళు. ప్రక్కనే వున్న కొండ ఎక్కి దిగితే ముప్పాతిక మైలు మాత్రమే.

కొండ నిటారుగా వుంది. దాన్ని ఎక్కి దిగటం కష్టమే.

అత్తమ్మ ఏమనుకుందో.

'అంత ఇష్టంగా వుంటే ఈ కొండను పీపు చేసుకొని ఎక్కాలి. అలాగే అవతలి వైపు దిగాలి. మా జాణమ్మను పెళ్ళాడ్డానికి నాకే అభ్యంతరం వుండదు', అంది యథాలాపంగా.

అత్తమ్మ మాటలు అల్లుని పౌరుషాన్ని రెచ్చగొట్టాయి. అదొక సవాల్‌గా తీసుకున్నాడు. జాణపై అతనికున్న ప్రేమ అతన్ని మరింతగా ప్రేరేపించింది.

నేను మీరన్నట్టే కొండెక్కి అటువైపు దిగుతా. వెంటనే జాణ చేత్తో చెంబు నిండా నీళ్ళు యిప్పించండి.' అన్నాడు.

మరదలివైపు చూచాడా బావ. మరింత వుత్సాహం తెచ్చుకున్నాడు.

కొండ నిటారుగా వుంది. ఎండ మండుతూ వుంది. అయినా కొండ ఎక్కనారంభించాడు.

అత్తమ్మ కేదో భయం.

'ఈ ఎండలో కొండెక్కి బ్రతికి బయట పడగలడా? అని ఆమె గుండె కొట్టుకోసాగింది.

'వద్దు నాయనా, ఏదో మాటవరస కన్నాను. అంతే. దయచేసి తిరిగి రా, నాయనా' అని బతిమాలుతూ కేక వేసింది.

పెళ్ళికొడుకు పంతం మానలేదు. కొండ పైకి పాకుతూ పోతున్నాడు.

సరసాని కన్న మాటలు యీ రీతిగా పరిణమించినందుకు మూడు హృదయాల్లో మూగవేదన ప్రారంభమయింది.

పెళ్ళికొడుకు కొండశిఖరంచేరి కాసేపు విశ్రమించి చేతనున్న నిమ్మకాయను పీల్చి విత్తులను వుమ్మేశాడు.

ముగ్గురు ఆడవాళ్లు గబగబా కొండ అవలవైపు చేరారు.

వయసు మళ్ళిన తల్లికి దాహం వేసింది. పెద్దకూతురు 'అమ్మా నీవు కాస్తా దాహం పుచ్చుకో' అంటూ చేతనున్న నీటి చెంబున యివ్వబోయింది.

ఆ మాటలు జాణకెందుకో సహించలేదు.

ఎండలో నడచి వచ్చిన తమకే అంత దాహంగావుంటే కొండెక్కి దిగి వస్తున్న బావ ఎంత దప్పికతో వుంటాడో ? అనుకుంది జాణమ్మ.

'ముందు బావను తాగనివ్వమ్మా' అన్నది. పందెం గెల్చి జాణను తన దానిగ చేసుకుంటానని వువ్విళ్లూరుతున్నాడు పెళ్ళికొడుకు.

'నా బావ పందెం గెల్చాడు. అతనితో సుఖంగా కాపురం చేస్తానని' మరదలు గంపెడాశతో వుంది.

తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుంది. పెళ్ళికొడుకు బాగా అలసిపోయాడు. ఊపిరి పీల్చటానికి కూడా కష్టమైంది. నోట మాట రావటంలేదు. సైగలు చేస్తూ జాణవైపు చూశాడు. జాణమ్మ చెంబుతో నీళ్లు అందివ్వాలని ముందుకెళ్లింది. చేతులు తడబడుతున్నాయి. బావ పరిస్థితి చూచి కాళ్లు వణికాయి. ఈ స్థితిలో చేతిలోని చెంబు జారి నీళ్ళన్నీ నేలపాలయ్యాయి.

పెళ్ళికొడుకు జాణవైపు చూస్తూ అలాగే కుప్పకూలిపోయాడు.

జాణమ్మ కళ్ళకు బైర్లు కమ్మాయి.

'అయ్యో - బావ' అంటూ పడిపోయింది.

అత్తమ్మ 'అయ్యో, అయ్యో అంటూ చీర చెంగుతో అల్లునికి గాలి వీస్తున్నది.

పెద్దకూతురు రోదిస్తూ. 'నా భర్తను చంపేశావు' అంటూ తల్లికి శాపనార్థాలు పెట్టసాగింది.

'నాసుఖాన్ని చూడలేక నీటిని నేలపాలు చేసి, నా కాపురం కూల్చావుకదే' అంటూ చెల్లిని చీదరించుకుంది.

జాణకు మాట పెగల్లేదు. ఖాళీచెంబుతో పక్క పల్లెవైపు పరుగుతీసింది. నీటితో తిరిగి వచ్చింది. అంతలోనే బావ కాలం చెల్లింది. మరదలు వచ్చేంతలోనే బావ శవమయ్యాడు.

పెరిగే పైరు భాద్రపదంలోనే అగ్గిపాలైంది అంటూ మాస్తి గారు కథను ముగించారు.

• • • •

పెళ్ళికొడుకు చచ్చి ఆ కనుమకు తన పేరు యిచ్చివెళ్ళాడు.

అనాటి దయనీయ స్థితిని చూచిన రాళ్లు నేటికీ రోదిస్తున్నాయి అంటాడు కవి.

దప్పికతో అలమటించి అసువులు బాసిన అల్లుని ప్రేతాత్మ నేటికీ ఆ కొండచుట్టూ తిరుగుతూ వుందని ఆ ప్రాంత ప్రజల విశ్వాసం.

అత్తమ్మ, పెద్దకూతురు, మరదలు ఏమయ్యారో చెప్పలేదు కవి.

# "మూలపడ్డ కలం"

"రాయుని"

## నాడు

1\. ఆదర్శ పుటార్భాటాలూ
వికసించని మదిలాలిత్యం
సప్తవర్ణముల సుస్వప్నాలూ
గుండె నిండుగా ఆవేశం
రాజీకేరాని మనస్సూ
ఏదో చేసెయ్యాలని
సంఘాన్నే మార్చెయ్యాలని
మార్చేసే ధీమా ఉందని
అన్యాయం అక్రమాలను
ఏమైనా ఎదిరించాలని___

2\. గతి తార్కిక భౌతికవాదం
అతివాస్తవ నాస్తిక వాదం
మతమంటే మరీ మంటా
గతమంతా తర్కమయం.
రాబోయే నవ్యతరంలో
కులతత్వం కనుమరుగౌనని
మానవతత్వం మెరుగౌతుందని
ఆశలతో ఆశయాలతో___
అనుభవ రహితం అసలు గతం

## నేడు

3\. ఆకాశం అందకపోగా
ఆవేశం అణిగేపోగా
కలలన్నీ కరిగేపోగా
ఎదురైనది చేదునిజం!

4\. ఏదీమన చేతలేదని
తెలియనివేవో నడిపిస్తాయని_

5\. పగిలిన రంగుల అద్దం
ప్రతిఫలించు వికృతరూపం.

6\. చూసింది చూసినట్లు
రాసేసే ధైర్యం లేదు
ఎన్నెన్నో ఆంక్షలు పరిధులు
ఉన్నాయి బరువు బాధ్యతలు

7\. విజ్ఞానం వేదాంతం
రెటికీ పొంతన లేదా?
ఈ.ఎస్.పి ఉందా లేదా?

8\. నిజమైన కలలకీ
కలలైన నిజాల కీ
ఉందా లేదా సంబంధం?

9\. సైంటిస్టులూ టెక్నోక్రాట్సూ
రూపొందించిన యంత్రయుగంలో
మనిషికి మనిషి మధ్యదూరం
అంతమైనదా ? అధికమైనదా

10\. పరమాణువులో అనంతవిశ్వం
విశ్వం నిండిన పరమాణువులు
విత్తన మందొక వటవృక్షమూ
చెట్టు చెట్టుకూ బీజములెన్నో

11\. మనుషుల సంఖ్యకు నియంత్రణం
హైబ్రిడ్ పండగ ఎన్నోరెట్లు
ఎందుకీ సంకుచితత్వం
ఏమిటీ మానవ తత్వం ?

12\. బదులురాని యీ ప్రశ్నలతో
సతమతమయ్యే సందిగ్ధంలో
గతితార్కిక భౌతిక వాదం
గతితప్పిన పదవిన్యాసం.

13\. నిర్లిప్తంగా నిర్వేదంగా
సహనంగా అసహాయతతో
మూల్గి నిగ్గనొక హృదయం
మూలపడ్డదొక ఘంటం!



సీరియల్




( గ త సం చి క త రు వా యి )

గోడ్డుకి మరీ దూరంకాదు, అడవిలోపలికి. కొంచెం దూరంలో సెలయేరు. చదునైనప్రదేశం చూసి- కోయవాళ్ళని పిలిచి కుటీరం నిర్మింపజేసుకున్నారు. కొండవాళ్ళ పద్ధతిలోనే కట్టబడిందాకుటీరం. దిగువన రెండు గదులు - పడకిగదిమాత్రం మంచెలాటి పై అంతస్తు. క్రూరమృగాలు రాత్రివేళ ఆ పరిసరాలకు వచ్చినా మంచె మీదకు రాలేవు. చుట్టూ చిన్న దడి. అడవిలో కనుక మూలికలను సేకరించడానికి అనువుగా ఉంటుందనీ, కోతులమీదా జంతువులమీదా కొన్ని ప్రయోగాలు చేయడానికి వీలుంటుందనీ ఆశించాడు పతంజలి. అతనా కుటీరంలో దిగిన రెండవ రోజునే - పంధొమ్మిది యిరవయ్యేళ్ళ అమ్మాయి ఒకామె ఆ కుటీరానికి వొచ్చింది. పండిన జామిపండు రంగు వొళ్ళు, కళ గల ముఖం, చాలా చలాకీగా ఉంద. కాని - వేషధారణమాత్రం సన్యాసినిలా ఉంది,

"ఎవరు నువ్వు?"

"ఎవరంటే ఏం చెప్పను? పథంకోసం అన్వేషిస్తున్న ఓ మనిషిని. దారితప్పి కొట్టుమిట్టాడుతున్న పాంథురాలిని".

"ఎందుకొచ్చావిక్కడికి?"

"చెప్పానుగా - దార వెతుక్కుంటూ...."

"దేనికి దారి?"

"ముక్తికి - మోక్షానికి"

"అది నీకిక్కడ లభిస్తుందని ఎవరు చెప్పారు? ఇక్కడ యీ కుటీరమూ మనుషులూ ఉన్నారని నీకెలాతెలుసు?"

ఆమె నవ్వింది- "అంతరాత్మ చెప్పింది".

"ఏమని?"

"ఇదే నా కనువయిన స్థానమని".

"ఏమీకాదు - వెళ్ళిపో"

"నన్ను దయతో రానివ్వండి. లేకపోతే- యిక్కడే ప్రాయోపవేశం చేస్తాను. ఈ కుటీరం ముందు ఒంటరిగా రాత్రి కూర్చుంటే ఏ మృగమో పుణ్యంకట్టుకోకపోదు. నా శరీరం ఒక జీవి ఆకలి తీర్చగలిగినా కొంత పుణ్యమే"

"ఇంత చిన్నవయసులో వైరాగ్యమేమిటి?"

మౌనం.. చిన్న నిట్టూర్పు.

పతంజలికీ ఆమెకూ మధ్య యీ సంభాషణ జరుగుతుంటే ద్రాక్షపళ్ళవంక నక్కలా చూస్తూ నిలుచున్నాడు యోగి. ఔను. ఆ అమ్మాయి - ద్రాక్షపండు కంటెకూడా అందంగా వుందిమరి. తానిక్కడ నుంచి కదిలేది లేదని ఆమె మొండిగా పట్టుబట్టడం-యోగి మహదానందకారణమైంది.

"నావలన మీకేమీ చికాకు కలగదు. చేతనైనంత సేవచేస్తాను. మీ ప్రవచనాలు విననియ్యండి. చాలు ఇంకేమీ అనలేకపోయాడు పతంజలి.

"నాపేరు సుషమ" అంటూ లోపలికి ప్రవేశించిందామె. "నాకెవరూలేరు .... ఏకాకిని.... అనాధను. ఇప్పుడు... ఇకనుంచి మీరేనాకు దిక్కు". అని పతంజలికి పాదాభివందనం చేసింది సాష్టాంగపడి. అది యోగికి చాలా అసూయకలిగించినా నోరుమూసుకుని ఉండటం తప్ప ఏమీచేయలేకపోయాడతను.

రెండు మూడు రోజులకే సుషమ ఆ వాతావరణానికి చక్కగా అమిరి పోయింది. ఆ కుటీరాన్ని సర్వవిధాలా యింపుగా తీర్చిదిద్దింది. పతంజలికి పూజాసామగ్రి అందించడం... వాగునుంచి నీరుతేవడం... అన్ని పనులూ తనమీద వేసుకొని అద్భుతంగా వంటచేసి పెట్టసాగింది.

ఆ సాయంత్రం.... సాయుధులయిన పదిమంది కుటీరంమీదకు దండెత్తారు. వారి చేతుల్లో తుపాకులున్నాయి. వారి ముఖాలలో క్రౌర్యముంది. కుటీరాన్ని కాల్చిపారేసి- ఆ ముగ్గురినీ చంపిపోతామని అరిచారు వాళ్లు. వాళ్ళని- సుషమే అనునయించవలసి వచ్చింది. యోగి వాళ్లని చూస్తూనే భయంతో వొణికిపోతున్నాడు. పతంజలికేమీ అర్థంకాక అమాయకంగానూ అయోమయంగానూచూస్తున్నాడు. అందుచేత సుషమే కలుగజేసుకుంది.

"మీరెవరు?"

"నక్సలైట్లం"

"మేము మీకేం అపకారం చేశాం?"

"మీరు ప్రభుత్వం తాలూకువాళ్లు.మిమ్మల్ని పట్టించటంకోసమూ మా స్థావరాల కార్యకలాపాల ఆచూకీ యివ్వడం కోసం- మీరిక్కడ మకాం వేశారు..."

"ఎంతమాత్రమూ అలా భావించకండి. ఆ మనుషులమధ్య బ్రతకలేకా.... ఆయుర్వేద మూలికావైద్యంమీద పరిశోధనలు చేయాలనీ- మేమిక్కడ కుటీరం వేసుకుని ప్రశాంతంగా జీవిస్తున్నాం ప్రభుత్వంతో మాకేవిధమయిన సంబంధమూలేదు. కుటీరంలోకి దయచేసి మేమిచ్చేపానీయం స్వీకరించి- మా సామానుచూడండి. మీకను మానాస్పదమయిన పరిస్థితులుంటే- మీయిష్టం వొచ్చినట్లు చేద్దురుగాని.

సుషమ మాటలు వారికినచ్చాయి. ఆమెచేసియిచ్చిన పానీయం తాగి కుటీరం అంతా పరిశోధన పేరిట గాలిస్తూ చెల్లాచెదరు చేసి- చివరకు సంతృప్తిగా వెళ్ళిపోయారు. యోగికి ప్రాణాలు కుదుటపడ్డాయి. పతంజలి సుషమకి చాలా కృతజ్ఞతలు తెలిపాడు.

"మంచివారే! మనలోమనకి కృతజ్ఞతలేమిటి? ఐనా-నాకు మీరు ఆశ్రయదాతలు. మీకేంచేసి నా ఋణం తీర్చుకోగలను?" అని నవ్వేసిందామె. ఏమయినా- ఆ సంఘటనతో సుషమ పతంజలి హృదయంలో చక్కని స్థానం సంపాదించేసుకుంది.

అతనితోపాటు అడవిలోకి వెళ్ళి మూలికలను సంగ్రహించడం వాటిని ఔషధములుగా తయారుచేయడం.... వీటిలో ఆమె చాలాచురుకుతనం చూపుతూంది ఆమె అమిత తెలివైనది. ఏవిషయమైనా ఒక్కసారి చెబితేచాలు. గ్రహిస్తుంది. దేన్నయినా ఒకసారి చూస్తేచాలు- మరచిపోదు.

"ఇవాళ మనం గరళం సంపాదించాలి" అన్నాడు పతంజలి. ఆ ఉదయం కుటీరం నుంచి బయల్దేరుతూ. అతని వెనుక సుషమా, యోగీ ఉన్నారు.

"గరళ మంటే పాము విషం కదూ?" అడిగిందామె. "ఔను మామూలు పాముకాదు.... సిసలైన నాగు పాముతాలూకు విషం..." వివరించాడు పతంజలి.

అడవిలోకి చాలా దూరం నడిచారు వారు. అక్కడ వృక్షాలు మరీ దట్టంగా ఉన్నాయి. ఆ వృక్షాల దిగువ పాము పుట్టలు వాటిలో ఒకదానిని చూపుతూ- "దానిలోనే ఉంటుంది రాజనాగు." అన్నాడు.

"అది బయటి కెప్పుడొస్తుంది? వొచ్చినా దాన్ని మనం చంపగలమా? అసలే నాగుపాముది చాలా వేగమంటారు..." వొణుకుతూ అడిగాడు యోగి.

"చంపడం వల్ల ప్రయోజన ముండదు. సజీవంగా పట్టుకుని గరళం పిండుకుని- దాన్ని వొదిలెయ్యడమే."

"గురూజీ మీకు మంత్రాలు వొచ్చునా?"

"రావు." నవ్వాడు యోగిని చూస్తూ.

అప్పటికే సుషమ చుట్టుపక్కల నుంచి బంకమట్టిని తెచ్చి ఆ పాముపుట్ట కన్నాన్ని కప్పింది. ఆ మట్టిలోంచి పుట్టలోకి సన్నని పొడుగాటి చీపురు పుల్లని తోసింది. ఇప్పుడా పుల్ల పుట్టలోకి ఉంది, పైకి ఉంది - నిలువుగా. దాన్నలా ఉంచి గుడ్డను ముక్కలుగా చింపి .... ఎండుటాకులు పోగుచేసి పొగపెట్టింది పుట్టల దగ్గర. ఆశ్చర్యంగా - పుట్ట కన్నం కప్పిన బంకమట్టి లోని చీపురుపుల్ల

మెల్లగా పైపైకి రాసాగింది. సుషమ కుడిచెయ్యి అర్ధచంద్రాకారంలో పుట్ట రంధ్రం చుట్టూ ఉంది.

భయంగానూ .... ఆశ్చర్యంగానూ .... అయోమయంగానూ చూస్తున్నాడు యోగి. పతంజలి ఒక చెట్టుయొక్క ఆకుని తెంచి సిద్ధంగా ఉన్నాడు. అతని కళ్ళనిండా సుషమ పట్ల మెచ్చుకోలే. చీపురుపుల్ల పైకి లేస్తూంటే -

ఎడమచేత్తో- చటుక్కున బంకమట్టిని పక్కకి తోసేసింది. మరుక్షణం- రంధ్రం లోంచి పాము తల పైకి వొచ్చింది. మరి కొంచెం పైకి రానిచ్చింది సుషమ ఊపిరి బిగపట్టుకొని. అంతే. చటుక్కున- వాటం చూసి పట్టు బిగించేసింది. ఇప్పుడు సుషమ చేతిలో పాము తల.... మెడ దిగువ కొంచెంమేర వరకూ. మిగిలిన పాము శరీరం- పుట్టలో. అందుచేత అది ఎటూ కదలలేక మిగిలి పోయింది.

యోగి వొణికి పోతున్నాడు.

ఆ తాచునాగు ఎంత అందంగా ఉందో అంత భయం గొల్పి తూనూ ఉంది.

పతంజలి - చిన్నపుల్లతో పాము నోటిని విడదీశాడు. కోరల నుంచి విషాన్ని- ఆకు మీదకు పిండసాగాడు.

బొట్లు బొట్లుగా విషం! ఘోర.... కాలకూట విషం.... దొన్నెలా చేసిన ఆకులోకి పడుతూంది. యోగి కళ్ళు మూసేసుకున్నాడు చూడ లేనట్లు. పాముని బిగించి పట్టుకున్న సుషమ అతనికా క్షణాలలో సాధారణ స్త్రీలా కాక అపర కాళిలా కనిపిస్తూ భయం కొల్పుతోంది! పాము నోటి నుంచి... కోరల నుంచి బొట్లు బొట్లుగా విషం!

దొన్నెను జాగ్రత్తగా పట్టుకుని - "ఇకచాలు...పాముని వొది లెయ్." అన్నాడు పతంజలి. సుషమ బహునేర్పుగా పాముని పుట్ట లోకి వొదిలేసింది.

"చిత్రం చూశావా! మనుషుల ప్రాణాలు తీసే విషమే మనిషికి ప్రాణమూ పొయ్యగలదు. సరిఅయిన పద్ధతిలో వినియో గించుకుంటే. సుషమ! నిజంగా నీ నేర్పుకి ధైర్యసాహసాలకి నా అభినందనలు." అన్నాడు పతంజలి. యోగికింకా నోటిమాట రావడం లేదు. నడుస్తున్నాడన్న మాటేకాని అతని కాళ్లింకా వొణుకుతూనే ఉన్నాయి భయంతో.

ఓషధులను పెకలించడంలో.... ప్రయోగాలకోసం కోతులు' చెవులపిల్లులు మొదలయిన జంతువులని పట్టడంలో - సుషమ పతంజలికి చాలా సహాయం చేస్తూ అతని కతిత్వరలోనే అతి సన్నిహితు రాలై పోయింది. యోగికి యిది చేదుగా ఉన్నా అతనేమీ చేయ పోయేవాడు.

సుషమ - చింతపల్లి వెళ్లి - ఔషధాలమ్మడంతో పా యింటికి సరిపడా సరుకులు కూడా తానే కొని - యోగిచేత మోం చుకు వొచ్చేది. కొండప్రాంతాలలో వారానికొకసారి సంత జరు తుంది. అవసరమైన ఏ వస్తువులయినా ఆ సంతలో వారానికొక్కన కొనుక్కోవాలంతే. కొండపంటలయిన అల్లం, పసుపు, చింతపం వగైరాలన్నీ ఆ సంతలోనే షాహుకార్లు చౌకగా కొని పట్నం పట్టు వెళ్ళిపోతారు.

చింతపల్లికి దగ్గరగా ఉన్న కొంచెం పెద్ద ఊరు - నరసీపట్న సుమారు ముప్ఫయ్ మైళ్లుంటుంది. సీలేరు ప్రాజెక్టు అభివృద్ధి చెం దంతో నరసీపట్నం ప్రాముఖ్యత ఎక్కువయింది. చింతపల్లికి కూ ప్రాముఖ్యత కొంచెం పెరిగింది. రోడ్లు మెరుగయ్యాయి. విశా పట్నం నుంచి నర్సీపట్నం, చింతపల్లి మీదుగా సీలేరు వెళ్తాం బస్సులు. అభివద్ధి చెందనిరోజులలో బస్సులు తక్కువ సాయంత్ర చింతపల్లి నుంచి బయలుదేరి నర్సీపట్నం వెళ్లే బస్సు - రోడ్ మీద పులి అడ్డంగా పడుకుందని గంటల కొద్దీ ఆలస్యంగా నర్సీపట్న చేరేది. ఇప్పటికీ చుట్టుపక్కల దట్టమయిన అడవులలో పులులున్నా నాగరికత సంతరించు కుంటున్న చింతపల్లికవి తరచుగా రావ అందుచేత బస్సుల కాటంకం కలగదు. సుషమ - పతంజలి తయా చేసే ఔషధాలను ఎక్కువగా నరసీపట్నంలోనే అమ్ముతుంది మం లాభాలకి. ఆ డబ్బుతో సరుకులు కొని తెస్తూంటుంది.

సుషమ వచ్చాక యోగికి పనేలేకపోతూంది. అతని ఆలో నలు మళ్ళీ నగరజీవితంవేపూ సంసారజీవితంవేపూ పరుగెడుతున్నాయి కాని—

అతను పతంజలిని విడిచిపోలేదు - అడవిలో కుటీరమూ .. ఎవరూ లేనిచోట జీవితమూ ఎంత విసుగుకొల్పుతున్నా, అందు మొదటి కారణం రాబర్ట్. పతంజలి తలపెట్టిన మృత్యువుని జయ చటం అన్న బృహత్తర కార్యక్రమం అటో యిటో తేలేవరక అతన్ని అంటిపెట్టుకుని ఉండి ఏమయినా విశేషాలుంటే ఎప్పటికప్పు తెలియపరచాలి. అలా చేస్తే - అంతా అయ్యాక యోగికి మ ఏదయినా ఉద్యోగం చూసి పెడతానన్నాడు. అది ఒకటి.

యోగికి సుషమని చూస్తున్నకొద్దీ మతిపోతోంది. ఆమె అం అతనికి ఆశలూ కొల్పుతోంది, పిచ్చి ఎక్కిస్తూంది. ఏనాటికయి ఆమె మనసు మారి తనపట్ల ఆకర్షితురాలై తన ననుగ్రహించదా అ ఓపిగ్గా చూస్తున్నాడతను.

రోజులు గడుస్తున్నాయి.

సుషమ - పతంజలికి మరీ మరీ దగ్గరైపోతూంది. ఇప్పుడామె లేనిదే అతనికేపనీజరుగదు. కాని అతనామెను స్త్రీ అనే దృష్టితోనే చూడడు.

## 10

మానవుడు మృత్యువుని జయించబోతున్నాడన్న సంచలన మయిన వార్త ప్రపంచమంతటా - వెన్నెలలా పరుచుకోలేదు. కార్చిచ్చులా వ్యాపించింది. ఔను కార్చిచ్చులాగే వ్యాపించింది. మృత్యువుని జయించడం అనేదాన్ని అందరూ సరిగానే అర్థం చేసుకున్నారుకూడా. ఆయుః ప్రమాణం నూటయాభైకో రెండు వందల సంవత్సరాలకో పెరగడం.

నిజానికి - మనిషి అనేవాడు యిటువంటి విజయానికి చాలా సంతోషించాలి. గర్వపడాలి. మానవజాతి చరిత్రలోనే యిది మహత్తరమయిన మలుపు. బృహత్తరమయిన ఘట్టం. కాని ... వాస్తవానికలాజరగడంలేదు. యావత్ప్రపంచమూ రెండు ముక్కలుగా చీలిపోయింది .... ఊహాతీతమయిన చీలికలు.

సింహాసనంమీద ... అధికారంమీద ఉన్నవారు మృత్యువు మీద విజయం కోరుకుంటున్నారు. మానవుడు చిరంజీవి కావాలని అభిలషిస్తున్నారు. అధికారంలో లేనివారు ... బల్లకవతలవేపున్నవారు .... సహజంగానే - సింహాసనాలు ఖాళీ అవడంకోసం మనిషికి - మృత్యువుని కోరుకుంటున్నారు.

అసలే ప్రపంచ జనాభా అదుపూ ఆజ్ఞాలేకుండా పెరిగిపోతుంది. దీనికి తోడు అగ్నికి ఆజ్యం పోసినట్లు మృతుల సంఖ్యకూడా పడిపోతే యిక చెప్పవలసిందేముంది? జనన రేటుని ఎంత ప్రయత్నించినా తగ్గించడం సాధ్యంకాకి పోతూంది. ప్రజలకు కుటుంబ నియంత్రణం ఆవశ్యకత అర్థంకావడంలేదు. ఎంతో భయంకరమయిన యీసమస్యను కొంచెమయినా అర్థం చేసుకోవటంలేదు. ముఖ్యంగా అభివృద్ధి చెంద వలసిన- థర్డ్ వరల్డ్ నేషన్స్‌లో జనాభా సమస్యమరీ అధికంగా ఉంది. జనాభానదుపులో ఉంచక పోవడంవల్ల ఆదేశ పురోభివృద్ధి ఎంతకుంటు పడుతూందో... ఆర్థికంగా రాజకీయంగా ఎంతవెనుక పడుతున్నారో వారు గ్రహించడంలేదు. గ్రహించినా తగు జాగ్రత్తలు తీసుకోలేక పోతున్నారు. మనిషికి బ్రతికేఅవకాశం చేజేతులా నిరోధించబూనడం అమానుషమేకాని- ఆర్థికపరిస్థితుల దృష్ట్యా తప్పనిసరి ఔతుందది. జనాభాని అదుపులో ఉంచడం కంటె గత్యంతరం లేదాదేశాలకి.

రాజకీయ... ఆర్థికవేత్తలిలా ఆలోచిస్తూంటే, ప్రపంచంలోని వివిధ దేశాలలోనూ మందులని తయారుచేసే కంపెనీల అధినేతలు మరొకందుకు తల్లడిల్లి పోతున్నారు. మృత్యువునే జయించగలిగిన మనిషి వ్యాధిని మాత్రం జయించలేడా? అదే జరిగితే- కోట్లకొలది పెట్టుబడులున్న మందులపరిశ్రమ లేంకావాలి? వాటిమీద ఆధారపడి బ్రతుకుతున్న పనివారందరూ ఏంకావాలి? వాళ్ళందరూ నిరుద్యోగులు కావలసిందేనా? అయ్యో! ఇది ఎటువంటి భీకర సంక్షోభం? దీనికి నివారణోపాయమేమిటి? పోనీ- మృత్యువుని జయించే మందు ఖరీదైనదా అంటే అదీకాదు. ప్రతివాడికీ అందుబాటులో ఉండేంత చవకట ప్రపంచంలోని ప్రతి మనిషికీ సరఫరా చెయ్యబడగలదట. తయారీ సులభంగానూ, సత్వరంగానూ జరగగలదట. ఈ ముప్పునెలా ఎదుర్కోవడం?

దీర్ఘకాలం జీవించే మనుషులకి తిండెలా? నిరుద్యోగ సమస్య అభివృద్ధి చెందిన దేశాలకేతప్పడంలేదే! పదవీ విరమణ వయస్సు పెంచడానికేవిధమయిన అవకాశమూ కన్పడదే. ఆహారంలేక ఆయుర్దాయం ఉండిమాత్రం ఉపయోగమేమిటి? తిండికి కటకటలాడిపోయే ప్రజలెటువంటి గందరగోళం కలగజేస్తారో ప్రపంచానికి? ఆలోచనారాహిత్యం కాకపోతే - మొరటుమనిషి ఆకలిని జయించేమందుకనిపెట్టి తరువాత మృత్యువుని జయించే మార్గం కనిపెట్టాలి కాని - ప్రస్తుత పరిస్థితుల్లో ఆటునుంచిటు చేస్తారా ఎవరయినా? మూర్ఖత్వమూ.... తొందరపాటూ.

వృద్ధులు సంబరపడుతున్నారు – యింకా చాలాకాలం బ్రతక వచ్చుననీ, యిప్పుడప్పుడే చచ్చిపోనక్కరలేదనీ, ఆ వృద్ధులలో అనేకులు యిలా ఆశపడుతున్నది నిజానికి జీవితంమీద ఆశతోనూ ఉత్సాహంతోనూ కానేకాదు చావంటే భయంకొద్దీ మాత్రమే. ఈ వృద్ధుల సంబరం చూసి యువకులు విసుక్కుంటున్నారు మనసులో. ఇప్పటికే మనుష లెక్కువై కొంప యిరుకై పోతూంది. పుట్టుకొచ్చే కొత్త జీవులకోసం ముసలివాళ్ళు మర్యాదగా చోటివ్వాలికాని – పట్టుకు వేళ్లాడితే ఎలా ? కొంచెం లోకజ్ఞానం ఉండొద్దూ వయసు మీరాక యినా ? ఈ ముసలి గుదిబండలనెన్నాళ్లు భరించాలి ? వీళ్ళు బ్రతికి కాముకునేదేముంది ?

ఇలాగ – ప్రపంచం విచిత్రంగా చీలిపోడం ప్రారంభించింది. మనిషికీ మనిషికీ మధ్య తెరలు దిగడం మొదలయ్యాయి. దేశాలు ఒక్కొక్కటీ రెండేసి ముక్కలౌతున్నాయి, మనిషి మృత్యువుని యిస్తాడనే నమ్ముతున్నారందరూ.

ఐతే—

సమర్థత కలవారూ, స్తోమత కలవారూ చేతులు ముడుచుకుని కూర్చో దలచుకోలేదు. తమకు చేతనయిన ప్రయత్నం తాము చేయ దలచుకున్నారు. రంగంలోకి దూకదలచుకుని ప్రణాళికలు వేయడం ప్రారంభించారు. మృత్యువుమీద విజయం కాంక్షించే పక్షానికిలాగే వీళ్ళకీ – వారంత కాకపోయినా కొంత మేరకయినా అర్థబలమూ, అంగబలమూ ఉంది దానిని వినియోగించుకుందుకే సంకల్పించు కున్నారు.

ప్రపంచదృష్టి - భారత దేశం మీద కేంద్రీకరించబడుతూంది మెల్లగా. భారతదేశస్థుడు తలపెట్టినది పిచ్చిపని అనీ. ప్రస్తుతకాలాని కది ఎంతమాత్రమూ ఉపకారి కాదనీ.... పైగా అలాగ మృత్యువుని జయించి మానవుడి ఆయుఃప్రమాణాన్ని పెంచబోవడం నేటి ఆర్థిక రాజకీయ సామాజిక పరిస్థితులలో చాలా గందరగోళం రేపుతుందనీ- భారత ప్రభుత్వానికొకవంక హెచ్చరికలు వొస్తూంటే,

రెండో వేపు నుంచి –

మృత్యువును జయించడమనేదే అత్యద్భుతమైన ఆలోచన. దాన్ని సాధించడం మహాద్భుతం. వైద్యశాస్త్రానికది పరాకాష్ట. తప్పకుండా ఆ భారతీయుడు మహానుభావుడు. అతనికి కావలసిన సహాయ సహకారా లందించండి- అంటూ సలహాలు వొస్తున్నాయి.

సలహాలూ, సూచనలూ యివ్వడంతో ఊరుకోలేదు పెద్దదేశాలు.

తమ గూఢచార శాఖతో సంప్రదింపులు జరిపాయి. భారత దేశం వెళ్ళమన్నాయి – అత్యంత సమర్థులని. వారు భారతదేశం రావడంలో చాలా ముఖ్యమయిన ప్రయోజనం – స్వార్థంతో కూడినది ఒకటుంది. భారతీయుడు నిజంగా మృత్యువుని జయించ గలిగితే – ఆ ఫార్ములాని స్వంతం చేసుకోవడం. ఊరికే ఫార్ములాను తెలుసుకోవడం కాదు. ఇతర దేశాలకు తెలియకుండా తాము మాత్రమే ఆ ఫార్ములాని స్వంతం చేసుకోవాలి. దానిని తమ గుప్పెటలో పెట్టుకొని ప్రపంచం మీద ఆధిపత్యం వహించాలి. ఇతర దేశాలను ఆట ఆడించాలి. ఈ అద్భుతమయిన.... అతి శక్తివంతమయిన ఆయుధంతో సర్వ మానవ ప్రపంచాన్ని జయించాలి. తాము.... తమ పార్టీ.... తమ దేశం.... తిరుగులేనివిగా చెలామణీ కావాలి.

ఈ పరిస్థితిని గ్రహిస్తూనే గజగజ వొణికిపోయింది సుషమ. పతంజలి ఎటువంటి సాలెగూటిలో చిక్కుకున్నాడు! అతని కిదేమీ తెలియదు. తనేమిటో తన లోకమేమిటో... అంతే. మృత్యువుని జయించాలన్న కాంక్షతోనే అతను జీవించి ఉన్నాడేమో అనిపిస్తుందతని జీవితవైఖరి గమనిస్తూంటే. పసితనపు అమాయకత్వం....పట్టుదల... తనచుట్టూ ఏం జరుగుతూందో తెలుసుకోలేని అజ్ఞానం.... అతని కేమీ పట్టవు- ఆ మందులూ, ప్రయోగాలూ, మందుల పుస్తకాలూ తప్ప ఇప్పుడు తను ఎటువంటి చక్రబంధంలో యిరుక్కున్నాడో అతనే తెలియదు.

ప్రపంచం దృష్టి అంతా యిప్పుడు పతంజలి మీదకు తిరుగు తూంది. అతని ప్రయత్నం సఫలం కావాలని ఎందరు కోరుతున్నారో విఫలం కావాలనీ అందరు కోరుతున్నారు; అంతే. పతంజలికి మిత్రు లెందరో శత్రువులూ అందరు తయారయ్యారన్న మాట. ఈ రెండు పక్షాల మధ్యా యిరుక్కున్నాడు పతంజలి. నేడో రేపో పతంజ స్థావరం చుట్టూ మాటు వేస్తారేమో విదేశీ గూఢచారులు? మాన జాతికి మహోపకారం తలపెట్టిన పతంజలి ప్రాణానికే ముప్పు రాబోవడంలేదు కద? ఆలోచనలో పడింది సుషమ.

( ఇంకా ఉంది

శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

# 'రామగిరి' ఏ ప్రాంతంలోనిది?

## (కాళిదాస వర్ణిత రామగిరి)

యక్షుడు కుబేరశాపముచేత సంవత్సరకాలం 'రామగిరి' ఆశ్రమములందు నివసిస్తాడు. ఆ 'రామగిరి' మన హిందూదేశంలో ఏ ప్రాంతమందున్నదో, కాళిదాస కవీంద్రుని మేఘసందేశ కావ్యగత వర్ణనల ద్వారా నిరూపించడమే ఈ రచనలోని ఉద్దేశ్యం.

మేఘుడు పయనించిన మార్గం:—

మేఘుడు 'రామగిరి' నుండి బయలుదేరి క్రమంగా "ఆమ్రకూట పర్వతములను, విదిశాపట్టణమును, వింధ్యపర్వత పంక్తిలోనుండి విడిపోయిన రేవానదినిదాటి, ఉజ్జయినిమీదుగా అలకాపట్టణము చేరినాడు.

'అమరకంటకమే' ఆమ్రకూటం అని కొందరు భావిస్తున్నారు. వీరనుకొన్న 'అమరకంటకం', 'రామగఢ్'కి పడమటగాఉంది, కాళిదాస, వర్ణితమైన ఆమ్రకూటం 'రామగఢ్'కి క్రిందుగా ఉంది. కనుక రామగఢ్ రామగిరికాదు.

ఉత్కళప్రదేశ్‌లో ఉన్న నేటి కోరాపుట్ జిల్లాలోని 'రామగిరి' అనేగ్రామానికి సమీపంలో పెద్దపర్వతపంక్తి కలదు. ఈ పర్వత శ్రేణికే 'రామగిరి' అనే ప్రసిద్ధి కలదు. ఈ పర్వత శిఖరాలు సముద్ర మట్టానికి 3000 అడుగులఎత్తులో ఉంటాయి. ఈ శిఖరాల మధ్య భాగాలలో వర్షాకాలంలో ఇప్పటికీ మేఘాలు సంచరిస్తూండడం మనం దర్శించవచ్చు. ఈ పర్వతములో చాలగుహలుకూడ ఉంటాయి. "గుప్తేశ్వర" అనే ఒకగుహలో- 'గుప్తేశ్వర' లింగముకలదు. ఈ లింగమును శ్రీరామచంద్రుడు స్వయంగాప్రతిష్ఠచేసినాడు. కనుక ప్రతీసంవత్సరం శివరాత్రి పర్వదినమునాడు వేలాది జనులు వేంచేసి, ఆ గుప్తేశ్వరుని దర్శిస్తూంటారు. ఆ గుహలోపలగల ఒకశిలాఫలకంపై అంకితమై ఉన్న శ్రీరామచంద్రుని పాదపద్మయుగళిని భక్తులు ప్రతిరోజు పూజిస్తుంటారు. సరిగా ఇదేదృశ్యాన్ని కాళిదాసకవీంద్రుడు తన సందేశకావ్యంలో—

"అపృచ్ఛస్వప్రియ సఖమముంతుంగ మాలింగ్య శైలం
వంద్యైః పుంసాం రఘుపతి పదై రంకితం మేఖలాసు॥
(మేఘసందేశం12శ్లో॥

అని ప్రత్యక్షప్రమాణభాసురంగా వర్ణించినాడు. ఇచ్చటి 'శైల' శబ్దానికి 'చిత్రకూటపర్వత'మని అర్థం. ఇది మధ్యప్రదేశ్‌లోఉంది, వర్షాకాలంలో ఈ పర్వతం పైభాగంనుంచి పడుతూన్న వాటర్‌ఫాల్స్ (జలపాతాలు), అద్భుతంగా గానవస్తూంటాయి.

ఇంకా ఇప్పటికీ ఈ పర్వత మధ్యభాగంలోని చరియలలో, వేలాదిపుట్టలు, ఇట్లే ఇచ్చట వర్షర్తువునందు ఉదయాస్తమయ సమయాలలో ఆకాశంపై ఇంద్రధనస్సులు కనులవిందుచేస్తూ కనిపిస్తూంటాయి.

దర్శనీయ దృశ్యాలను దర్శించియేకాబోలు కాళిదాసకవి—

"రత్నచ్ఛాయావ్యతికర ఇవప్రేక్ష్యమేతత్పురస్తా
ద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుష్ఖండమాఖండలస్య"॥
(మేఘసం॥ 15శ్లో)

పద్మరాగమణి మొదలైన వేర్వేరు మణుల విభిన్నకాంతుల కలబోతవలె చూడముచ్చటగొల్పుచున్న ఇంద్రధనస్సు, ఇచ్చటి పుట్టల అగ్రభాగాలనుంచి ఆవిర్భవిస్తుంది." ... అని కవికులగురువు వర్ణించిన వర్ణన సరిగా ఇక్కడ కనిపిస్తుంది. ఇంకా ఇక్కడ నిచుల వృక్షాలు, పుణ్యగొడుగులు వినోదంగా కనిపిస్తాయి. (చూ. శ్లో 11) ఈ "రామగిరి" దిగ్గజములవంటి పెద్ద ఏనుగులకు నివాసభూమి. (చూ 14 శ్లో) మేఘుడు రామగిరినుండి బైలుదేరి "తుంగమాలం" అనే క్షేత్రం మీదుగా "ఆమ్రకూటం" చేరినట్లు వర్ణించినాడు. (చూ. 16 + 17 శ్లో)

రామగిరి నుండి అమర్‌కోట్ వరకూ 1500 అడుగుల ఎత్తుగల భూభాగం "జయపురమాల" అనే పేరిట ప్రసిద్ధమైంది. ఆ "మాల" - సందేశకావ్యంలో కాళిదాస కవిచే —"— సద్యస్సీరోత్కషణసురభి - క్షేత్రమారుహ్యమాలం - " అని వర్ణించబడింది. దీనికి తరువాత 2000 అడుగుల ఎత్తుగలదై - అమర్‌కోట గ్రామా

నికి సమీపంలో ఉన్న అమర్‌కోట పర్వతమే, కాళిదాసు వర్ణించిన "ఆమ్రకూట పర్వతము అనుటలో సందేహంలేదు. ఈ పర్వతమంతా వ్యాపించి ఉన్న ఆమ్ర(తియ్యమామిడి) వృక్షాలు ఈ పర్వత నామాన్ని సార్థకం చేస్తున్నాయి.

ఈ మూలక్షేత్రంలో ఇప్పటికీ చాలామంది ఆదిమవాసులు నివశిస్తున్నారు. వీరు గ్రీష్మకాలంలో ఆ పర్వతమందలి వనాన్ని తగులబెట్టి వర్షాకాలంలో ఆ భూమిని దున్ని ధాన్యం విత్తుతారు. సామాన్యంగా తగులబడిన భూమిపై మొట్టమొదట వర్షం పడగానే ఆవిరి రూపంలో పరిమళం పైకివస్తుంది. ప్రస్తుతంలో ఈ దగ్ధా ఉ రణ్యం మీదుగా మేఘుడు వర్షిస్తూ పయనిస్తాడు. ఈ సన్నివేశాన్నే మన కవికులగురువు "...... దగ్ధారణ్యేష్వధిక సురభింగంధ మాఘ్రాయ చోర్వ్యాః ... 21 శ్లో) అని వర్ణించినాడు.

ఇక అక్కడ ఉన్న ఆదిమవాసుల సహజ సరళప్రకృతిని కూడా కవి స్పష్టంచేస్తూ వారు తమ పంట మేఘునిపై ఆధారపడి ఉన్నదని మేఘుని వారు కొలుస్తున్నట్లు– "త్వయ్యాయత్తంకృషి ఫలమితి భ్రూవికారానభిజ్ఞైః ప్రీతిస్నిగ్ధైర్జనపదవధూలోచనైః పీయమానః" (16 శ్లో) అని వారి కృషి విధానాన్ని దిశదంచేసినాడు. ఇంకా, సీతాదేవి స్నానంచేయుటచే పవిత్రజలములుకల రామగిరి ఆశ్రమములందు యక్షుడు నివసించెను. "......యక్షశ్చక్రే జనకతనయా స్నానపుణ్యోదకేషు। స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు॥ (శ్లో 1) కాళిదాస కవి వర్ణన ఇచ్చటి గిరికే సరిపడి ఉంది. దీనికి నిదర్శనంగా ఇట "సీతాకుండం" అనేది ఉంది. ప్రతీ వత్సరం మాఘ మాసంలో ఇక్కడ జరిగే "మేలా"కు లక్షలాది జనులు రావడం, పిల్లలు లేని స్త్రీలు ఈ కుండంలో స్నానంచేసి పుత్రవతులుకావడం ప్రసిద్ధిగాఉంది. రామగిరికి చుట్టూ ఉన్న స్థలాలలో శ్రీరాముడు సంచరించినట్లు తెలిపే నిదర్శనాలున్నాయి. ఇచ్చటి ప్రదేశాలన్నీ శ్రీరామచంద్రుని పాదస్పర్శచే పవిత్రీకృతాలనే విశ్వాసం ఇచ్చటివారిలో ఇప్పటికీ ఉంది.

ఆమ్రకూటం పిమ్మట 'రేవా' నది (19 శ్లో). దీని పిమ్మట దశార్ణ దేశాలు[1] వర్ణితాలు. ఇవి, "పరిణత ఫలశ్యామ జంబూ వనాంతాల"నీ – కతిపయదిన స్థాయి హంసలు కలవనీ కాళిదాసు వర్ణన. (చూ. 24 శ్లో) ఈ దశార్ణ దేశాలకు విదిశా పట్టణం రాజధాని (శ్లో. 25) ఇక్కడిదే, వేత్రవతీ నది. విదిశాపట్టణం ఆమ్రకూట తరవాతనే ఉంది, దీనిపిమ్మట గల "రేవా" నది వింధ్య పర్వతాల చరియల నుండి విడువడింది. ఈ దృశ్యాన్నే కవి, "...రేవాంద్ర క్ష్యస్యుపల విషమే వింధ్యపాదే విశీర్ణాం ...." (19 శ్లో) అని వర్ణించినాడు. ఇచ్చటకు పరమటగా "ఉజ్జయినీ" నగర ముంది. కాని మేఘుడు ఉత్తర దిశగా పయనించ వలసి ఉంది. కనుకనే భూగోళశాస్త్ర విజ్ఞాన విరాజితుడైన కాళిదాస కవి – "వక్రః పంథాయదపి భవతః ప్రస్థిత స్యోత్తరాశాం సౌధోత్సంగ ప్రణయ విముఖోమాస్మ భూరుజ్జయిన్యాః|...." (28) అని వర్ణించి తన భౌగోళిక విజ్ఞాన వైభవాన్ని ఇట్టి పట్టుల్లో విరాజిల్ల జేసినాడు. ఏతత్కవి వర్ణితమైన ఈ నదీ పర్వతాలు ఇండియా మేప్‌లో (కొలది మార్పుతో) వరసగా గానవస్తాయి. 69 సం॥లో ఉజ్జయినీ నగర మందున్న "కాళిదాస సమారోహ్" లో పాల్గొన్నప్పుడు వారు నాకిచ్చిన "భారతసుషమా" అను గ్రంథంలోని మేప్‌లో "మేఘుడు పయనించిన మార్గం" ప్రత్యేకంగా గుర్తింపబడి ఉంది. మీద విషయాలన్నీ దానికి సరిపడి ఉన్నాయి.

ఈ రీతిగా కాళిదాస కవి "రామగిరి" ని పరిచయం చేయుటకు తన మేఘసందేశ కావ్యంలో వర్ణించిన నిదర్శనాలన్నీ ఇప్పటికీ ఉత్కళరాష్ట్రంలో ఉన్న "రామగిరి" యందు గానవస్తున్నాయి గాన మన కవి వర్ణించిన 'రామగిరి' ఇదే.

[1] "దశార్ణో దేశః, నదీచ దశార్ణా" (సిద్ధాంత కౌముది)

( గ త సం చి క త రు వా యి )

"నిన్ను నేను అడగలేదు. అడిగినవారే జవాబియ్యాలి" అన్నాడు శేఖర్.

"ఇంతకీ, ఈ ప్రశ్నలన్నీ ఇప్పుడెందుకు? జానకమ్మ అడిగింది.

"మరో వదిన వస్తుందని అందరం అనుకుంటుంటే ... సడన్‌గా" అన్నాడు శేఖర్.

జానకమ్మ పకోడీలు ప్లేట్లలో పెట్టి అందరికి ఇచ్చింది. శేఖర్ మంచినీళ్ళు గ్లాసులలో తెచ్చి అందరికి అందించాడు. సరస్వతికి కొద్ది దూరంలో తన ప్లేటు లాక్కొని జానకమ్మ కూర్చుంది.

"కొన్ని కొన్ని పనులు మనం అనుకున్నట్లు జరగవు. శని వారం నాడు డిప్యూటీ కలెక్టరుగారు టాక్సీ పంపితే, సాయంకాలం అందరం వెళ్ళి వాళ్ల పెద్దమ్మాయిని చూశాము. నచ్చుకున్నాము. కట్నాలు, కానుకల విషయంలో కూడా ఒక అభిప్రాయానికి వచ్చాము. జాతకాలు ముందునే చూపించి, సరిపడినట్లు తెలియడంచేత మరేమీ ఇబ్బందులు లేవని, తొందరలోనే ముహూర్తం పెట్టించమన్నాము- బుధవారం నుండి పెండ్లి పనులు మొదలుపెట్టాలని ఆడపెళ్ళివారు అనుకున్నారు. కాని ఆదివారం రాత్రి ఈ ఆలోచనలన్నీ తారుమారు అయాయి." అంది జానకమ్మ.

"వదినకీ విషయాలన్నీ తెలుసు. ఆమెకు తెలియని సంగతులు చెప్పు" అన్నాడు శేఖర్.

"అవును. ఆదివారంనాడు నువ్వు పిలిపించావని మూర్తి సాయంకాలం అయిదు గంటలకు వెళ్ళినవాడు రాత్రి తొమ్మిది గంటలకు తిరిగి వచ్చాడు. వస్తూనే స్కూటరు వరండాలో పెట్టి, మేడమెట్లు ఎక్కుతూ, దగ్గిరలోనే పనిచేస్తున్న నాతో అన్నాడు. 'అమ్మా! డిప్యూటీ కలెక్టరుగారి అమ్మాయి నాకు నచ్చలేదు. మన సరస్వతిని నేను పెళ్ళి చేసుకుంటాను. ఈ సంగతి వారికి చెప్పండి! ఈ మాటలు వినగానే నాకు ముచ్చెమటలు పోశాయి ఏంచేయాలో, ఏం మానాలో తెలిసింది కాదు. డిప్యూటీ కలెక్టరుగారు మరునాడే వంట బ్రాహ్మణ్ణికీ, బాండు మేళానికి, కళ్యాణ మండపానికి డబ్బుకట్టి రిజర్వేషనుకి, చేయిస్తానన్నారు. చేతిలోనున్న పని వదిలివేసి, న్యూసు వింటున్న మీ మామగారికీ విషయం చెప్పాను. ఆయనకు నాకన్న హెచ్చుగా మతిపోయింది. అతని మీది అధికారి నాగభూషణంగారు, ప్రతిరోజు ఒకరొకరి ముఖాలు చూచుకోవాలి. మీ మామగారు తల బాదుకున్నారు. ఇంత అవమానం ఎప్పుడూ జరగలేదన్నారు."

"వదినా! అప్పుడు మాఅన్నయ్య ఏపోజుతో మేడదిగివచ్చాడో తెలుసా?" అన్నాడు శేఖర్.

"నువ్వు మధ్య మధ్యని అడ్డురాకు. అమ్మను చెప్పనీ!" అంది కాత్యాయని.

సరస్వతి చేష్టలుదక్కి అత్తగారి ముఖంలోకి చూచింది.

"మూర్తి మెల్లిమెల్లిగా ఒకటీ ఒకటీ మెట్లు దిగివచ్చాడు. హాలు లోంచి తిన్నగా వాళ్ళనాన్న పడకగది సమీపించాడు. నేను, మీమామ గారు పిల్లలు అందరము ఆగదిలో చాపమీద కూర్చున్నాము. ఏదో ఆపదవస్తే ఒకరికొకరం దగ్గరపడినట్లు కూర్చున్నాము. మూర్తి గది గుమ్మందగ్గిర నిలబడ్డాడు.

"నేను పెళ్ళిచూపులకు మీతో కలిసి వచ్చినమాట వాస్తవమే. కాని మీరందరూ పదేపదే బలవంతం చేస్తేనే వచ్చాను. పిల్లనుచూచి నంతమాత్రాన పెళ్ళిచేసుకోనక్కరలేదని అప్పుడు కూడా మీరు నా మనసులో ఏముందో అడగలేదు. నలుగురితోబాటు నన్నూకూర్చో మన్నారు. కూర్చున్నాను. నావంతు మాటలన్నీ మీరే అడిగారు. నా హాబీగురించి పెళ్ళి కూతురడిగింది. నా చదువు సంధ్యల గురించి డిప్యూటీ కలెక్టరుగారడిగారు. కాని నేను ఒక్కప్రశ్నకూడా ఎవ్వరినీ వేయలేదు. ఈ యింటికి ఆ అమ్మాయి తగినకోడలనే మీరు నిర్ణయిం చారు. ఇది మాత్రం ఏకపక్షనిర్ణయం".

"అప్పుడు మీ మామగారికి చాలా కోపం వచ్చింది.

"దౌర్భాగ్యుడా ! నాకు నలుగురిలోను తలెత్తుకుని తిరిగే హక్కు లేకుండా చేశావు. పెళ్లిచూపులంటే నీ అభిప్రాయమేమిటి? మీ అమ్మనుచూసి వచ్చి పెద్దవాళ్లు తాళికట్టమంటే మారు మాటాడ కుండా తాళి కట్టాను. మా సంసార మేమయినా పాడయిందా ?

పెళ్ళికూతురికి కావలసినది రూపమేనా ? ఈ అమ్మాయి అందం ఏం తక్కువయింది ? సాంప్రదాయం, గౌరవం, ముద్దూ ముచ్చట జరిపే సమర్థత, ఇవేమీ అక్కరలేదా? మేము తీసుకున్న నిర్ణయం తప్పనే నీ అభిప్రాయమా" అన్నారాయన

"మూర్తి సాధారణంగా మాట్లాడడు. నామాటకు మీమామగారి మాటకు జవాబు చెప్పడు. అటువంటివాడు ఈవిధంగా ఎదురు తిరగ గానే నాకూ కోపంవచ్చింది.

"మూర్ఖుడా ! మీనాన్నగారి పెద్దరికమేమెంచావు ? నేను స్వయంగా వెళ్ళి ఈ యింటికి కావలసిన కోడలిని ఎన్నుకొన్ని, నిశ్చయంచేస్తే నామాట ఏంనిలబెట్టావు? ఇంటికి పెద్దకోడలిని తెచ్చు కోటానికి నాకామాత్రమయినా అధికారం లేదా?" అన్నాను నేను.

"నేను మీమామగారిని సమర్థించాను. ఇది న్యాయం.

"పిల్లలు ముఖముఖాలు చూచుకున్నారు. నాకు కోపం ఏమాత్రం తగ్గలేదు.

"నా వదిన బ్రతికిఉన్న దినాలలో ఒక రోజుకూడా తన కూతురిని ఈ జానకమ్మకొడుక్కి ఇస్తానని అనలేదు. ఎప్పుడూ పిల్లను చదివించాలని, పెద్దడాక్టరుని చేయాలని కలలుగని చనిపోయింది. మా తమ్ముడు ముద్ద పెట్టే దిక్కులేక, భార్య పోయిన మూడు నెలలేనా తిరగకుండా మరో మాటకారిని పెళ్లి చేసుకున్నాడు. ఇటువంటి మహానుభావులకు నువ్వు అల్లుడివయితే ఒకపూట భోజనం కూడా వాళ్ళు పెట్టరు. కట్నాలు కానుకలు లేనేలేవు. పండగలకి, పబ్బాలకి కూడా వాళ్ళు పిలిచి తిండి పెట్టరు. ఇటువంటి దరిద్రుల సంబంధానికా మురిసిపోయావు నువ్వు' అన్నాను కోపమంతా వెడల్లగక్కుతూ.

కాని మావాడు ఏమీ చలించలేదు.

"ఈ పెళ్ళి ఎవరికి చేయాలనుకుంటున్నారు? .... నాకా? ఇంకా మరెవరికేనా?" మావాడు ప్రశ్న వేశాడు.

మే మెవరము జవాబు చెప్పలేదు.

"ఈ పెళ్ళి నాకే అయితే, పెళ్ళికూతురుని ఎంచుకునే అధికారం నాకుంది. మొదటి నుంచీ నేను ఒకే అభిప్రాయంతో ఉన్నాను. పైస కూడా కట్నం లేకుండా పెళ్లి చేసుకొని ఒక సామాన్యుడి భుజాలమీది బరువును తగ్గించాలని నిశ్చయించు కున్నాను. ఆనందరావు ఆస్తి కలవాడు కాదు. సరస్వతి ఎవరో పైవారి కుటుంబం నుంచి వచ్చినది కాదు. రూపం గురించి, గుణగణాల గురించి ఏమీ సందేహించ నక్కరలేదు. ఏవో కట్నాలు కానుకలు గుమ్మరించి, భర్తను అత్త మామలను కొనివేసే కోడలు, ఈ యింట్లో మీకు అనుకూలంగా మెలుగుతుందని హామీ ఏమిటి? నా మొగుడని, నా డబ్బని, నా యిల్లని, నా నాన్న యిచ్చిన కట్నమని, నిరంతరం మీ చెవులలో పోరుతుంది. ఇంతవరకు ఒకే కుటుంబంగా ఉన్నదానిని రెండు చేస్తుంది. కట్నం బాగా యిస్తారని, పెళ్ళి ఘనంగా చేస్తారని మురిసిపోతున్నారు, తరువాత వచ్చే ఇబ్బందుల గురించి ఏమైనా ఆలోచించారా?"

"నేనేమీ జవాబియ్యలేక పోయాను. మీ మామగారు కూడా పలుకు లేకుండా కొడుకు మాటలు విని నిశ్చేష్టులయిపోయారు.

"ఇంతటితో సరిపోలేదు. మామ సవితి పెళ్లాం ఒక్క పైస కూడా యివ్వనన్నది. కట్నం లేదు, కానుక లేదు- ఆఖరికి పెళ్లి ఖరపడానికి కూడా ఆమె యేమీ ఇవ్వనన్నది. అందుచేత పెళ్లికి రెండువేపులా ఖర్చు మనమే పెట్టుకోవాలి. నేను నాలుగు సంవత్సరాలయి ఉద్యోగం చేస్తున్నాను. జీతంలో రెండు వందల చొప్పున ప్రతి నెల వెనుక వేశాను. ఇప్పుడు పదివేల వరకు జమ అయింది. ఆ డబ్బు తీసి మీకు యిస్తున్నాను. బహుశా ఆ డబ్బు నిరాడంబరంగా జరిపించే వివాహానికి సరిపడవచ్చు. మన వంక చుట్టాలు, వారి వంక చుట్టాలు అట్టే లేరు. సింహాచలం దేవస్థానంలో అన్ని సదుపాయాలు లభిస్తాయి. మంచిరోజు చూచుకొని ఆడ పెళ్లివారితో చెప్పి రండి.

"ఎప్పుడూ నోరు విప్పి మాట్లాడనివాడు ఈవిధంగా చాల నిష్కర్షగా పలకడంతో మాకు చాల చిన్నతన మనిపించింది. మరొక రయితే మీ మామగారు పెడచెవాట్లు పెట్టేవారే. కాని కిన్నకొడుకు పెద్దవాడు – వంశోద్ధారకుడు – తండ్రికి చాల ఇష్టమయినవాడు. ఏం చేయడం?

"పుత్రాదిచ్ఛేత్ పరాజయం! వీడి అభిప్రాయం ఇటువంటిదని తెలిస్తే ఏసంబధాలు వెదక్కపోయి ఉండేవాళ్ళము. వాడు అన్న మాటల్లో పొల్లుమాట ఒకటీ లేదు. ఇంకా ఇప్పుడు పావుతక్కువ పదే అయింది. డిప్యూటీ కలెక్టరుగారు విధిగా ఆదివారం సినిమాకు వెళ్తారు. ఈపాటికి వచ్చి భోజనం చేస్తూఉంటారు. ఈ సంగతి ఆయనకుఇప్పుడే చెప్పి గుండెల మీద బరువుదింపుకోవాలి" అన్నారు మీ మామగారు.

"వెంటనే ఆటోరిక్షా చేయించుకొని కృష్ణానగరంలో నున్న డిప్యూటీ కలెక్టరుగారింటికి వెళ్లారు మీమామగారు. ఆయన అప్పుడే భోజనం ముగించి తాంబూలం సేవిస్తున్నారు. మీమామగారు ఏవో కొంచెంసేపు మాట్లాడి, పిల్లడు ఇష్టపడడంలేదని, సంబంధం తేలిపోయిందని చెప్పారు.

నేనూ అదే అనుకుంటున్నాను. మా అమ్మాయి కూడా నచ్చుకోలేదు. పెళ్ళిచూపులలో మీవాడు చాలా సీరియస్‌గా కూర్చున్నాడు. మా అమ్మాయి అడిగిన ప్రశ్నలకు అవును, కాదు అని మాత్రమే జవాబు చెప్పాడు. రేపు ఈ విషయమే నేనుకూడా చెప్పదలచాను" అన్నారాయన.

"ఆవిధంగా అన్నీ మన మంచికే వచ్చాయి" అంది జానకమ్మ.

"వదినా, వదినా, వల్లంకిపిట్ట!" నవ్వింది కాత్యాయని.

"సీరియస్‌గా మాట్లాడుతున్నప్పుడు ఇటువంటిమాటలు పనికిరావు" అన్నాడు పెద్దవాడు శేఖర్.

కళ్ళనుండి కారుతున్న కన్నీటిబొట్లను దులుపుకుంది సరస్వతి కొనగోటితో.

"అత్తయ్యా! మిమ్మల్నందరినీ ఇబ్బంది పెట్టాను" అంత మాత్రమే అనగలిగింది సరస్వతి.

"ఇప్పుడు నాకేచింతలేదు. ఎంతోబలం వచ్చింది. సత్యమూర్తి ఎప్పుడూ తప్పుచేయడనే నమ్మకం ఇంకా ధృఢమయింది" అంది జానకమ్మ సరస్వతి కళ్ళలోకి చూస్తూ.

## 10

సరస్వతి కిటికీతలుపు తీసింది. సముద్రం కనిపించింది. అలలు మీదకిలేచి విరుగుతున్నాయి. నురుగులు అంతగా కనిపించటంలేదు. ఒక్కక్షణం ఆ తీరికలేని సముద్రాన్ని చూచి ముఖం తిప్పుకుంది.

మేడమీది గదికి కొంచెం సొగసు వచ్చింది. కడిగిన నేలమీద రంగు ముగ్గులున్నవి. గోడలకు రెండుచక్కని ప్రకృతి చిత్రాలున్న కేలండర్లు ఒక రామపట్టాభిషేకం పఠం వేలాడుతున్నవి. లక్కబొమ్మలు రాజూ,రాణీ- చిన్న పద్మం, దానిమధ్యనో అద్దం, చిన్న పూవులచెట్టు, కుంకంబరిణె, కొవ్వువత్తుల స్టాండు- ఇంకా మరికొన్ని, ఒక మూలనున్న షోకేసులో ఉన్నాయి. పరుపుమీద తెల్లని దుప్పటి ఉంది. కాని దాని చివరలను రంగులదారాలతో అల్లిన రెండుమూడు చిన్న పూవులు- చక్కని కాంట్రాస్టులో కనిపిస్తున్నవి. టేబిలులాంపు షేడుకూడా బదిలీ అయింది.

సరస్వతి వాటినన్నిటిని చూచి ఒక్కనిట్టూర్పు విడిచింది. వివాహమయిన సంవత్సరం తరువాత ఆయింట్లో తాను తెచ్చిన మార్పులను ఆమె సింహావలోకనం చేస్తున్నది. క్రిందను మూలల్లో వేసిన సంపెగ చెట్లుచాల ఏపుగా పెరుగుతున్నాయి. ద్రాక్షలత పందిరిని అల్లుకొంటున్నది. ఈ సంవత్సరం గులాబులు, మల్లెలు విరబూచినవి. బహుశా తాను ఈ యింటికి రాకపోయినా, శ్రద్ధ, అసక్తిగల ఆకుటుంబం ఈపాటి పని తప్పకచేసి ఉండేవారేమో!

సరస్వతి చాలసేపు ఆలోచిస్తూ కూర్చుంది. తాను తెచ్చిన మార్పులు అని భావించడంకన్న, ఆకుటుంబంలో తానూ ఒకభాగమయి ఆనందించడం మేలని అనుకొంది. చిన్నకాకర మొక్కకు బీజదళాలు వచ్చిన స్థితినుంచి, సమృద్ధిగా కాయలు కాసేవరకు నిర్విరామంగా శ్రమపడిన మరిదిని, మల్లెమొక్కలకు దగ్గిరుండి అన్నచేత గొప్పులు తవ్వించి గెత్తంవేయించి మడులు కట్టించిన కాత్యాయనిని తలచుకుంటే ఆమె హృదయం ఆర్ద్రమయింది.

సత్యమూర్తి వారంరోజులక్రిందనే అడిగాడు - ఎం.డి పరీక్షకు డబ్బుకట్టడానికి ఇంకా వ్యవధి ఉంది. ఫారాలు కూడా తనే తెచ్చాడు. వాటిమీద తాను సంతకం పెట్టి ఇస్తే డబ్బుకడతానన్నాడు. చాలా బలవంతంచేశాడు. కాని, తాను సుతరాం ఒప్పుకోలేదు. ఆ డాక్టరు ఉద్యోగం, ఆ భోగం, ఆ లాలస, అన్నీ అమ్మతోనే పోయాయి. మనోహర్‌కూడా తనను చదివిస్తానన్నాడు. సత్యమూర్తి కూడా అన్నాడు. తనకు మరి మెడిసిన్ చదవాలనిలేదు. తాను చ కొని, పాసయి, పెద్ద డాక్టరయితే మెచ్చుకునే అమ్మలేనపుడు, చ కున్నా ఒకటే చదవక పోయినా ఒకటే.

ఒకప్పుడు కిటికీతలుపుతీసి చూస్తే సముద్రం చాలగంభీర ఉండేది, లోకంలోని బాధలనన్నీ కడుపులో ఇముడ్చుకొని, ప్రశాంతంగా కనిపించే కన్నతల్లిలా ఉండేది. ఆ సమయాలలో కెరట హోరు అట్టే వినిపించేదికాదు. తెల్లటి నురుగు, నీలపు పట్టుపరికిణీ అంచులా కనిపించేది. సరస్వతి అన్నీమరచిపోయి ఆ సముద్రా చూస్తూ గంటలకొద్దీ ఆ కిటికీదగ్గర కూర్చొనేది.

తెల్లవారు వేళ దూరంగా నున్న మామిడి తోటలనుండి కోకిల పాడుతుంటేతెలివివస్తుంది ఆమెకు. కిటికీలోంచి సముద్రంవేపుచూస్తుం తూర్పులోని అరుణరేఖలు తెల్లటినురగలను పారాణీముద్దలుగా మా స్తుంటే చూస్తుంది క్రమంగా సూర్యబింబం సముద్రంలోంచి పైకివ దిక్చక్రం నుండి తీరం వరకు బంగారుబాటను వేసినప్పుడు, దానిమీ నడిచిపోవాలని ఆమెకు అనిపిస్తుంది.

శరత్పూర్ణిమనాడు, కడిగి ఆరబోసిన రత్నాలవలె ఆకాశమం నక్షత్రాలు విరజిమ్మబడినప్పుడు, పాదరసపు ప్రవాహమొకటి చంద్రు నుండి తీరానికివస్తే ఆ తళకులలో సముద్రపు అందాలుచూస్తూ సర్వ మరచిపోతుంది సరస్వతి. క్రమంగా ఆ పాదరసపు తళతళలు మాం మవుతుంటే తనజీవితంకూడా నిస్తేజంగా మారుతుందని అనుకుంటుం

అక్టోబరు నెల ఆఖరి వారాలలో ఈశాన్య ఋతుపవనా జల్లులు జల్లులుగా వర్షించి ఆ సముద్రం మీద ఎగురుతున్న పలుచ తెరలను కప్పినప్పుడు, ఈదరగాలి వదలకుండా వీస్తున్నపుడు, ముం మంతా తుంపురులతో నిండి, ముంగురులు తడిసి చెదిరినప్పుడు, ఏది వ్యక్తంకాని బాధతో ఆమె కిటికీతలుపులు మూస్తుంది.

హేమంతంలో ఆకాశంలోని నక్షత్రాలు జారిపోయి సముద్రంలో పడుతుంటే సరస్వతి చాలసేపు చూచింది. కృష్ణపక్షంలో చందమామ ఆలస్యంగా వచ్చాడు. ఎప్పుడో నిద్రవచ్చి ఆమె పక్క మీద వాలింది.

... ఆమె తొందరగా హాస్పిటల్ వార్డులలో నడుస్తున్నది. తెల్లటికోటు తొడుక్కుంది. చీరకుచ్చిళ్ళు అడ్డం రాకుండా ఆమె చూచుకుంటూ ముందుకు నడుస్తున్నది. "సరస్వతి మాడమ్, సరస్వతి మాడమ్" - మెడికల్ స్టూడెంట్లు ఆమెను చూచి నమస్కారంచేసి పక్కకు తప్పుకుంటున్నారు. వార్డులోని రోగులు చేతులెత్తి దండాలు పెడుతున్నారు. జూనియర్లు ఆవిడ ఆజ్ఞలను పాటిస్తున్నారు. ఆమె రోగుల సముద్రంలోంచి బయటపడింది. తన రూమ్‌లోకి పోతూ బోర్డు ఒకసారి చూచింది. మిస్. సరస్వతి, ఎమ్.ఎస్., ఎఫ్. ఆర్. సి. ఎస్.,

ఇంకా ఎన్నో డిగ్రీలు .... అందరు డాక్టర్లూ వెళ్లిపోయారు. ఆమె ఆలోచిస్తూ రివాల్వింగ్ చైర్‌లో కూర్చుంది. లంచి టైము దాటి పోయింది. ఆమె అలా కుర్చీలోనే కునుకుతీసినట్లయింది. నర్సులు డ్యూటీలు మారిపోయారు. ఎవో మాటలు – ఎవరో మాడమ్ గురించి అడుగుతున్నారు. ఆయా జవాబు చెప్తున్నది. మాడమ్ వెళ్లిపోయారు. మళ్ళా రేపు ప్రొద్దున్నే వస్తారు. ఇంకా జరూరు పని ఉంటే సాయంకాలం ఆరు తరువాత ఆమెను ఇంటిదగ్గర కలియవచ్చు. .... ఇల్లు తెలియదా ? మహారాణీపేట డౌన్‌లో.... మూడంతస్తుల మేడ.... మాడమ్ సరస్వతిగారి యిల్లంటే తెలియనివాళ్ళెవరు ? ఎంత డబ్బు పుచ్చుకుంటుందా ? ఆమెకు అటువంటి ప్రసక్తేలేదు. ఆమె చేయి పడితే చాలు – రోగం పారిపోతుందయ్యా, .... వెళ్లు .... వెళ్లు .... అబ్బ....ఎప్పటికీ ఈ నాటు మనిషి వదలడు. ఇంతకీ .... రామాలమ్మా .... ఆడోళ్లందరికీ మగాడి అవుసరం ఉండదా ? ఉండకేటి ! ఈ మాడమ్‌గారు చిన్నప్పుడు రామాచారిగారిని ప్రేమించారట . . . ఆయన కాదంటే ... మనోహర్ జమీందారుగారిని ప్రేమించారట.... ఆరూ కాదంటే మరి పెళ్ళేచేసుకోలేదట. అప్పటినుండీ రోగులకే పానం ధారపోస్తున్నారట. అందరూ అనాగే అంటారే.

తరువాత కేకలు – పెద్ద అరుపులు – నినాదాలు .... డౌన్ డౌన్ మాడమ్ సరస్వతి .... మాడమ్ పట్టిన కేసులన్నీ ఫెయిల్యూర్లే ! సర్జరీలో ఫండమెంటల్స్ తెలియని మాడమ్ చీఫ్ ఎలా అయింది ? ఇంపోస్టర్ ....డౌన్... డౌన్. ఈమెను కోర్టులో ఇంపీచ్‌చేయాలి... నిండుప్రాణాలను తీస్తున్న ఇగ్నొరెంటు మాడమ్‌ను అరెస్టుచేసి ఉరి కంబమెక్కించాలి.

సరస్వతి వణికిపోతున్నది, గుండెలు తొందరగ కొట్టుకుంటున్నవి. మెలకువ వచ్చినా కాళ్లు చేతులు కదపలేకపోతున్నది. కనులు విప్పలేకపోతున్నది. ఇంతలో ఆమెకు కిటికీ తలుపులు వేసిన శబ్దం వినిపించింది. తరువాత తనమీద మెత్తని రగ్గు కప్పినట్లయింది. క్రమంగా లోపల వెచ్చదనంతోచి, శరీరం వణకడం మానివేసింది. మనసులోని భయాలు ఒకటీ ఒకటీ తొలగిపోయాయి. కన్నులు విప్పి చూచింది. ఎదురుగా టేబిలు దగ్గిర కూర్చొని సత్యమూర్తి చదువుకుంటున్నాడు. తాను పెళ్లికాని మాడమ్‌కాదు ... ఇంతకీ తాను మాడమ్ అయితేకదా ? ... తానొక ఇంటి కోడలు. ధైర్యం తోచింది ఆమెకు. – లేచి మంచంమీద కూర్చుంది. రగ్గు భుజాల మీదకు లాక్కుంది.

"బావా!"

సత్యమూర్తి ముఖమెత్తి సరస్వతివేపు చూచాడు,

"మా అమ్మ ఒడిలో ఉన్నట్లుంది, ఎంత హాయిగా ఉంది"

అతని పెదవులమీద చిన్ననవ్వు తోచింది

"బావ! ఎంతవేళయింది ?"

"ఇంకా ఆరు గంటలే అయింది. ఇవాళ ఆదివారం. ప్రతి రోజూ నువ్వు తొందరగానే లేస్తునే ఉన్నావు. ఈరోజు కొంచెంసేపు నిద్రపో !"

"కాఫీ చేసి తెస్తాను. రాత్రి, పగలు చదువుతున్నావు. ఈపాటి నేను నీకు ఉపయోగపడవద్దా ?"

సత్యమూర్తి మళ్ళా పుస్తకంవేపు తిరిగిపోయాడు. ఫైనలియర్ పరీక్షలు ఇంకా మూడు నెలలే ఉన్నాయి.

## 11

"ఎమ్ మీనాక్షి!"

ఛాంబరు బయటికి వచ్చి అక్కడ నున్న అటెండెంటు పిలిచాడు. అన్ని కార్యాలయాల లోను ప్యూనులని, ఛప్రాసీలని వారికి పేర్లు. కాని "రాజకుమార్ అండ్ అసోసియేట్సు" వారి అడ్మినిష్ట్రేటివ్ ఆఫీసులో వారి పేర్లు అటెండెంట్సు. వాళ్ళకి తెల్లని టెరీకాటన్ ఫంట్లాలు – మాచ్ అయే షర్టులు – జేబు దగ్గర నీలి దారంతో కుట్టిన కంపెనీ పేరు ... ఈ హంగు లన్నిటితో వారు చిన్న అసిస్టెంటు డైరెక్టర్ల వలె ఉంటారు.... వీరికి, వారికి తేడా – టైలు వీరికి లేకపోవడమే!

పాత పోస్టాఫీసుకు కొంచెం ముందు ఒక పెద్ద హవేలీ ఉంది. రమారమి ఎకరం జాగా అది. దానిలో పూర్వకాలపు జమిందారుల అంతఃపుర భవనమొకటి ఉండేది. అందులోని దాసదాసీ జనం కాల గర్భంలో కలిసిపోయారు. జమీందారుల కేళీ విలాసాలకు కేంద్రమైన ఆ అంతఃపుర భవనం కూలిపోయింది. గోడలు విరిగి పడిపోయాయి. దాని జాగాలో ఇప్పుడో రెండంతస్తుల బిల్డింగ్ ఒకటి వెలిసింది. పూర్వపు జమిందారీ చిహ్నాలకు ప్రతీకగా కాంపోండు వాలు మాత్రమే మిగిలింది. పదహారడుగుల ఎత్తు, మూడడుగుల మందం ఉన్న ఆ గోడ మాత్రం చెక్కు చెదరలేదు. పెద్ద గేటు, గేటు దగ్గర ఘూర్కా సిపాయి– వాటిని దాటి వెళ్తే చక్కని పూల మొక్కలు, సంపెంగ చెట్లు, మామిడి చెట్లు వాటి మధ్యనుండి చక్కని తారురోడ్డు, వీటిని దాటగనే విశాలమైన రెండంతస్తుల ఆధునిక భవనం– దాని బోర్డుమీద "రాజకుమార్ అండ్ అసోసియేట్సు – ఆర్కిటెక్ట్సు" అని వ్రాసి ఉంది.

క్రింది భాగంలో పెద్ద స్టోరు గోడౌను, కాంటీను ఉన్నాయి. మొదటి అంతస్తులో ఆఫీసు, రికార్డు రూమ్ స్టాఫ్ టిఫిన్ రూము –

ఉన్నాయి. రెండవ అంతస్తు పూర్తిగా ఎయిర్ కండిషన్ చేయబడింది. దానిలో మానేజింగ్ డైరెక్టరు, ఛీఫ్ ఆర్కిటెక్టు, ఛీఫ్ అకౌంట్సు ఆఫీసరు, పెర్సనలు ఆఫీసరు - వీరి ఛాంబర్లు - డ్రాయింగ్ అండ్ డిజైను ఆఫీసు విజిటర్సు రేంజ్ - మీటింగ్ రూము ఉన్నవి.

ఆరోజు బుధవారం కంపెనీ వారికి ముగ్గురు గుమస్తాలు, ఒక టైపిస్టు కం స్టోరు క్లార్కు కావలసి ఉన్నారు. న్యూస్ పేపర్లలో రెండు నెలల క్రింద అడ్వర్టయిజుమెంటు వచ్చింది. అప్లికేషన్లను చాల వరకు జల్లెడ పట్టి, ఏభైమందికి మాత్రమే ఇంటర్వ్యూ జరుగుతున్నది.

"ఎమ్. మీనాక్షి!"

మీటింగు రూముద్వారం దగ్గర నిలుచున్న అటెండెంటు పిలవడంతో విజిటర్సు రేంజిలో కూర్చున్న లావుపాటి చిన్నది, ముఖానికి పౌడరు పఫ్‌చేసుకొని వానిటీ బాగులోని అద్దంలో ముఖం చూచుకొని, బొట్టుసరి చేసుకుని ముంగురులు దిద్దుకొని,లేచివెళ్ళింది లోపలకి. ఆమె వెనుక ఇంకా ఇరవై మంది ఉన్నారు. వెళ్ళిన పదినిముషాలలోనే ఆ మీనాక్షి తిరిగి వచ్చింది.

"బాస్టర్డ్సు! నా సినిమాహీరో ఎవడో చెప్పమన్నారు"

తిట్టుకుంటూ ఆమె గ్రీన్‌బార్డరున్న బ్రౌన్‌కార్పెట్టుమీద చప్పుడు చేయకుండా మెట్లుదిగి వెళ్ళిపోయింది.

లంచ్ బ్రేక్! లంచ్‌బ్రేక్! మిగిలిన వారందరూ ఇళ్ళకుపోయి మళ్లా రెండు గంటలకు రండి!"

తలమీది తెల్లని టోపీని సరిచేసుకుంటూ ఎటెండెంటు వెళ్ళిపోయాడు కాంటీనుకి.

విజిటర్స్‌రేంజిలో కూర్చున్నవారు క్రిందకు వెళ్ళిపోయారు వాళ్ళలో పదహారుమంది మగవాళ్లు, నలుగురు ఆడవాళ్ల మిగిలారు. ముప్ఫయి మందికి మొదటిదఫాలో ఇంటర్వ్యూ ముగిసింది.

మధ్యాహ్నం సరిగా రెండు గంటలకు ఇంటర్వ్యూమొదలయింది. ఈ సారితొందరగా జరిగింది. మూడుగంటలయేసరికి నలుగురు అభ్యర్థులు మాత్రమే మిగిలారు. ఒక స్త్రీ, ముగ్గురు పురుషులు ఉండిపోయారు. ద్వారం దగ్గరనున్న అటెండెంటు బెల్లు మ్రోగగనే లోపలకి వెళ్ళిపోయాడు. కొద్దిసేపటిలో తరువాత కాండిడేటును పిలుస్తాడని వాళ్ళు ఎదురు చూచారు. ఒక పావుగంట వరకు కాలం గడిచిపోయింది. ఎవరి పేర్లను పిలవలేదు. మీటింగు రూము నుండి సూట్లలో నున్న ముగ్గురు ఆఫీసర్లు బయటకి వచ్చి వారి వారి ఛాంబర్లలోకి వెళ్ళిపోయారు. మరొక్క అయిదు నిమిషాలలో టీ కప్పులు ట్రే లో పెట్టుకొని అటెండెంటు క్రిందికి వెళ్ళిపోబోతూ, ఇంకా ఇంటర్వ్యూ కోసం వేచియున్న నలుగురిని చూచి క్షణం నిలబడ్డాడు.

"సెలక్షను అయిపోయింది. బోర్డు కూడా లేచిపోయింది. మీరిక ఇళ్ళకు వెళ్ళిపోవచ్చు."

" మా పేర్లు పిలవలేదే ! మాకు ఇంటర్వ్యూలేదా ? ఎలా సెలక్షన్ అయిపోయింది ?" ఒక అభ్యర్థి అడిగాడు.

"నాకేం తెలీదు. మొదటి అంతస్తులో నున్న మానేజరుగారిని అడగండి." అన్నాడు అటెండెటు మెట్లుదిగుతూ.

నలుగురు అభ్యర్థులు తొందరగా క్రిందికి దిగి ఆఫీసు మానేజరును కలిశారు.

"ఇప్పుడే ఫైలు నాకు వచ్చింది. కావలసిన నలుగురిని సెలక్టు చేయడం జరిగింది. మరో ఇద్దరిని పానల్‌లో పెట్టారు. కాబట్టి సెలక్షను అయిపోయినట్లే !" అన్నాడాయన మీసాలు మెలివేస్తూ.

"మమ్మల్ని ఇంటర్వ్యూ కని పిలిపించి ఇలా మోసం చేయడంలో మీ ఉద్దేశమేమిటి ?" గట్టిగా అడిగాడు మరో కాండిడేటు.

"మమ్మల్ని ఇలా ఛీట్‌చేస్తే ఊరుకొనేది లేదు. కోర్టు కెక్కించకుండా వదలం" అన్నాడు మరొకడు.

"చూడండి ! మేము పరీక్ష సవ్యంగా చేయాలనే అనుకున్నాము. ముగ్గురు మినిస్టర్లు, ఒక యంపి రికమెండేషన్లు చేశారు. పదిమంది ఎమ్మెల్లేలు ఉత్తరాలు వ్రాశారు. మాకు కావలసినవారు నలుగురే. మిమ్మల్ని ఇంటర్వ్యూలో నిలబెట్టడం వలన కలిసివచ్చేదేమీలేదని సెలక్షను బోర్డు చెయిర్మను గారయిన ఛీఫ్ ఆర్కిటెక్టుగారు దీనిని ముగించారు. మీరు పట్టుబడితే తప్పదు. అదేనా మరో వారంరోజుల తరువాత మీకు కాల్‌లెటర్సు పంపిస్తాం. బోర్డు చెయిర్మెన్‌గారు అప్పుడే హైదరాబాదుకని వెళ్ళిపోయారు. మీరు వెళ్లిపొండి." అన్నాడు మానేజరు.

"ఇదేమి తమాషా ! మళ్లా వారంరోజుల తరువాతరావాలా ? నేను భువనేశ్వరం నుండి వచ్చాను. నాకు మీరు ప్రయాణం కర్చులిచ్చినా, మళ్లీ రావడానికి వీలుకాదు. నేను పరీక్షలో ఫేలయినా పరవాలేదు. ఈ రోజు ఇంటర్వ్యూ ముగియవలసిందే !" అన్నాడొక అభ్యర్థి.

"అయ్యా ! మా కంపెనీ రూల్సు ప్రకారం చీఫ్ ఆర్కిటెక్టుగాని, మేనేజింగ్ డైరెక్టరుగాని బోర్డు ఛైర్మనుగా ఉండాలి. సాధారణంగా మేనేజింగ్ డైరెక్టరుగారు ఇటువంటి విషయాలలో జోక్యం కలిగించుకోరు. అందుచేత మీరు వారంరోజుల తరువాత రావలసిందే!" అన్నాడు మానేజరు.

"మేము రాము. ఈ విషయం మీ డైరెక్టరుగారితో చెప్పి ఇంటర్వ్యూలు ఏర్పాటు చేయండి. మీరు ఈ విధంగా చేయకపోతే

న్యూస్ పేపర్లలో ఈ అన్యాయం గురించి వ్రాయడమే కాకుండా, కోర్టుకికూడా వెళ్తాము'' అన్నాడు ఆ మొండి కాండిడేటు.

"మంచి చిక్కువచ్చిపడ్డదే - అటు నూయి, ఇటు గోయి - మా మానేజింగ్ డైరెక్టరుగారికి అసలు టైమేలేదు. ఆతనిని అడిగి చూస్తాను, తరువాత మీ అదృష్టం'' అన్నాడు, మానేజరు కుర్చీ లోంచి లేస్తూ.

మానేజరు మేడమీదకెళ్ళి మరొక పావుగంట తరువాత మేడ దిగి వచ్చాడు, సీటులో కూర్చొని, కళ్ళ జోడు నాలుగుసార్లు బుష్ కోటుతో తుడుచుకొని, చెప్పడానికి ఉపక్రమించాడు.

"ఇప్పుడు పావుతక్కువ నాలుగయింది. నాలుగు గంటలకు చీఫ్ యింజనీరుగారు వస్తున్నారు. ఆయనతో అయిదున్నరవరకు మీటింగు ఉంది. బహుశా ఇంకా ఆలస్యమే కావచ్చు. అటుపిమ్మట మీకు ఇంటర్వ్యూచేయడానికి మానేజింగ్ డైరెక్టరుగారు అంగీకరించారు. అంతవరకు మీరు వేచియుండండి''.

ఆ నలుగురి ముఖాలు వికసించాయి.

అయిదుగంటలనుండి వారు రెండవ అంతస్తులోని విజిటర్స్ రేంజిలో కూర్చున్నారు.

చీఫ్ ఇంజనీరుగారితో ఆయన మీటింగు మానేజింగ్ డైరెక్టరు గారి ఛాంబరులోనే జరిగింది.

ఆరు గంటలకు ముగ్గురు సూట్లు వేసుకున్న పెద్ద మనుష్యులు మీటింగు రూములోకి ప్రవేశించారు. తరువాత ఒక అటెండెంటు కాలు ఊపుకుంటూ, కుంటిగా నడుస్తూ, క్రిందనున్న ఆఫీసునుండి ఫైలు తీసుకొని మీటింగ్ రూములోకి వెళ్ళాడు. ప్రొద్దున్న ఇంటర్వ్యూలకు ఉన్న అటెండెంటు ఇప్పుడు లేడు. ఇతను మరొకడు.

మీటింగు రూము తలుపు దగ్గిర నిలబడి కుంటి అటెండెంటు గట్టిగా పిలిచాడు.

"శ్రీ సన్యాసిరావు''.

పొడుగుగా నున్న కాండిడేటు, టై సరిచేసుకొని లోనికి ప్రవేశించాడు.

ఏడు గంటలకు చివరి కాండిడేట్‌కి పిలుపు వచ్చింది.

"మిసెస్ ఆర్ ఎస్ మూర్తి''

సోఫాలో కూర్చున్న స్త్రీ, ఒడిలోని సర్టిఫికెట్లున్న ఫైలును చేత పట్టుకొని ముందుకు నడిచింది.

మీటింగ్ రూము ద్వారం దగ్గిరనున్న అటెండెంటు, ముందు కొస్తున్న ఆమె ముఖంలోకి చూచి, "నువ్వా సరస్వతీ!'' అన్నాడు ఆశ్చర్యంతో తలమునకలై.

"అవును, సత్యనారాయణా!'' అంది సరస్వతి మీటింగు రూము కర్టెను తొలగించి లోనికి ప్రవేశిస్తూ.

## 12

సరస్వతి బస్సులో కూర్చునేసరికి ఎనిమిది గంటల రాత్రి అయింది. ఇంటి దగ్గిర అందరూ కంగారు పడుతుంటారు. రాత్రి తొమ్మిది గంటలకు ఇల్లు చేరితే అందరికీ ఆందోళన కాదా? అందరికన్న హెచ్చుగా జానకమ్మత్త గాభరా పడుతుంది. మామ, పిల్లలు- అందరి కన్న హెచ్చుగా మూర్తి. పైకి కనిపించడు. చాల గంభీరంగా కనిపిస్తాడు. కాని ఆ మెత్తని మనసులో తన గురించి ఎంతో ఆలోచిస్తూ ఉంటాడు.

బస్సులో ఒకరూ ఒకరూ సిందుతున్నారు. ప్రొద్దున్న తొమ్మిది కాకుండా నాలుగు మెతుకులు తిని ఈ ఉద్యోగం కోసం బయలుదేరింది. మధ్యాహ్నమో కప్పు కాఫీ తాగింది. చాల ఆకలిగా ఉందామెకు.

తను ఉద్యోగం గురించి ప్రయత్నిస్తుంటే ఇంట్లో ఎవరూ అంతగా ఇష్టపడలేదు. మూర్తి బియ్యే పరీక్ష పాసవగానే అసిస్టెంటు ఇంజనీరుగా ప్రమోషను దొరికింది. తనుకూడా ఆ సమయంలోనే టైపు, బుక్కీపింగ్, అకౌంటెన్సీ పరీక్షలకు కట్టింది. రోజూ సాయంకాలం మూడు నుండి ఆరు వరకు కమర్షియల్ ఇన్‌స్టిట్యూట్‌లో గడిపి చీకటి పడుతుంటే ఇల్లు చేరేది. ఈమధ్యనే టైపు హయ్యరు లోను, మిగిలిన టెస్టులలోను మంచి మార్కులతో పాసయింది.

టైపు, కమర్షియల్ సబ్జక్టు చదువుతానంటే మూర్తి ఏమీ అభ్యంతరం పెట్టలేదు. వెంటనే అన్ని ఏర్పాటులు చేశాడు. ఫలితాలు వచ్చాయి. మరొక్క రెండు రోజులలో న్యూస్ పేపరులో అడ్వర్టయిజుమెంటు చూసి, టైపిస్టు కమ్ గుమస్తా ఉద్యోగం కోసం దరఖాస్తు పెడతానంది. మూర్తి చిన్నగా నవ్వాడు. అప్పుడు సరస్వతికి జవాబు చెప్పవలసిన అవసరం కలిగింది.

"బావా! నువ్వు శ్రమపడి సంవత్సరాలతరబడి బాంకులో జమచేసినది పెళ్ళికింద ఖర్చుపెట్టావు. పెళ్ళయిన తరువాత ఏవిధంగానైనా పొదుపుచేద్దామంటే సాధ్యంకాలేదు. కాత్యాయనికి పదేళ్లు వచ్చాయి. మరో పదేళ్ళకు ఆ పిల్లకు పెళ్ళి చేయాలంటే ఇప్పటినుంచి డబ్బు ఆదాచేయాలి. నాకుకూడా ఏమీ పనిలేదు. సోమరిగా కాలం గడపడంకంటె మన యింటిక్రింద శ్రమపడడం ఉత్తమంగా తోచింది. శేఖర్ పెద్దచదువులకు వచ్చేటప్పుడు మనం వెనుకంజవెయ్యకూడదు. నువ్వు ఉద్యోగంలో చేరినతరువాతకూడా శ్రమపడి చదువుకున్నావు కాని కాత్యాయనికి పెళ్ళి చేయాలన్నా, శేఖర్ పెద్దచదువులు చదవాలన్నా మనమందరం శ్రమపడాలి. మామయ్య ఆదాయంలో మూడవ వంతు ఇంటి అప్పుక్రింద తీరుతున్నది. చదివినది కొంచెమే అయినా, ఉద్యోగానికి అర్హత సంపాదించాను నేను. చాల ఆలోచించి ఉద్యోగంచేయాలన్న నిశ్చయానికి చివరకు వచ్చాను.''

(ఇంకా ఉంది)

# కలగూరగంప

## అపర నన్నయభట్టు

## విమర్శ - పరామర్శ

భారతి — డిసెంబరు '83 కలగూరగంప యందు "అపర నన్నయభట్టు" అను శీర్షికను శ్రీ సూర్యదేవర రవికుమార్ "ప్రస్తావించిన ఒకటి, రెండు విషయములు"ను అవిచార మూలకములు. అవి :

1. "క్రీ. శ. 14వ శతాబ్ది ఉత్తరార్థమునకు గల గౌరన కవి తన 'లక్షణ దీపిక' లో శ్రీధరచ్ఛందమును పేర్కొనినాడు. (చూ. పరిషత్పుస్తక భాండాగారము. మూడవ భాగము పు. 17) కనుక శ్రీధరచ్ఛందము 14వ శతాబ్ది నాటికే కలదు."

పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్థమునందు కాదుగాని, పదునైదవ శతాబ్ది పూర్వార్థమునందు కల గౌరన లక్షణదీపిక ప్రతులను చూచినచో, అది కాలాంతరమునందు రూపాంతరము చెందినదని, కేవలం సంస్కృతగ్రంథమైన గౌరన లక్షణదీపిక యందు ఆంధ్రచ్ఛందో గ్రంథములు అగమ్యప్రాయములని అవగాహనమగును. కనుక శ్రీధరచ్ఛందము కాలము పదునాల్గవ శతాబ్ది కావలసిన ఆవశ్యకము లేదు. పదునారవ శతాబ్ది కావచ్చును.

2. "ఉత్తమగండ భూవరుని పేర రచింపబడిన అశ్వశాస్త్రమొకటి కలదు. ఈ అశ్వశాస్త్రమున పేర్కొనబడిన ఉత్తమగండ భూవరుడు లక్షణగ్రంథమున పేర్కొనబడిన ఉత్తమగండడు ఒకే వ్యక్తి కావచ్చును."

ఇది "సమగ్ర ఆంధ్రసాహిత్యం" అసమగ్రపరిజ్ఞానము వలని అయోమయము. మనుమంచి భట్టు హయలక్షణవిలాసమునందు ప్రాచీనమైన శాలిహోత్రములోని పద్యములవలె, అర్వాచీనమైన ఉత్తమగండ భూవరుని అశ్వశాస్త్రములోని పద్యములును ఒక ప్రతి యందు కలిసిపోయినవని, "ఏ కాలంవాడో తెలియని ఒక కవి (కామయ్య శిష్యుడు) అశ్వశాస్త్రాన్ని వ్రాసి, ఏ రాజ్యపువాడో తెలియని ఉత్తమ గండదొడ్డ భూపాలునికి అంకితమిచ్చాడ"ని, మనుమంచి భట్టు హయలక్షణ విలాసము కృతిపతి కుమార కంపరాజు "శ్రీకృష్ణదేవ రాయల సేనాని" అని "సమగ్ర ఆంధ్రసాహిత్య" ము నందు స్పష్టముగ కలదు. కనుక మనుమంచిభట్టు "హయలక్షణ విలాసము" పదునారవ శతాబ్ది పూర్వార్థములోని గ్రంథము కావలయు తదర్వాచీన గ్రంథమైన ఉత్తమగండ అశ్వశాస్త్రము పదునారవ శతా ఉత్తరార్థములోని గ్రంథము కావచ్చును. అశ్వశాస్త్రమునకు సంబ ధించిన ఉత్తమగండ భూవరుడు, ఛందశ్శాస్త్రమునకు సంబంధించి ఉత్తమగండ బిరుదాంకితుడు "ఒకే వ్యక్తి" అయినచో, మఱి ఉత్త గండచ్ఛందము పదునారవ శతాబ్ది గ్రంథమే అగును.

**3. "ఉత్తమగండచ్ఛందము ప్రధానమైన ప్రాచీన లక్ష** గ్రంథములలో నొకటిగా ప్రాచీనులు భావించినట్లు కవిజనాశ్ర ప్రాచీన ప్రతిలో ఒక సాహితీప్రియుడు వ్రాసుకొనిన యీ క్రిం వాక్యమువలన తెలియుచున్నది. "ఉత్తమగండచ్ఛందం, హను చ్ఛందం, అనన్తచ్ఛందం, కవిరాక్షసచ్ఛందం, జయదేవచ్ఛంద గోకర్ణచ్ఛందం, నీలకంఠచ్ఛందం, ఆదిభీమనచ్ఛందం, అన ౮ విధముల ఛందములు. ఈ ౮ ఛందములు గావే లక్షణగ్రంథ లనగాను. (చూ. పరిషత్పుస్తక భాండాగారము. 3భా. పు. 3 పై లక్షణగ్రంథములు క్రీ. శ. 16వ శతాబ్దికి ముందువే గను ఉత్తమగండచ్ఛదము కూడ 16వ శతాబ్ది పూర్వగ్రంథమే కాని 16 శతాబ్ది గ్రంథము కాజాలదు."

ఇది పూర్వోత్తర విరోధ శంకానిరాంతంకము వలని పుక్కి పురాణము. కవిజనాశ్రయము "మిక్కిలి ప్రాంతప్రతి" యందు కవి రచించినట్లు కల "వేములవాడను వెలసిన" అనుపద్యము "ప్రక్షిప్త కనుక ప్రామాణికము కాజాలదు" అని విమర్శాంతరమందు విన్యసిం కవిజనాశ్రయము "ప్రాచీన ప్రతి" యందు కశ్చిత్ సాహితీప్రియు వ్రాసికొనిన వాక్యము నిక్షిప్తము కనుక ప్రమాణము అని ప్రకృ విమర్శకు ఉపక్రమించుట విమర్శన పద్ధతికి విరుద్ధము. అంతేకాద ఆ వాక్యము, ఆ ఎనిమిది లక్షణగ్రంథములు ఆ ప్రాచీన ప్రతి లేఖ కాలము కంటె ప్రాచీన గ్రంథములనుటకు మాత్రమే ప్రమాణము ప్రతిలేఖన కాలము లేనిచో, ఆ వాక్యము నిరుపయోగము. ఉపరి వాక్యములోని ఎనిమిది లక్షణగ్రంథములును పదునారవ శతాబ్ది **పూర్వగ్రంథములనుటకు మఱి ప్రమాణములు లేవు. సరికదా, అంద** జయదేవచ్ఛందము అర్వాచీన గ్రంథమనుటకు అనుమానప్రమాణము నీలకంఠచ్ఛందము పదునారవ శతాబ్ది పూర్వార్థము కంటె అనంత గ్రంథమనుటకు ప్రత్యక్షప్రమాణము కలదు. అది తెలియకుం అందలి ఉత్తమగండచ్ఛందము "16వ శతాబ్ది పూర్వగ్రంథమే కా 16వ శతాబ్ది గ్రంథము కాజాలదు" అనుట లక్షణగ్రంథానభిజ్ఞత లక్ష్యము.

4. "—16వ శతాబ్దినాటి ఇంద్రవిజయములోని పద్యములు తత్పూర్వ లక్షణగ్రంథములలో ఎట్లుదాహరింపబడగలవు ? ఉత్తమ గండచ్ఛందము, శ్రీధరచ్ఛందములలో ఇంద్రవిజయములోని పద్యములు గలవని చెప్పిన ఆంధ్రప్రయోగ రత్నాకరకారుని వ్రాత అసత్యము కావలయును. లేదా ఇంద్రవిజయమను కావ్యమే అతని కవిత్వము కావలయును."

పదునారవ శతాబ్ది ఇంద్రవిజయములోని పద్యమును ఉదాహృతములైన ఉత్తమ గండచ్ఛందము, శ్రీధరచ్ఛందము పదునారవ శతాబ్ది కంటె పూర్వ గ్రంథములనుటకు నిర్ధారక సాధనములు లేవు. కనుక పదునారవ శతాబ్ది గ్రంథములు కావచ్చును. ఆంధ్ర ప్రయోగ రత్నాకరము చూడకుండ, "ఆంధ్ర ప్రయోగ రత్నాకరకారుని వ్రాత అసత్యము కావలయును లేదా ఇంద్రవిజయమను కావ్యమే అతని కవిత్వము కావలయును" అని ఊహించుట దుస్సాహసము. అకారణమైన, అక్షంతవ్యమైన అన్యనిందారోపణము.

5. "తమ తమ లక్షణగ్రంథములలో ప్రతిపాదించిన లక్షణముల కనుగుణముగా ప్రాచీన కవుల పాఠములను దిద్ద సాహసించిన కొందరు లక్షణకవులు తమ గ్రంథములకు ప్రామాణికత లభించునను తలంపుతో నామ మాత్రావశిష్టమైన ప్రాచీన లక్షణగ్రంథములలో ఉదాహరింపబడిన వనుచు, కొన్ని పద్యములను కల్పించి వాటి కర్తృకమును ప్రసిద్ధ ప్రాచీన కవులకు అంటగట్టుటకు సైతము వెనుకాడియుందరు. నన్నయ ఇంద్రవిజయ మీకోవకు చెందినదే అనుకొనుట తప్పుకాదు."

ఆంధ్ర ప్రయోగరత్నాకరమును అనుశీలించి, "ప్రాచీన కవుల పాఠములను దిద్ద సాహసించిన" సందర్భములు గుర్తించి, "ప్రాచీన లక్షణగ్రంథములలో ఉదాహరింపబడిన వనుచు కల్పించిన పద్యములను" గమనించి, "ప్రాచీన కవులకు అంటగట్టిన కర్తృత్వములను" కనిపెట్టి "నన్నయ ఇంద్రవిజయ మీకోవకు చెందినదే అనుకొనుట తప్పు" కాకపోవచ్చును గాని, ఆంధ్ర ప్రయోగరత్నాకరమును అనుశీలింపకుండ, "ప్రాచీన కవుల పాఠములను దిద్ద సాహసించిన" సందర్భములను గుర్తింపకుండ, "ప్రాచీన లక్షణగ్రంథములలో ఉదాహరింపబడిన వనుచు కల్పించిన పద్యములను" గమనింపకుండ, "ప్రాచీన కవులకు అంటగట్టిన కర్తృత్వములను" కనిపెట్టకుండ, అసలు ఆంధ్ర ప్రయోగరత్నాకరమును కంటితో చూడకుండ, "నన్నయ ఇంద్రవిజయమీకోవకు చెందినదే అనుకొనుట" తప్పున్నర తప్పు.

గణపవరపు వేంకటకవి "ఆంధ్ర ప్రయోగరత్నాకరము" గణనీయమైన లక్షణగ్రంథము. అది ఇంతవఱకు కవుల చరిత్రకారులు, సాహిత్య చరిత్రకారులు చూచిన జాడకానరాదు. కాని, గణపవరపు వేంకటకవి "ఆంధ్ర ప్రయోగరత్నాకరము"ను సంగ్రహించిన కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందమును అందఱు చూచిన జాడలు కానవచ్చును. కారణము— అది అప్పటికే ముద్రితము. ఇది ఇప్పటికిని అముద్రితము. రంగకవి అదృష్టము. వేంకటకవి దురదృష్టము. ఆంధ్ర కవుల చరిత్రకు, ఆంధ్ర లక్షణగ్రంథముల చరిత్రకు, ఆంధ్ర సాహిత్య చరిత్రకు కాణాచి అయిన గణపవరపు వేంకటకవి ఆంధ్ర ప్రయోగ రత్నాకరము ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆధ్వర్యమున ముద్రణభాగ్యము నందగలదని ఆశయము. అంతవఱకు, ఉపరి శోధనము ఉపేక్షాయోగ్యము.

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

## ఆధునిక తెలుగు సాహిత్యం - శ్రీరంగం నారాయణ బాబు

శ్రీరంగం నారాయణ బాబు "రుధిరజ్యోతి" లో ప్రస్తావన తరువాతి "ప్రవర" లో వాక్యాలు, కొన్ని కవిత్వపుదారులు, కవిత్వమంటే ? అనే మకుటంతో తిప్పిరాస్తే కవితే అవుతుంది. గమనించండి.

కవిత్వమంటే ?
అతిమృదులమై
ఇహుసరళమై
మందుగుండు లాంటిది.
జాగ్రత్త ! ఖబడ్దార్ !
సాంద్రతరమై
నిబిడమై
భాషావిపిన
విటపీ వీధుల
గంభీరతకాదు
గుబురు గుబురుగా
పాదసక్యామల
పత్రాళితో
అలముకొంటున్న
నీరవనీరంధ్ర
భయదాంధకార
జీమూతాళి

యీ ప్రవరలోనే యింకొక చోట

జీవితమొక ఆస్వృతి
వ్యక్తా వ్యక్తం
గవాక్షంలోంచి
వీక్షిస్తే
మరోజగత్తు
పబ్లిక్ బయళ్లూ
వృక్షఛాయలూ
సెలయేళ్లగానం
ఇంకామీదికి
సముద్రకెరటాల హోరు
వినిపించి కనిపిస్తాయి.

మరొకచోట పదాలు.

పదాలు
పలకలుతీరిన
స్ఫటికపురాళ్లు
ఎన్నెన్నో ముఖాలతో
ఎన్నెన్నో జీవితానుభావాలు
సాక్షాత్కరింపజేసే
గతిభేదపు
గర్భగుళ్ల
పదాలు

ఎంత రమణీయ వర్ణన !

"రుధిర జ్యోతి"తో, ఈతకొడుతూ ముందుకు పోయాను. కనిపించింది "గడిపరక" నడవండి ! నడవండి నామీంచి నడవండి. అంటూ ఈ గడ్డిపరకను నిశితంగా పరిశీలించిన. నా అవగాహన పొందుపరుస్తాను.

గడ్డిపరక అంటూంది.
పూజాసమయాల
పూవును.
దూర్వాంకురాన్ని
అవుసరం తీరేక
అవతల కనబడితే
చుల్కనగా చూచేటి
గడ్డిపరకను
నడవండి
నడవండి
నామీంచి నడవండి.

తెలుగు జీవితంలో అందరూ వినాయకవ్రతం చేస్తారు వినాయకుడికిని విఘ్ననాయకుడని "దూర్వారయుగ్మం పూజయామి' అని గడ్డిపరకలతో పూజిస్తారు. కాని ఆ గడ్డిపరకనే నిత్య జీవితంలో కాలితో తొక్కుతారు. ఇక్కడ కవి, అట్టడుగువర్గాన్ని దూర్వాంకురంతో పోల్చడం విశిష్టం. అట్టడుగున వర్గం, కర్షకులు, కార్మికులు పూజార్హులకి పూజించే వేళ మాత్రమే స్మరించి [యీ పూజించే వేళ ప్రస్తుతానికి వర్తిస్తే ప్రజా ప్రతినిధుల ఎన్నికల సమయం] తరువాత వారి శ్రమదుమాదులను మరచిపోవడం వంటి దౌర్భాగ్యం కవి వర్ణిస్తున్నాడు.

గడ్డిపరక ఇంకా ఇలా అంటుంది.

పల్లకీ దిగినట్టి
పెళ్లి కొడుకులు మీ
పట్టు తివాసీని నేను
నడవండి
నడవండి
నా మీంచి నడవండి
గడ్డిపరకను !
గడ్డిపరకను !

పల్లకీ దిగినట్టి పెళ్లి కొడుకులు పెట్టుబడి దారి వర్గం. పట్టు తివాసీ గడ్డిపరకతో చేసినది. అట్టడుగు వర్గం జిగిబిగి అల్లిక. అట్టడుగు వర్గం వాడు నా మీంచి నడవండి అంటున్నాడు. ఎంత దయనీయమైన వర్ణన !

గడ్డిపరక తన గోడు యింకా వినిపిస్తుంది !

పశువుల నోటికి
పాయసాన్ని
మీ సుకుమార
పాదాల మకరికను
గడ్డిపరకను
నడవండి
నడవండి
నా మీంచి నడవండి

పశువులకు పచ్చగడ్డిపరకలు పాయసమే !

ఈ పాయసాన్ని తిని పశువులు, మనం పాయసం చేసుకోడానికి పాలిస్తున్నాయి. అలాగే, అట్టడుగు వర్గం, తమ శ్రమను ధారపోసి, ధనిక బూర్జువా వర్గాలు పాయసం చేసుకోడానికి గింలిస్తున్నారు. యీ శ్రమ జీవుల శరీరకష్టాన్ని మరిచి గడ్డిపరకజ

యీసడించు కుంటునట్టు, యీసడించుకుని బడుగు జీవులని తొక్కే-స్తున్నాం, అని, కవిభావన. రక్తాన్ని వుడికెత్తించే కమనీయభావం.

గడ్డిపరక గోడు ఆగలేదు. యింకా వినిపిస్తుంది.

మీ పైడి పాదాల
మృదు రజోలేశాలే
నా హృత్ కుశేయంలో
ఉల్కాపాతాలు." అంటుంది.

ధనిక వర్గం పాదధూళికలాలు అట్టడుగు వర్గం హృదయాలపై వుల్కాపాతం అంటున్నాడు కవి.

అయినా అట్టడుగు వర్గం అణగి, మణిగి, నడవండి నడవండి, నా మీంచి నడవండి అంటుంది. వుల్కాపాతాన్ని తట్టుకుందుకు ప్రయత్నిస్తూ!

యింకా గడ్డిపరక పాట వినండి

మాతృవర్గం వాడు
మా అన్న
పన్నగముల
రసనులు త్తరించిన
మిన్న.

ఎంత "ఎసర్టివ్" గా ఉన్నాయి. యీ మాటలు మొట్ట మొదటి మానవ సమాజం మాతృవర్గమే! పితృవర్గంకాదు. యీ విషయం మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ "వోల్గాసే గంగా" చదివిన వారికి క్షుణ్ణంగా విదితమవుతుంది. యీ ధ్వని నారాయణ బాబు గడ్డిపరక వినిపిస్తుంది గడ్డిపరకకు మత్రువర్గం అన్న దర్భ. ఈ దర్భ పన్నగముల రసన ఉత్తరించేదట. ఇక్కడ పఠితకు వురాణగాథ జ్ఞాపకం వస్తుంది.

గరుత్మంతుడు, తన తల్లి చెర విడిపించడానికి తనసవితన్నలు, పన్నగాలు, కోరినట్టు ఇంద్రుడినుండి అమృతభాండం చేజిక్కించుకొని దర్భపై ఉంచి తల్లిని విడిపించుకుంటాడు. ఇంతిలో ఇంద్రుడు అమృతభాండం చేజిక్కించుకొని చక్కాపోతాడు. పన్నగాలు దర్భపై చిలికిన అమృతపు బొట్లే చాలనుకొని నాకడానికి, నాలుకలు చాపుతాయి. పదునైన దర్భ, పన్నగాల నాలుకలు చీలుస్తుంది. అందుకే పాముల నాలుకలు చీలి ఉంటాయని పురాణగాథ. ఈ పురాణ గాథని, పెట్టుబడిదారి వర్గం బడుగువారి తిరుగుబాటును వర్ణించడానికి కవి వాడుకున్నాడు. రమ్యంగా!.

నేటికి మీ పితృకార్యంనాడు
పారణ మీద మీచేతి మీద
మరకత అంగుళీకమ్ము!
గతులు కల్పించేటి
గడ్డి పరకలము!
నడవండి!
నడవండి:

ఈనాటికీ బ్రాహ్మణ కుటుంబాలలో, క్షత్రియ, వైశ్య కుటుంబాలలో [క్షమించండి కుల ప్రసక్తి తెచ్చినందుకు యీనాడు కులమే సత్యం! మిగతాదంతా అబద్ధం] చనిపోయినవారికి స్వర్గలోక గతులు కల్పించడానికి తద్దినం పెట్టడం ఆచారం. ఈ తద్దినంపెట్టే సమయంలో పురోహితుడు, దర్భ గడ్డితో ఉంగరంలాచేసి, కర్త కుడిచేయి ఉంగరం వేలుకి తొడిగి "పవిత్రం కృత్వా" అంటాడు. భోక్తలకు అస్తోదకం వడ్డిస్తున్నప్పుడుకూడ యీ పవిత్ర దర్భ గడ్డి అంగుళీయకమ్ము కర్త చేతికుంటుంది. తద్దినం కార్యక్రమం చివరి వరకు యీ దర్భ అంగుళీయకమ్ము కర్త చేతిని వుండి కర్తను పవిత్రుణ్ణి చేస్తుంది. ఇది గమనార్హం.

ఇంక పిండ ప్రదానం. పారణం, పారణం అంటే ఉడికిన పెసరపప్పు, అన్నం, కూరలు, పిండి వంటలు వగైరాలు అన్నీ కలిపి మూడు వుండలు చేస్తారు. ఒకటి పితకి (మాతకి) యింకొకటి పితామహునికి (పితామహికి) మూడోది ప్రపితా మహుడికి (ప్రపితామహికి) నేలపై నీళ్ళతో ఆవు పేడతో శుభ్రం చేసి, దర్భ గడ్డిపరకలు పరిచి, వాటిమీద పారణం వుండలు వుంచుతారు. దర్భ గడ్డితో పూజిస్తారు. తరువాత పైవారికి నివేదిస్తారు. తద్దినం పవిత్ర దర్భ గడ్డితో సహా పెడితేనేకాని పితృ దేవతలకి ఉత్తమ లోకాలు సంభవించవని హైందవ సాంప్రదాయ ఆచారం. ఈ ఉదంతాన్ని, కవి, బడుగువర్గం, పవిత్రతని చాటి చెప్పేందుకు వినియోగించుకున్నాడు. దూర్వాంకురాన్ని, దర్భ గడ్డిని బడుగు వర్గాల ప్రతినిధులుగా చిత్రించారు. వారి పవిత్రతను ఎత్తి చూపుతూ.

అట్టడుగు వర్గం ప్రతీక గడ్డిపరక తన పవిత్రతను కళ్ళనీళ్ళతో ఉటంకిస్తూ నడవండి నడవండి నామీంచి నడవండి అంటూ హటాత్తుగా

మిన్ను విప్పిన
రక్త పతాకం
మన్ను సత్తువె
తెలిపింది
ప్రాభాత పశ్చిమాశలము
పాడిన పాట

కాకాసురుని కథ
జ్ఞాపకం తెచ్చింది
నన్ను నేను తెలుసుకున్నాను
ఆగండి !
ఆగండి ! అని గర్జించింది.

హటాత్తుగా వినిపించే గడ్డిపరక గర్జనే, సర్దేశాయి తిరుమల రావు గారి ప్రకారం, విప్లవం, ఇక్కడ మార్పు హటాత్సంభవం గనుక యిది మార్క్సియం.

గడ్డిపరకలో రేకెత్తిన యీ "అనామ్నెస్సికో రెస్పాన్సు" కి కాలజాలు మిన్నువిప్పిన రక్తపతాకం, పశ్చిమానిలపు పాట. కాకాసురుని కథ జ్ఞాపకం తెచ్చింది గడ్డిపరకకు. గడ్డిపరక అన్న దర్భ గడ్డి కాకాసురుని, ముల్లోకాలు తిప్పి, ముప్పతిప్పలు పెట్టి, మూడుసముద్రాల నీళ్లు తాగించి, ఆఖరికి శరణు జొచ్చినా, కన్ను పీకింది. అంతటి శక్తి తనకు వుందని బడుగు వర్గాల వారి ప్రతీక గడ్డిపరక, హటాత్తుగా పశ్చిమానిలం పాట విని తన్నుతాను తెలుసుకుంది. ఇక్కడ పశ్చిమానిలం పాట అంటే, 1798లో వుద్భవించిన ఫ్రెంచి రివల్యూషన్. 1917లో రష్యాలో రేకెత్తిన అక్టోబరు రివల్యూషన్ పతితకి జ్ఞాపకం వస్తాయి.

అట్టడుగు వర్గం ప్రతీక గడ్డిపరక ధనిక బూర్జువా వర్గం వారిపై ఆగండి ! ఆగండి ! అని గర్జించింది. పురాణగాథని యింత రమ్యంగా ఆధునిక విప్లవపంథా వర్ణించడానికి వాడుకున్న తెలుగుకవి బహుశః నారాయణబాబు ఒక్కడే ! నేమో ! యీ పదచిత్రణ, కవితలో వుపయోగించే సామర్థ్యం మరే ఆధునిక తెలుగు కవికి లేదని ఆచార్య రోణంకి వారంటారు. అది నిజమేననిపిస్తుంది. అనిపించడమేమిటి నిజమే !

ఆధునిక తెలుగు సాహిత్యానికి పిత, యుగకర్త కవిశేఖరుడు, గురజాడ అప్పారావు పంతులుగారి "క్రొత్త పాతల మేలు కలయిక" యిదే. "క్రొత్త వింతాకాదు పాతంతా రోతాకాదు" అన్నది తెలుగు నానుడి. యీ క్రొత్త పాతల మేలు కలయికే, కవి నారాయణబాబు, వాంఛించేదు, తన కవితా రీతిలో.

ఇందుకే, "ఒకే రంగంవారు, శ్రీరంగం నారాయణబాబు, శ్రీనివాసరావుల తీరులు వేరైనా, ఒకరికొకరు తీసిపోరని, ఆచార్య రోణంకి వారన్నది." శ్రీశ్రీ స్థూలదృష్టికి దొరుకుతాడు. నారాయణ బాబు కొన్ని సందర్భాలలో సూక్ష్మదృష్టికి కూడ దొరకడు. అనే రోణంకి వారివాదం కూడ యిందుకే !

ఇంతటి మహాకవి, నారాయణబాబు రుధిరజ్యోతిలో ఏమంటున్నాడో వినండి.

శ్రీ
పాటల కత్తులతోనే
నా హృదయం నెత్తురు తీసి
నే
వెలిగించిన
ఈ
దీపపుకాంతిని నర్తింపుమర
శ్రీ
శ్రీ శ్రీ !

శ్రీ శ్రీ అలాగే నర్తించాడనేది అత్యాధునిక తెలుగు కవిత్వ చారిత్రక సత్యం.

డాక్టరు ఎస్ గంగప్పగారి మాటలలో తెలుగు సాహిత్యాభ్యుదయాకాశంలో ప్రజ్వలించే జ్వలనా లలనా ప్రియుండు మాత్రమే కాదు ! ధృవతార నారాయణబాబు.

నా ఊహకి, నారాయణబాబు, అసలు సిసలైన భారతీయ విప్లవ ఋషి. పెట్టుబడిదారి వర్గం ప్రతినిధి భావకత్వంపై తిరుగుబాటు లేవనెత్తిన విద్రోహ కవి ! జీవితమంతా అట్టడుగు వర్గం వాడిగానే జీవించి, దేహం చాలించి, అమరుడైన, యీ విప్లవఋషికి, విద్రోహ కవికి, నా నమో వాకాలు.

ఈ వ్యాసరచనను ప్రోత్సహించిన ఆచార్య రోణంకి అప్పల స్వామిగారికి నా కృతజ్ఞతలు.

**శ్రీ బి. డి. బి. ప్రసాదరావు**

# వేములవాడ భీమకవి

వేములవాడ భీమకవి విషయమై ఆగష్టు 1984 "భారతి"లో ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు చేసిన విమర్శలోని కొన్ని అంశములకు సమాధాన మీయవలసి యున్నది.

"కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి ప్రచురణములోని (1936), ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఆకాడమి వారి ప్రచురణములోని (1982) పరిష్కృత పద్యమును పరికింపక, ఆరుద్రగారి సమగ్ర ఆంధ్ర సాహిత్యంలోని (1965) అపరిష్కృత, అర్థరహిత పద్యమును పట్టుకొని, వేములవాడ

భీమకవి జన్మ స్థలము వేములవాడ అని వాదమునకు దిగిన విమర్శకుడు...''

1983 జనవరి "భారతి''లో నేనుదహరించిన కొఱవి గోపరాజు "సింహాసన ద్వాత్రింశిక''లోని పద్యాన్ని చూచి కూడా అది ఆర్గుద్రగారి "సమగ్ర ఆంధ్ర సాహిత్యం" లోనిదని అదే నా వాదానికి మూలమని శ్రీ శ్రీరామమూర్తిగారు వ్రాయుటను 'అవిచార మూలక అకాండ తాండవ' మన వలెనో, సత్యాన్వేషణ తత్పరత అనవలెనో మరే మన వలెనో, విజ్ఞులు సెలవీయగలరు. నేనుదాహరించిన పద్యము ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి ప్రచురణములోనిదే. సమగ్ర ఆంధ్ర సాహిత్యము లోనిది కాదు.

'దక్షారామ భీమేశనందనుడన్' అని చెప్పుకొనిన "భీమకవి జన్మ స్థలము దక్షారామ పరిసరమగుట సంగతము" అని శ్రీరామ మూర్తిగారి ఊహ! దానికి "వేములవాడను వెలసిన అను పద్యము ప్రక్షిప్తమైనను ప్రమాణము కాఁగలదు'' అని ఊత!!

భీమకవిని లంకా విజయములో లక్ష్మణకవి 'పృథు కుకవి స్వాంత భీము'నిగా కీర్తించినట్లు నేను వ్రాసిన దానిని "లంకా విజయము చదివి వ్రాసినది కాదు" అని ఆచార్యులవారు వ్రాశారు. నిజమే "లంకా విజయము.'' ముద్రితప్రతి నేను చదువలేదు. అయితే ఆచార్యులవారి దివ్య దృష్టి కందినట్లు అది "ఆర్గుద్రగారి సమగ్ర ఆంధ్ర సాహిత్యం మాత్రమే చూచి" వ్రాసినది కాదు. నా వ్రాతకు ఆధారము మద్రాసు ప్రభుత్వము వారిదివరలో ప్రచురించిన డిస్క్రిప్టివ్ కేటలాగు పుట 957. ముద్రిత ప్రతికి మూలాధార మనదగిన కాగితపు ప్రతిలో 'పృథుకు కవిస్వాంతభీము'డుగా మార్చి ముద్రించ వలసిన ఆవసర మేల కలిగినదో? గోపరాజుకు భీమకవిపై 'అంతస్తాపమైన కోపమే' ఉన్నయెడల 'భీముని నుతభీముని బలభీము విమత భీముని' 'చతుర హృద్యాన వద్య గద్య పద్య విద్యా విద్యోతితులయిన కవీశ్వరు'లలో ఒకనిగా తలంచునా? 'సత్యనారన' అన్న పేరుగల తన తాత 'భూమిని మించిన భీమన నామంబున బరగె'నని సగర్వముగా చెప్పుకొనునా?

మధ్యాక్కర గురించి నేను వ్రాసిన దానిని శ్రీరామమూర్తిగారు వ్రాసిన విమర్శను చదివి సత్యమును నిర్ణయించు కొనవలసినది పాఠకోత్తములే.

"మధురాక్కరయందు కంటె అంతరాక్కరయందు తేటగీతి నడక అధికముగ కలదు" అని శ్రీరామమూర్తిగారి ఉవాచ. యతి విరామ స్థానాన్ని గమనించి చదివినపుడు తేటగీతి నడక మధురాక్కరలో గలదో, ద్విపద నడక నడిచే అంతరాక్కరలో గలదో "ఛంద శ్శాస్త్ర పరిజ్ఞానము" గలవారు తేల్చి చెప్పగలరు.

క్రీ. శ. 13వ శతాబ్దినాటి కందూరి చోడుల శాసనములను ప్రకటించిన శ్రీ శాస్త్రిగారు ఆకాలంలో "కందూరినాడు" ఈ రాజుల ఏలుబడిలో లేకున్నను ప్రశస్తి మాత్రము కందూరి చోళులనియే యున్నది" అని వ్రాసిరి. శ్రీ శాస్త్రిగారి చేత కందూరి చోళులుగా పేర్కొనబడినవారే ఏఱువ చోళులుగా శ్రీ శర్మగారి చేత చెప్పబడినారు. కనుకనే నేను "భావి పరిశోధనలే సత్యమును నిర్ధయింప గలవు'' అని అక్టోబరు 83 "భారతి"లో వ్రాసితిని.

మా యీ వ్రాతలలోని గుణ దోషములు సత్యాన్వేషకులైన పరిశోధకులు నిర్ణయింతురు గాక!

శ్రీ సూర్యదేవర రవికుమార్

# స్కూల్ ఆఫ్ కరస్పాండెన్సు కోర్సెస్

ఆంధ్రా యూనివర్శిటీ వారు 'స్కూల్ ఆఫ్ కరస్పాండెన్సు కోర్సెస్' తరఫున విద్యార్థులకు అందజేస్తున్న తెలుగు నోట్సు చదువుతుంటే ఉన్న మతికూడా పోయేటట్లున్నది. ఇది వారు పండితులచేత వ్రాయిస్తున్నారో, పరీక్ష తప్పిన విద్యార్థుల ఆన్సర్ పేపర్లనుంచి ఎక్కిస్తున్నారో అర్థం కావడం లేదు. వీరి ఆస్థాన పండితులు వ్రాసిన అపరిశీలన జనిత నిరర్థక రచనలకు తోడు అసలు వాక్య స్వరూపమే తెలియరాకుండా విశృంఖలంగా ముద్రణదోషాలు. ఆంధ్రవాఙ్మయాన్ని అధ్యయనం చేసే విద్యార్థులకు ఇటువంటి అవకతవక నోట్సును పంపండంకన్నా, ఎవరికి వాళ్లే తయారు చేసుకోమని నిర్దేశించటం మేలు.

'భారతి' పాఠకుల పరిశీలనార్థం వీరి నోట్సునుండి కొన్ని భాగాలను ఉదాహరిస్తున్నాను. ఏ వ్యాఖ్యానమూ అవసరం లేకుండానే వీటి తత్త్వాన్ని పాఠకులు గ్రహింపగలరు :

బి. ఏ. మూడవ సంవత్సరం : పేపరు - III

(ఆంధ్ర వాఙ్మయచరిత్ర సంస్కృతి)

శాస్త్రమునకు పూర్వము జనించిన రహస్యవిషయము శాస్త్ర విషయము. (పాఠం నెం. 1 - పుట 8)

రసప్రధానానందదాయకములైన కావ్యములు సాహిత్యా కోవకు చెందును. (1-2)

అలంకారిక రచననో, సర్వజనాను రంజకత్వముతో, భావ నాత్మకాహ్లాదముతో కవియొక్క ఆత్మీయతను ప్రదర్శించు గ్రంథమే కావ్యమని సారాంశము. ఇట్టి కావ్యచరిత్రను సాధారణ వాఙ్మయచరిత్ర యందురు. [1-8]

విశ్వామిత్రుడు తన పంపు నిరాకరించిన పుత్రులను..." [3-1]

వాని యందు గద్యములు పద్యములు మరియు గద్య పద్యము లతో కూడిన కవిత్వము గోచరించును. [3-13]

జితేంద్ర పురాణమును పద్మకవి రచించెను. [3-14]

మార్గవులే దుర్మార్గపదవర్తులు. మార్గకవులు కారు [5-9]

"శైలి"యను పదము అలంకారశాస్త్రములందు కనిపింపదు. శీలవంతుని భావకర్మను శైలి యందురని నిఘంటువున గలదు. మనో వ్యాపారము భావకర్మ. ఇదియే శైలి. భావము మాటల ద్వారా వ్యక్తమగును. మనోవ్యాపారమైన భావగతి శబ్దగతిగా మారి ఆంగ్లమున 'స్టైల్' అను అర్థమున ప్రయోగింపబడినది. ఈ శైలి కల్పితము. దీనిని పెక్కు విమర్శకులు సరణి, తిరు, రీతి అను పదములుగా వాడుచున్నారు.

వస్తువిన్యాసము కావ్యశైలి, శబ్దవిన్యాసము పదగుంఫన శైలి అను రెండు విధములు శైలి.

కథలతో నున్న కావ్యములందు ఆఖ్యానశైలి, సంవాదరూప కావ్యములందు నాటకీయశైలి అని శైలి మరల త్రివిధము. ఈ మూడును పరస్పర సంబంధము కలిగి కావ్యములందు భాసిల్లును. [8-1]

నన్నయ భారతమునే గాక చాముండి విలాసము, ఆంధ్రశబ్ద చింతామణి, ఇంద్రవిజయము, లక్షణసారము, రాఘవాభ్యుదయము, అను గ్రంథములను కూడ రచించెను.

అవి "వాని" కృతములవునో కావో పరిశీలింప తగును. చాముండిక అనగా పార్వతీదేవి చాళుక్యులకాదేవి కులదైవము. ఆమె పేరిట రచింపబడిన గ్రంథము శ్రీరాముని కంకితమీయ బడినది. రాజ నరేంద్రుని కంకిత మీయబడిన కారణ మనూహ్యము. [10-1]

నన్నయకు తరువాతి వాడు కవి భల్లటుడు. ఇతడు తన విక్రమార్క చరిత్రమునందు నన్నయను స్తుతించెను. [10-8]

ఇవి కేవలం కొన్ని ఉదాహరణలు మాత్రమే. మహాకవులను ఉద్దేశించి 'వానిని' 'వానికి' అనేక పర్యాయాలు వాడారు. ఇది పాపం ఆధునికులకు కూడా తప్పలేదు.

"నన్నయయే చింతామణిని రచించెనని శ్రీ వజ్ఝలచిన రామస్వామిశాస్త్రిగారు నిర్ధారించిరి. వాని భావము లిట్లున్నవి." [10.

పాపం గురజాడ అప్పారావుగారికి కూడా ' వాని కవిత్వపే [2-.

అలాగని గౌరవర్థకం అసలు వాడకపోలేదు లెండి :

"జక్కన విక్రమార్క చరిత్రము రచించి సిద్ధనామాత కంకితమిచ్చెను. ఇందు విక్రమార్క మహారాజుగారి మహత్తరక ములు వర్ణితము" [2-1

ఈ 'నోట్సు రచయితల' సత్వంకష ప్రౌఢికి కొన్ని ఉ హరణలు :

ఆత్మీయతా పదార్థ సందర్శనము [1-1
ప్రతిపాది శబ్దార్థత [1-
భావనాత్మకనిర్వృత్తి [1-
నూత్న ప్రక్రియా పంటలు [2-
ప్రఖ్యాతసంతము [2-1

'శృతి' అని ఉండాలో 'క్రతి' అని ఉండాలో అనుమా వచ్చి, ఎందుకయినా మంచిదని రెండూ ఉంచారు.

కృతి [4-

ఈ పేరాగ్రాపును వ్యాఖ్యానించి ఎవరయినా పుణ్యంకట్టుకో బాగుండును :

అసలు మానవ జీవితమునకు ప్రకృతియే ఆధారము. అ ఆంతరంగికమైన వివిధ ప్రవత్తులను ప్రకృతియే ఉద్దీపింపచేయు అపుడు మానవ హృదయము ఎట్లు స్పందించునో ? అంద సంచలనము కల్గునో గదా ! కొన్ని వేళలందు ఆనందమయగుము మరి కొన్ని వేళఅందు దుఃఖమయమగను, ప్రకృతి మాన భావనాదృష్టికి కనిపించును. సృష్టియంతయు హృదయానుభూతుల భావములకు చేతన వస్తువువలె గోచరించుచు నాక పతీక రాణించును. అట్టియెడ రసార్ద్ర హృదయుడైన మానవుని నోటినుం అవ్యక్త శబ్దార్థములు వెలువడును. అది ఛందోబద్ధమై యుం వచ్చును ఇందుకు వాల్మీకియే సాక్ష్యాధారము." [4-2

ఉదాహరణకోసం ఒక్క పేపరు నోట్సునుంచే అక్కడక్క చూపించాను కాని ప్రశ్నప్రశ్నా, సమాధానమూ ఇలాగే ఉంటుంది. ఈ దుర్గమవిద్యారణ్యంలో పాపం తెలుగు విద్యార్థులకు దారిచూపిం నాథుడు లేడా ?

ధనికొండ ప్రసాద్

# ప్రపంచ భాషలకే సంస్కృతము మూలము

సంస్కృతమే మొట్టమొదట ప్రపంచము నందంతటను నుండిన ఏకైక భాష. ఎట్లనిన? మనుష్యులు మాటలాడు భాషలు ప్రస్ఫుటము లైన వివిధవర్ణోచ్చారణము కలవి. మనుష్యులకు మానవులని మఱి యొక పేరున్నది కదా? మానవు లనగా మనువుయొక్క సంబంధు లని యర్థము. మనువు దేవత. కాన మనువుదియు సంస్కృతమే. అట్టి సంస్కృతము మాటలాడు మనువుకుఁ జెందినవారున్ను ఆభాషయే వ్యవహారములోఁ గలిగియుండుట సహజము. కనుక ప్రపంచములోని సర్వదేశములవారికి సంస్కృతమే వ్యవహార భాషగ నుండెడిది. అది బహుకాలము గడువ ఆయా దేశములలోని శీతోష్ణ వాతావరణ తారతమ్యము కారణముగ నుచ్చారణమునందు పెక్కు రకముల తేలికమైన ఆ యుచ్చారణయే మెల్లె మేకయి నిలచిపోయిన రీతిగ స్థిరపడిపోయినది. కనుకనే బిడ్డలలో కనినవారి మొక్కట్లు ఉండినట్లు సంస్కృతమునుంచి భ్రష్టములై యేర్పడిన వివిధ దేశభాషలలోను ఆ సంస్కృతము యొక్క ఛాయ కలిగియున్నది. నేడంతర్జాతీయ భాషగా చెలామణి యగుచున్న ఇంగ్లీషు భాషలో సైతము పై కారణముచేత సంస్కృత తద్భవములు పలు కనుపించుచున్నవి. ఉదాహరణము:- శర్కరా-షుగర్, హృత్-హార్ట్, గౌః-కౌ, పితృ-ఫాదర్, మాతృ-మదర్, భ్రాతృ-బ్రదర్, స్వసృ-సిస్టర్, మంత్రి-మినిస్టర్, మిశ్ర-మిక్చర్, నిట్-నైట్, ద్యు-డే, హరి-హార్సు, వార్-వాటర్, మేధః (మేధా) మైండ్, నో-నో, మున్నగాఁ గలవి అసంఖ్యములుగ నున్నవి. ఇట్లే మహమ్మదీయ భాషలలోను సంస్కృతములోని మోటకః మున్నగు శబ్దములు అలవాటులో నుండి కాలక్రమమున షోడాం మున్నగు విధమున వికృతరూపముతో మాఱిపోయినవి. ఇట్లు మాఱిపోయిన వెనుక ఆంధ్రాది భారతీయ భాషలయందువలెనే ఆ భాషలయందును కొన్ని దేశ్యపదములు కాలక్రమమున నుత్పన్నము లైనవి. భారతేతర దేశములు కర్మభూములు కామింజేసి కర్మలయం, దపభ్రంశము రాకుండ వాడఁదగిన సంస్కృతము దాని స్పష్టోచ్చారణములోఁ బనిలేక యాదేశవాసులు అచ్చటచ్చటఁ గలిగిన ఆ సంస్కృతము యొక్క అపూచ్చారణమునే అవలంబించి సాగిరి. ఇంకను భారతదేశ మనిన కర్మభూమి కనుక యిచ్చటను మాటలాడ రాదని శాస్త్రమును విడుపని వారు కావున సంస్కృతములో లఘూచ్చారణమ్ము క్రమముగ భారతీయ లపభ్రంశమును మాటలాడరా నెడు శాస్త్రమును విడువని వారు కావున నా లఘూచ్చారణమును బహుకాల మలవాటులోనికి రానివ్వక శుద్ధమైన సంస్కృతమునే మాటలాడుచుండిరి. ఈ కారణముచేతనే మొట్టమొదట సమస్త శాస్త్రములు శాస్త్రగ్రంథములు ప్రజల వాడుకలో నుండు సంస్కృత భాషయందే రచియింపఁ బడినవి. లేకున్న సంస్కృత భాషయందే గ్రంథరచన యేల ఆరంభమాయెను. అది ప్రజల వాడుకభాష కనుకనే సర్వజనోపయోగార్థము సకలశాస్త్రగ్రంథములు మొదట సంస్కృత భాషలో నేర్పడినవి. ముఖ్యముగ ప్రజల మనస్సును రంజింపఁ జేసెడు నాటకములు సంగీతము అట్టి నాటకములు సంస్కృతమునందే యేర్పడిన వనుచో ఆనాడు సంస్కృతము ప్రజల భాష కాకుండిన నేల వాని యందు నాటక రచన సంగీతము లేర్పడియుండును. మనోవినోదము కేవలము పండితులకు కొఱకే కాదుకదా? పెక్కుభాషలు, పెక్కు మతములు, పెక్కు రాజ్యములు కలిగియున్నను ఇంతదేశము కొన్ని వందల ఆమడల ద్వీపములనుండి వచ్చిన పాశ్చాత్యులకు దేశ మొక్కటియే యొక్కటిగనే యుండఁదగినదని యనిపించి యట్లే యేలిరి. ఈ సంస్కృత భాషా ప్రభావమే అనేక భాషలు కల అనేక రాష్ట్రములలో కాశ్మీర కన్యాకుమారి మధ్యవర్తి యైన యీ మహాభారత భూఖండమునందు సమస్త జనులు స్వార్థముగఁ జేసుకొనెడు జపతపాదులు, పరార్థముగ సలిపెడు దేవతా ప్రతిష్టాదులు దేవాలయములలో పూజలు పునస్కారములు, మున్నగునవి. యజ్ఞయాగాదులు, సంధ్యాది నిత్యకృత్యములు. పుట్టిన బిడ్డకు బారసాల మొదలుకొని చచ్చిన వానికి పదమూడవనాడు జరిపెడు వైకుంఠ తదీయారాధన వరకు నుండు సర్వ సంస్కారములు, వాటిని ప్రాయశ్చిత్తములతోడ బోధించు మనుస్మృతి, పరాశరస్మృతి మున్నగు ధర్మశాస్త్రములు, రామాయణ, భాగవత, భారతము అవి ఇవి యననేల వీరి సంస్కృతి యంతయు సంస్కృతమునందే యుండుట దేశైక్యమునకు గొప్ప కారణము.

ఇట్లు దేశముయొక్క ఐకమత్యమునుఁ గూర్చిన యీ భాషామతల్లిక యందలి శాస్త్రసంపత్తి వైపు కొంచెము చూపు మఱల్చెదము. భాషాపరిజ్ఞానమునకు సమగ్రమైన సాహిత్యసంపద కలదు. వినోదమునకెంతయో కవిత్వ మున్నది. విజ్ఞానమునకు గణితము, జ్యోతిషము, సైన్సు కలవు. ఆరోగ్యము, ఆయుర్వృద్ధులకు ఆయుర్వేద మెంతయో కలదు. వైద్యముతో నెమ్మదించని రోగములను మాన్పుటకు సర్వసౌఖ్యములను పొందునిమిత్తము శాంతి కర్మ విపాక శాస్త్రములు కలవు. విశిష్టమైన అర్థశాస్త్రము(రాజకీయ) శాస్త్రము కలదు. ఆచార వ్యవహారముల నెఱిగించు ధర్మశాస్త్రము కలదు. దేవతా ప్రసాదసిద్ధికి మంత్రశాస్త్రము కలదు. మంచినీళ్ళు, ఉప్పునీళ్ళు, లోహములు, పాదరస గంధకాదులు, రత్నములు మున్నగు నిధులనుఁ గనిపెట్టు శాస్త్రములు కలవు. రామాయణ భారత, భాగవతాది

అనేక పురాణములు మున్నగు పలుదేశ చరిత్రములు కలవు. పాశ్చాత్య పరిపాలనకు ముందు రాజతరంగిణి దేశచరిత్రలు కలవు. మోక్షమును పడయు నిమిత్తము వేదాంత శాస్త్రము కలదు. అందులో అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతము (మాధ్వము) అను పెక్కు నీతిశాస్త్ర గ్రంథము లున్నవి. ఇట్లిఱువది నాలుగు శాస్త్రములు అఱువది నాలుగు తంత్రములు మొత్తము నూటయఱువదెనిమిది శాస్త్రములు సంస్కృత భాషనుఁ గలవు. ఇట్లు శాస్త్ర సామగ్రియు నీ భాషయం దనంతముగఁ గలదు.

ఇట్లు సుసంపన్నమై మహోపకారమై సంస్కృత భాష పునరభివృద్ధిఁ జెందుటకుఁగాను ప్రభుత్వమువారు సంస్కృత పండితులకు ఉచిత వేతనముల నేర్పఱచుట చాల ముదావహము. ఇఁకను నిది యభివృద్ధిఁ జెందుటకు దీనిని చదివిన యుపాధ్యాయులకు చదువని ఉపాధ్యాయుల కంటెను జీతమును కొంచె మధికముగ నొసంగ దగిన మిగుల మేలు. దేవస్థానములపయి నధికారులు అర్చకులు నధ్యాపకులుగ నియమించుట దీనిని చదివినవారినే నియమించఁ దగును. ఈ సంస్కృత భాషను చదివినవారికి యింగ్లీషు చదివిన వారితో సమానముగ ప్రభుత్వపు ఉద్యోగములను జీతములను నిచ్చుచు, నేర్పఱచిరేని యీ సంస్కృతము మిగుల అభివృద్ధిఁ జెందఁగలదు. కావున ప్రభుత్వము వారు యీ సంస్కృతభాషాభివృద్ధికిఁగాను తగిన చర్యలు తీసికొనెదరని యాశించుచున్నాను. అమృతమైన అమరభాషకు సర్వతోముఖాభివృద్ధిఁ గలుగుఁగాక.

శ్రీ విక్రాల శేషాచార్యులు, కలికివాయి.

# బైరంపల్లె తిరుమలరాయ కవి

గోలకొండ కవుల సంచికలో స్థల, కాలనిర్ణయం స్పష్టంగా తెలియని కవులలో ఇతడొకడు. పూర్వ కవి పరిచయంలో 52వ వాడుగా చెప్పబడినాడు. ఇతని నివాసం గద్వాలయని సురవరం వారు చెప్పినారు.

బైరంపల్లె యిపుడు కలువకుర్తి తాలూకాలో ఉంది. 12-5-1982 నాడు నేను మిత్రుడు ఎం. రంగారావుగారు కలిసి దుందుభీ తీరాన్నిచూస్తు అక్కడికి వెళ్ళి ఊరివెలుపల ప్రాచీనాలయం ఒకటి ఉందని విని చూడటానికి వెళ్ళినాము. అది విష్ణ్వాలయం. లోపల మూలవిరాట్టుతోసహా గుడి చెక్కుచెదరలేదు. దాని గర్భాలయ ద్వారంపై ఈ విధంగా వ్రాయబడిఉంది.

"పైవరస"

మరిదియని కృష్ణుడావీర మాన్యుడైన నరునిగాపాడ రథము నడుపుట విని తమ్ముడగు కృష్ణరాయండు తగ తిరుమల రాయు జేష తన్మనోరథము నడిపె.

"క్రింది వరిస"

శ్రీకర బైరంపల్లె వంశదుగ్ధాబ్ధి రుచిర సంపూర్ణ చంద్రుడ శేషయ గోదాంబ చిరతపః ఫలరూప ...... గోత్ర పావన శ పుత్రుడైన తిరుమల రాయ సుధీమణి తార్తీయ చతుర్థకాశ్రమ స ద్ధర్మ సమితి యథారచిత ...... నీ స్థలి క్రమంబున సల్ప బంధంబుల నడంప గోరి ఈ వనకాసార సౌధ హరిహరాల సంస్థాపన కార్యర్చన జేసె ఘటికారశక-1181 శశిక్షితి దిగవస లను......కృష్ణార్పణము.

దాని మండప ద్వారంపై మరల ఇటుల వ్రాయబడిఉంది.

హరి సిరినిగోరి కల్యాణమాడి తనకు నురు సిరులతోడి కల్యా మొనగునని త దర్పణము కృష్ణ తిరుమలార్య వరుల ... దిరి జం దివ్య కల్యాణ మంటపంబు"

ఈ కల్యాణ మంటపం బైరంపల్లె శేషయ్య గోదమ్మ గా కుమాళ్ళయిన కృష్ణరాయ తిరుమల గారిద్దరు శ్రీ కృష్ణార్పణము కట్టించిరి. శాలివాహనశకం 1811.

ఇది చూచిన పిమ్మట మేము గ్రామంలోనికి వెళ్ళి విచారించినావ పూర్వమా పేరుండే అన్నదమ్ములున్నారట. తిరుమల రాయ సన్యాసం స్వీకరించి ఆ ఆలయం గట్టించి అక్కడే ఒక తోటను బెం ఆశ్రమం జేసికొని కొంతకాలం నివసించినాడట. ఆ విషయం శాస గూడా చెబుతూనే ఉంది.

శాసనాన్ని బట్టి అది హరిహరాలయం కాబట్టి ఈ ప్రాంతం హరిహరాలయాలులేవు. అందుచేత యిది ప్రత్యేకంగా గణింపదగింది ఉంది. అన్నగారాలయం కట్టించగా పిమ్మట తమ్ముడు గారు మం పానికి పూనుకొన్నట్టున్నాడు. దాని పక్కనే ఆనాటికాసారం గు ఉంది.

గోలకొండ కవుల సంచిక అతనిని క్రీ శ. 1896 ప్రాం వాడన్నది. కనుక పైశకం దీనికి మిక్కిలి దగ్గరగాఉంది. అందుచే శ్రీ ప్రతాపరెడ్డిగారు పేర్కొన్న కవి యితడే యనుటలో సందే ముండదు. కవుల సంచికలో ఇతని ప్రత్యేక పద్యాలేవీ లేవు గాని పద్యాలు యితని రచనమే కావలెను.

ప్రస్తుతం మహబూబ్‌నగర్‌లో బైరంపల్లెవారి వంశ మొకటి ఉంది. ఆ వంశీయుడు రాఘవేంద్రరావుగారు లోకల్‌ఫండులో సీనియర్ ఆడిటర్‌గా (మహబూబ్‌నగర్‌లో) ఉన్నాడు. ఆయన దగ్గర వారిది అయిదు తరాల వంశ వృక్షం ఉంది. దానిలో మూడవ తరంలో ఒక శేషగిరిరావు ఉన్నాడు. ఈ తిరుమలరాయని తండ్రి శేషయ్య ఆ శేషగిరి ఒక్కడో కాదో తెలియదుగాని కాలం ఇంచు మించుగా సరి పోతుంది.

ఈ బైరంపల్లెకు సమీపాన అమ్మపల్లె దాని అవతల నెక్కొండ అనే గ్రామాలున్నవి. ఇవి దుందుభీ తీర గ్రామాలు. మొదట లోకయ్య పల్లె దొరలకు ఉండి తరువాత వనపర్తివారికి చెందెనట కనుక ఈ అమ్మపల్లె ఏ రాణిగారి పేర వెలసిందో తెలియదు.

నెక్కొండ మిక్కిలి ప్రాచీన గ్రామం ప్రస్తుత మక్కడ గల కొండపై తిరుమల నాథాలయం ఉంది స్వాతంత్ర్యపు తొలినాళ్ళలో ఆ ఆలయాన్ని ఆంధ్ర ప్రాంతీయుడైన ఒక వైశ్యుడు వచ్చి నివసించి హరికథలు జెప్పుకుంటు తన ఆదాయంతో దాన్ని పునరుద్ధరించి అక్కడొక హనుమదాలయం గూడ గట్టించినాడు అతని పేరు నాగ దాసు. అతని కృషి అక్కడ ప్రశంస నీయమయింది.

ఈ కొండక్రింద దుందుభీ వంపు తిరిగి పారుతుంది. అది మిక్కిలి మనోహర దృశ్యం. దీని కెదురుగా "చేరుగట్టు" యని మరో కొండఉంది. దానిపై మరో సుందర విగ్రహ ముండెనట. ఒకప్పు డెవరో జీపులో వచ్చి దాని గొని వెళ్ళినారని గ్రామస్థులు జెప్పినారు. ప్రస్తుతం తిరుమల నాథుడున్న గుట్టక్రింద ఇంకో శిథిలాలయం ఉంది దాని చెంత ఒక ప్రాచీన శాసనముంది. అది జయంతిపుర చాళుక్యు లను పేర్కొంటుంది. భువనైక మల్లుని 46వ రాజ్యవత్సరంలో ప్లవ సంవత్సర శ్రావణ అమావాస్య గురువారంనాడు వేయింపబడింది. అది దాదాపు శా. శ. 1048 క్రీ. శ. 1121కి సమానం. ఈ శాస నమే గాక గుట్టననుసరించిన బండి దారి కవతలి వైపున మరో రెండు గుండ్లపై గూడ ఏవో శాసనాలు చెక్కబడిఉన్నవి వాని లిపి కొంత స్పష్టంగా ఉంది. మొదటి శాసనం తెలంగాణా శాసనాలు మొదటి సంపుటంలో ఉందిగాని ఈ శాసనాలు దానిలో చేరలేదు. ఎందులకో వానిని నేను చూసినాను కాబట్టి తెలుపుతున్నాను. అవి చదువ బడితె స్థానిక చరిత్రకు ఉపయోగపడవచ్చు.

నెక్కొండ గ్రామం స్వాతంత్ర్యానికి పూర్వం రెడ్డి రెడ్డి వారి సీరీగా ఉండెనట. మాకీ ఆలయాలు చూపి వాని వృత్తాంతాన్ని ఆర్. రాజవర్ధన రెడ్డిగారు వివరించినారు. వారికి మా కృతజ్ఞతలు.

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# సంస్కృత కావ్యాలలోనే దోషం - ఇతరత్రా గాదు.

నేను నవంబరు భారతిలో 'సంభాషణలో చిన్న చిన్న పొర పాట్లను గూర్చి చర్చించాను. అందులోని కొన్ని పదాల విషయంలో శ్రీ యస్. టి. పి. వి. రామానుజాచార్యులు గారు తమ అభిప్రాయా లను వెలిబుచ్చారు. అందులో వారు నిర్దేశించిన విషయాలపై వ్యాస కర్తనైన నేను నా అభిప్రాయాన్ని తెలుపుచున్నాను.

క్రమపరిణతి చెందే భాషలో వ్యవహారానికై అన్య భాషా పదా లను స్వీకరించడం తప్పు కాదనే నేనంటున్నాను. కాని పదాల సాధుత్వా సాధుత్వాలను వ్యాకరణం ద్వారా తెలుసుకోవడం చాలా అవసరం. తెలుసుకొని వ్యవహారంలో చొచ్చుకొన్న పదాలను అలాగే స్వీకరించవచ్చు. ఇది సంస్కృతానికితప్ప అన్నిభాషలకు చెందుతుంది. సంస్కృతం వ్యావహారిక భాషగా ప్రస్తుతం లేకపోవడం వలన యీ నాటికీ నియమాలు సడలక సాధుపదాలు, అసాధుపదాలు అలాగే ఉండి పోయాయి. పాణినీయానికి కట్టుబడని ప్రయోగాలున్నా అన్నిటినీ ప్రయోగించే స్వేచ్ఛ యితర భాషలలో ఉన్నట్లు ఈ భాషలో మనకు లేదు. పెద్దలు చేసినది శక్తి వలన తిరస్కృత మవుతుందనీ మనం చేస్తే దోషమేనని ధ్వని కర్త చెప్పాడు గదా.

త్రియంబక పదాన్ని, సుస్వాగత పదాన్ని కాళిదాస వాల్మీకులు వాడారని మనం వాడవచ్చా? ఈ పదాలనుగాని, రామాయణం, భార తంలోని అనుపసర్గ పూర్వకంగా "ల్యప్" ప్రయోగాలనుగాని నేటివరకు ఏ సంస్కృత గ్రంథకర్త వాడలేదు. సంస్కృతంలోని 'శార్వరస్య తమసో నిషిద్ధయే' మొ॥ ప్రయోగాలు తప్పేనని వైయాకరణులు తేల్చారు. ఆర్షప్రయోగాలకు తప్పులేదుగాని ఇతర సంస్కృత కవులు వాడితే తప్పే. సంస్కృత కావ్యాలలో ఆ పదాలు తప్పుగాని తెలుగులో తప్పులేక పోవచ్చు. ఆంధ్రం వ్యావహారికం గనుక తప్పులేదు.

విశ్వనాథవారి తెలుగులో "పునీత" శబ్ద ప్రయోగం సాధువు కావచ్చు. కాని పునీత శబ్దం సంస్కృతంలో ఇప్పుడు వాడినా దోషమే. కవులు నిరంకుశులుగదా యని మనం గూడ నిరంకుశులమవుతామా? విశ్వనాథవారి 'గుప్త పాశుపతం' అనే సంస్కృత గ్రంథంలో శాస్తికి బదులు శాసతి అనడం నిరంకుశతయేగదా. మహాకవులకు నిరంకు శత్వం భూషణం కావచ్చు. మనకు కాదు.

సంస్కృతం గ్రంథరూపంలో ఉంటే సాధుపదాలే అలంకారం. తెలుగులాగ సంస్కృతం మనం మాట్లాడుతూ ఉంటే ఏ పదాలు వాడినా దోషం కాదు. భాషాభివృద్ధికి కారణ మవుతుంది. ఈ భాష లోకి కూడా అన్య భాషా పదాలు రావడం తప్పుకాదు.

శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యం

# గ్రంథ విమర్శలు

## గురునాథ రామాయణము

[బాల అయోధ్యా కాండములు, రచయిత: ఉభయభాషా ప్రవీణ, విద్వాన్ శ్రీ అయినంపూడి గురునాథరావు, డెమ్మీ సైజు. 20 + 127 + 168 పేజీలు. వెల: సాధారణ ప్రతి రు. 20 లు. మేలుప్రతి రు 25 లు. ప్రతులకు: రచయిత 26/241, సర్కిల్‌పేట, మచిలీపట్టణము.]

దీనిని రచించిన గురునాథరావుగారు సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు, హిందీభాషలలో పండితులు. చక్కని కవిత్వం చెప్పగల వారు. కొందరు మిత్రుల ప్రోత్సాహంతో ఆయన మొదట రామాయణంలోని సుందరకాండను రగడ ఛందస్సులో రచించారు. దాని ముద్రణకు తిరుమల-తిరుపతి దేవస్థానాల వారి ఆర్థిక సహాయం లభించినది. అది అందరి ఆమోదాన్ని పొంది, రచయితకు ఇతర కాండల రచనకు ప్రోత్సాహాన్ని కలిగించింది.

రామాయణాన్ని చాలా మంది చాలా విధములుగా రచించారు. వచనాలు, ద్విపదలు, పద్యములు, కీర్తనలు మొదలైన రీతుల్లో రామాయణాలు కానవస్తున్నవి. గానానికి అనుకూలమైన ఛందస్సులో వ్రాయబడినవి స్వల్పంగానే ఉన్నవి. ఇది ప్రజామోదాన్ని పొంద డానికి 'రగడ' లో ఉండడం ఒక కారణం కావచ్చును. రచయిత, ప్రజానీకం యిచ్చిన ప్రోత్సాహాన్ని పురస్కరించుకొనే మిగిలిన కాండ లను కూడా అదే పద్ధతిలో వ్రాయడానికి పూనుకున్నారు. ఆయన రచించిన "బాల-అయోధ్యా కాండలు" ఈ పుస్తకంలో ఉన్నవి. దీని ముద్రణకు కూడా తిరుమల-తిరుపతి దేవస్థానాల వారి ధన సహాయం లభించినది! ఇది సులభశైలిలో ఉన్నందువల్లనే ప్రజామోదాన్ని పొందడం, సుందరకాండ రెండవ సారి కూడా అచ్చుపడడం జరిగింది.

సాహిత్య విద్యా ప్రవీణ, ఆర్షవిద్యాభూషణ, మధురకవి మల్లా ప్రగడ శ్రీ రంగారావుగారు, సాహిత్య విద్యా ప్రవీణ.బిరుదాంకితులు, బహుభాషావేత్త, కోట సుందరరామశర్మ (ఎం. ఏ., ఎం. ఓ. ఎల్, ఎం. ఇ) గారు దీని ప్రాశస్త్యాన్ని వెల్లడించారు. మచ్చునకు

"విగత తంత్రియగు వీణయ మ్రోగదు
నడువదు రథము వినాకృత చక్రము
సుతశత ముండిన సుదతికి కాంతుడు
లేకున్నను సుఖలేశము సుండదు.
అనార్యులగు నంగనలకు నాకును
సాటి గట్టకుము; చంద్రుని ప్రభవలె
వదలక, ప్రాణము ప్రాణమ్ముగ జూ
తును నా కాంతుని పనులందైనను." [పుట 64]

శ్రీ బులుసు వేంకట రమణయ్య

## మహాభాగవత కల్ప కుసుమమాల

[కూర్పరి: డాక్టర్. శ్రీమతి పి. యశోదారెడ్డి. డెమ్మీ 22 + 136 పేజీలు. వెల: రూ. 3-25. ప్రకాశకులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500 004]

భాగవతం కల్ప వృక్షమని బమ్మెర పోతరాజే తన భాగవ తానువాదంలో పేర్కొన్నాడు. సంస్కృత భాగవతాన్ని చక్కగా అవగాహన చేసికొని జనసామాన్యానికి అందుబాటులో ఉండేరీతిలో సుమనోహరంగా రసవంతంగా తన రచనను సాగించాడు. ఆ పోతన భాగవతం చాలా పెద్ద గ్రంథం. అందరికి సులభంగా లభ్యంకాదు. లభ్యమైన వారికి కూడా దానిని పూర్తిగా చదవడానికి అవకాశం గాని, ఓపికగాని ఉండదు. అందువల్ల ఆ భాగవత కల్ప వృక్షంలోని బాగా పరిమళించే కుసుమాలను ఏర్చి మాలగా కూర్చి ఈ పుస్తకం సమకూర్చబడింది.

బృహద్గ్రంథాలలోని ముఖ్యమైన పద్యాలను ఎన్నికచేసి, జన సామాన్యానికి ఉపయోగపడే విధంగా సంగ్రహగ్రంథాలుగా ప్రకటించడం ఇది వరకే ఉన్నది. హైదరాబాదులోని "సురభారతీ సమితి" వారు, సుప్రసిద్ధ విద్వాంసులు డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారి సంపాదకత్వంలో భారత రామాయణాదులలోని ముఖ్యమైన శ్లోకాలను టీకా తాత్పర్యాలతో సహా చిన్న చిన్న గ్రంథాలుగా ప్రకటిస్తున్న సంగతి తెలుగు వారికందరికీ తెలిసినదే! ఇది కూడా ఆ పద్ధతినే అనుసరించినట్లున్నది. టీకా తాత్పర్యాలు ఇందులో లేవు.

దీనిని ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కార్య దర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారు తమ "తొలిపలుకు" లో "బమ్మెర పోతన పంచశత జయంతి ఉత్సవాల సందర్భంగా ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి 'మహాభాగవత కల్పకుసుమ మాల' న తెలుగు దేశానికి సమర్పించు కుంటున్నది. భాగవతంలోని వేల కొలది

పద్యాలలో నుంచి 500 పద్యాలను ఏరి ఈ పుస్తకంగా మలచి అందిస్తున్నాము. ఈ పద్యాలైనా తెలిస్తే బమ్మెర పోతనను కొంత వరకు అర్థం చేసుకోవచ్చు. డా. (శ్రీమతి) యశోదారెడ్డిగారు ఈ పద్యాలను ఏర్చికూర్చినారు. ఈ కుసుమాలను కొన్ని గుచ్ఛాలుగా వింగడించి పోతన కవితా పాటవాలను సులభంగా అర్థం చేసుకునే విధంగా కూర్చినారు." అని తెలియ జేస్తున్నారు. భాగవతంపై అభి మానంగల వారందరూ ఆదరించవలసిన గ్రంథం యిది.

"ఆంగీరస"

# ఆచార్య వినోబా

[రచన- జోస్యుల సూర్యనారాయణమూర్తి; వెల: రు 10.00 ప్రచురణ- గాంధేయ సమాజ సేవాసంస్థ, అవనిగడ్డ 521 123]

ఆచార్య వినోబా భావే సిసలయిన గాంధేయవాది. అంతకంటే కూడా గొప్పవాడు, భారతీయ ఋషుల కోవలోని మహనీయుడు. భారతీయ ధర్మశాస్త్రాల అను శాసనాల కనుకూలంగా ఆయన కఠోర బ్రహ్మచర్య వ్రతపాలనం చేశారు. ఉపనిషత్తులు, యోగ, బ్రహ్మ సూత్రాదులు ఆదిశంకరుల భాష్య ప్రవచనాలకు సహ సమగ్రంగా అధ్యయనం చేసిన భావే ఆధునిక సమాజానికి అనుకూలంగా భగవద్గీత బోధ కూలంకషంగా పొంది సమాజ శ్రేయోదాయకంగా గీతాప్రవచనమూ స్థిత ప్రజ్ఞ దర్శనము చేసిన యోగిపుంగ వుడయ్యాడు. పత్రికల ద్వారా 1940 అక్టోబరులో ప్రపంచానికి వినోబాభావే పరిచయమయ్యాడు. గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించినప్పుడు ప్రథమ సత్యాగ్రహిగా వినోబాను నిర్ణయించారు. 1940 అక్టోబరు 5వ తేదీన వినోబాను దేశానికి, ప్రపంచానికి పరి చయం చేశారు. నూలు వడకడంలో వినోబా నిపుణుడు. పల్లెలలో నూలు వడకడాన్ని విస్తృతంగా జరిపితే దేశానికి అదే ఆశా జ్యోతియని విశ్వాసం. నూలు తీయటాన్ని అసలయిన చేతిపనిగా వివ రించుతూ ఒక పుస్తకం వ్రాశారు. ఆయా అంశాలున్న యీ 200 పుటల పుస్తకంలో యీ రచయిత వివరంగా వ్రాశారు.

భూదానోద్యమ ప్రారంభకుడుగా వినోబా కృషి గురించి ఎంత వ్రాసినా చాలా తక్కువ చెప్పాం అనిపించుతుంది. వినోబాకు ప్రకృతి చికిత్స ఒక తాత్త్విక సిద్ధాంతం. అహింస ఆయన జీవిత విధానం. వినోబాకు దేవతా విగ్రహాలపట్ల ఉన్న శ్రద్ధను కొందరు మిత్రులు అమాయకత్వంగా పరిగణించి మాటలాడుతూండే వారట వారికి జవాబుగా వినోబా "నా అమాయకత్వం పోవటంలేదు. ఈ అమాయకత్వం నాకు మంచితనంగానే తోస్తుంది. దేవతా మూర్తిని దర్శించినప్పుడు నా కంటినుండి ఆనందబాష్పాలు పొంగి పొరలుతాయి." ఇది ఎంత మంది విషయంలో నిజం? అయితే ఇంత నిర్భయంగా చెప్పగలవారు మనలో ఎంతమందున్నారు?

ధామ నదీతీరాన 1938లో పవనార్‌లో పరంధామాశ్రమం నెలకొల్పారు. ఈ పుస్తకం 157వ పుటలో వినోబా ఆశ్రమ నియమాలు, ఆశయాలు తప్పక చదివి ఆలోచించదగినవి. వినోబా సూచించిన పంచశక్తుల సంయోగాన్ని ఎవరయినా యీ దేశంలో ఎన్నడయినా ఆచరణలో పెట్టారా? ఇకముందు పెడతారన్న ఆశ ఉన్నదా? ఈ పుస్తకం 165వ పుటలో బాబా - బాపూ అనే అధ్యాయం అందరూ చదవవలసినది. హృదయం విశాలం చేసు కోవాలని వినోబా ప్రబోధించారు అలాగే ఉపాధ్యాయుల కర్తవ్యం గురించి వినోబా చేసిన ప్రబోధం కూడా చాలా ప్రధానమయినది. వినోబా భావే వంటి ఋషులు తరచుగా జన్మించరుగదా? జన్మించినా వారిని పిచ్చివారుగా, ఉన్మాదులుగా పేర్కొనడానికి ఆధునికులు వెనుకాడరుగదా!

# హేతువాదం

[రచన: గౌతమ మహర్షి; వ్యాఖ్యాత: వాత్స్యాయన మహర్షి. అనుసరణ: రాం షా. వెల రు. 10-00; ప్రచురణ: రాం షా, సామర్లకోట-533 440]

ఈ రచయిత విజ్ఞుడు. న్యాయదర్శనంలోని అధ్యాయాలను ఆహ్నికాలని అంటారు. 238 పుటల యీ పుస్తకంలో 10 ఆహ్ని కాలుంటాయి. కాని, హేతువాదం అంటే డైలెక్టిక్స్ అని ఈ రచయిత ఎలా తెనిగించారో వివరించలేదు. ప్రశ్నలు, జవాబులు, లేదా సంభా షణ ద్వారా ఒక విషయాన్ని వివరించడం, నిరూపించడం అని పద కోశాలు చెబుతాయి. ఇది హేతువాదం అవుతుందా? హేతువాదంఅనే తెలుగుమాటకు "రాషనలిజమ్" అని ఇంగ్లీషులో చెప్తున్నారు. ఈ ఒక్క అంశం వినా ఇది చాలా మంచి పుస్తకమే. తర్కం అర్థంకాని వారికి డైలెక్టిక్స్ అర్థం కావడం కష్టం. తర్క శాస్త్రం ప్రయోజనం గురించి ఈ రచయిత ఇచ్చిన అనుసరణను ఆమోదించడం కష్టం. కేవలం తర్కంవల్ల మానవునిలోని అజ్ఞానం వైదొలుగుతుందా? హేతువాదానికి ఈ రచయిత ఇచ్చిన ప్రమాణాలు సమంజసమైనవే కానీ మానవతా దృష్టి, బుద్ధిలేని ప్రమాణాలు నిష్ప్రయోజనం. ఈ విధంగా ఎవరినో ఖండించాలని హేతువాదాన్ని తర్కంగా యీ రచయిత వ్యాఖ్యానించారు. ఇది ఎంత వరకూ సమంజసం? "ఆత్మ వస్తువు కాదు. కనుక వాస్తవం కాదు. కొన్ని ఆధారాలనుబట్టి ఆత్మ ఉన్నదని ఊహింపబడుతున్నది" అన్నారు ఈ రచయిత. మరి ఆత్మ వస్తువు కాదనడం కూడా కొన్ని ఆధారాలను బట్టియే కదా? అలాగే సత్య

మనగా వస్తువు (మెటీరియల్), వస్తువు కానిది అసత్యంకదా అన్నారు ఈ రచయిత. అంటూ మరో చెంప ఆత్మ లేదనే వాడికి బుద్ధికూడా లేదు అన్నారు. ఇది సర్వజనామోదం కాజాలదు. పదార్థవాదులు ఆత్మ (సోల్) లేదంటూన్నారు. అంటే వారందరూ బుద్ధిలేనివారని అర్థమా? ఇదండీ కేవలం తర్కాన్ని అనుసరించితే వచ్చే విపరీతం. ఇటువంటి లోపాలకేమొచ్చెగానీ రాం షాగారి అనుసరణ చక్కగా ఉన్నది. నిరీశ్వరవాదులు సయితం చదవవలసిన మంచి పుస్తకాలలో ఇదొకటి.

**వి. ఎస్. అవధాని**

# వీరాపురం

(శ్రీశైలం ప్రాజెక్టు పథకంలో జలాశయమందు మునిగిపోయిన నందికొట్కూరు తాలూకాలోని ఒక ప్రాచీన గ్రామము. ఇది మునిగి పోవుటకుముందు హైదరాబాదులోని 'బిర్లా పురావస్తు సాంస్కృతిక పరిశోధనా సంస్థ' వారు ఈ గ్రామ పరిసరములలో పురావస్తువుల నన్వేషించుటకై త్రవ్వకములు చేసిరి. ఈ పుస్తకములో ఆ త్రవ్వకములలో వారు కనుగొన్న పురావస్తు విశేషములు, వాటి ద్వారా మనకు తెలియవచ్చుచున్న అచటి నూతన శిలాయుగము, ప్రాచీన చరిత్ర యుగములనాటి సాంస్కృతిక విషయములు వివరించబడెను.)

[రచయితలు : 1. శ్రీ టి. వి. జి. శాస్త్రి, డైరెక్టరు. 2. శ్రీమతి యం. కస్తూరిబాయ్ 3. శ్రీ జె. వరప్రసాదరావు. వీరుగాక డా॥ యం. డి. కజెలె; డా॥ పి. కె. థామసులు అనుబంధముగా రెండు ప్రకరణములు వ్రాసిరి. పుటలు 220; పటములు 60; ఇతర బొమ్మలు 46. ప్రచురణ 1984; వెల రూ. 175/- ప్రతులకు :- బిర్లా పురావస్తు, సాంస్కృతిక పరిశోధనా సంస్థ మూసారాంబాగ్-టి. వి. టవరు దగ్గర హైదరాబాదు-36]

ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధమైన చారిత్రక స్థలములలో పూర్వము బ్రిటిషుపాలన కాలమునుండి పరిశోధనలు జరుగుచున్నవి. కాని వేటిని గూర్చి సమగ్రమైన నివేదికలు వెలువడలేదనియే చెప్పవలెను. ప్రసిద్ధమైన అమరావతి, నాగార్జునకొండ మొదలైనచోట్ల జరిగిన త్రవ్వకాల మాట అటుంచి, ఇటీవల అనేక సంస్థల ద్వారా పలుచోట్ల చరిత్రకు తెలియని పూర్వయుగానికి చెందిన పరిశోధనలు జరుగుచున్నవి. ఇట్టి తావులు అనేక కుగ్రామాల నానుకొని బయల్పడు చున్నవి. వాటిలో కర్నూలు జిల్లా, నందికొట్కూరు తాలూకాలో కృష్ణానది యొడ్డున వీరాపురానికి రెండు కిలోమీటర్ల వాయువ్య మూలగనున్న ప్రాచీన నివాసస్థలంలో పైన బేర్కొన్న బిర్లా స్థవారు పరిశోధనార్థం త్రవ్వకాలు చేసిరి. దాని ఫలితములను ఆ సంస్థ డైరెక్టరు, వా సహాయకులు ఈ పుస్తకరూపంలో ఒక సమగ్ర నివేదికను త్వర వెలువరించుట మిక్కిలి ముదావహము.

ఇందు 11 ప్రకరణములు గలవు.

1. స్థలమును గూర్చిన భౌగోళిక, చారిత్రక విశేషములు.

2. త్రవ్వకములు జరుపుటకై ఏర్పాటుచేసుకొన్న సాంకేతి విధానాలు.

3. త్రవ్వకములు పూర్తియైనపిదప ఫలితములను క్రమము వివరించుటకై పైనుండి పొరలు (లెయర్లు) గాను, అడుగునుండి కా భేదములకు (పిరియడ్స్) నిర్దేశించుచు పటముల ద్వారా విష నిరూపణము గావించిరి. పాఠకులకు ఇది ముఖ్యామైనది. దీనిని బ వారు త్రవ్విన స్థలములో ఏయే కాలములో ఏయే సంస్కృ రూపొందుచు వచ్చునో తెలిసికొనుట సులభమగును. రచయితలు విభాగమును స్పష్టముగా నిరూపించిరి. ఇచ్చట గల మూడు దిబ్బల రెండు మాత్రము ముఖ్యామైనవిగా గ్రహించిరి. అందు చిన్న దిబ్బల 15 పొరలు, పెద్ద దిబ్బలో 24 పొరలు కనుగొనబడెను.

4-5 ప్రకరణాలు పైనచెప్పిన పొరలలో దొరకిన వస్తువిశే ములను బురస్కరించుకొని కాలభేద నిర్ణయము చేసిరి మొద కాలము (పిరియడ్)లో మూడు దశలు కనుగొనబడెను. (ఎ) నూత యుగం మొదటిదశ. ఇందు సహజ భూతలానికి లోతుగా త్రవ్వబడి గుండ్రని గుంటలలో అప్పటి వారు నివాసము లేర్పరచు కొన్నట్ తెలియుచున్నది. వీటిలో కొన్నిటి చుట్టు పై కప్పు వేయుట స్తంభముల కొరకు గోతులు గలవు. ఈ గుంటలలో బూడిద, చేతి మలచబడి మందమైన కుండ పెంకులు, కొన్ని రాతిగొడ్డళ్లు బయల్పడెన (బి) నూతన శిలాయుగం రెండవదశ. ఇందు రాతిపూసలు, రా చాకులు, బ్లేడులు, క్రొత్తరకం కుండపెంకులు. వాటిలో కొన్నిటి పై పెయింటు చేయబడినవి గలవు. శవములను మట్టితోజేసిన తొట్టిలోన విడిగాను పాతి బెట్టువారు. రాతి పనిముట్లు బాగా నునుపు చేయబడెన రాతితోజేసినవి, మట్టితోచేసినవి పూసలు పలురకములు బయల్పడెన (సి) తామ్ర-శిలా (చాల్కొలిథిక్) యుగం. ఈ దశలో క్రొత్త రాగి ఉపయోగించబడెను. పెయింటుచేయబడిన కుండలు, రాతి జేసిన మఱి కొన్ని పనిముట్లు వాడకములోకి వచ్చెను. గొడ్డళ్లేగా కోయునట్టి, గీకునట్టి బ్లేడులు, రంధ్రములు తొలుచు శానము గలవు. ఈ కాలపు పనిముట్లు చిన్న డిబ్బలో 13వ పొరలోను, పె డిబ్బలో 17-20 పొరలలోను కనిపించెను.

రెండవ కాలమునకు చెందిన దశగా వారు బృహచ్ఛిలా(మెగలిథిక్) కాలమును నిర్దేశించిరి. కాని నూతన శిలాయుగానికి దీనికి నడుమ కొంతకాలము సుమారు అయిదు శతాబ్దులు నిర్దేశించుటకు తగిన ఆధారములు దొరకలేదని చెప్పిరి. కేవలం దట్టమైన మట్టిపొరమాత్రం గలదనియు, అది వరుసగా కొద్దివ్యవధులలో ఏటి వరదల వల్ల ఏర్పడి యుండుననియు, అట్లు అంతదీర్ఘ కాలం జనావాసం లేకపోయెననియు ఈ పరిశోధకులు చెప్పుచున్నారు. ఇది విచారించ వలసిన అంశము. బృహచ్ఛిలా యుగం క్రీ. పూ. 500 నాటికి ముందు లేదనియెడి నిశ్చితాభిప్రాయంతో వీరి నిర్ణయం ముడివడియున్నది. వరదలు వచ్చుట వల్ల ప్రజలు కొంతకాలం ఈ స్థలమును విడిచి యుండ వచ్చును. కాని ఆ వ్యవధి పూర్తిగా అయిదువందల యేండ్లు ఉండునని సహేతుకంగా వారు నిరూపించిరి. దీని తరువాత కాలంలో ఇనుప వస్తువులున్నట్లు చెప్పిరి. వాటిలో మేకులు, చాకులు, కట్లు ఉన్నట్లు తెలిపిరి. ఉలులు, బాణం ములుకులు కూడ గలవు. గృహనిర్మాణ విధానంలో కొన్ని విశేషములు ఇచట గలవని వీరు చెప్పుచున్నారు. ధాన్యం వగైరా నిలవచేసికొనుటకు పెద్ద మట్టి బానల తునకలు బయల్పడెను. నలుపు, నలుపు-ఎఱుపు కలిసిన రంగు, ఎఱుపురంగు కుండపెంకులు విశేషముగా దొరకెను. వీటితో బాటు రుబ్బుడురాళ్లు, అనేకం కాల్చిన మట్టి బొమ్మలు, పూసలు గలవు. పూసలలో కొన్ని కార్నిలియన్ వంటి రాళ్లతో చేసినవి గూడ విస్తారముగా దొరకెను. గవ్వచిప్పలతో జేసిన గాజులు ఇతర ఆభరణాలు కొన్ని డిజైన్లతో గూడ కలవు. అట్లే యెముకలతో చేసిన గాజులు ఇతర పనిముట్లు కూడ గలవు. కుండపెంకులు, ఇళ్లనమూనాలు, వ్యవసాయంపనిముట్లు ధాన్యాదుల అవశేషాలు, ఇనుపసామానులు విశేషించి ఆ కాలపు గ్రామ సంస్కృతిని తెలుపుచున్నవని వీరు వివరించిరి.

మూడవ కాలపరిమితిని చారిత్రక యుగానికి చెందినట్లు ఈ పరిశోధకులు నిర్దేశించిరి. అందు నాణెములు, కొన్ని కట్టడములు ప్రధాన నిదర్శనములుగా కనుగొనబడెను.

వారు మొత్తము పరిశోధన వల్ల నిర్దేశించిన కాల విభాగములు:

పిరియడ్ I (ఎ) నూతన శిలాయుగ ప్రారంభ దశ క్రీ. పూ. 1800-1500

(బి) నూతన శిలాయుగ కడమ దశ క్రీ. పూ. 1500-1300

(సి) చాల్కోలిథిక్ కాలము క్రీ. పూ. 1300-1000 సాంస్కృతిక విశేషములు లేకుండ కేవలం మట్టి పొరలే గలిగిన కాలము క్రీ. పూ. 1000-500

పిరియడ్ II మెగలిథిక్ క్రీ. పూ. 500-300

పిరియడ్ III చారిత్రక కాలము

(ఎ) సంధి కాలము క్రీ. పూ. 300-50

(బి) మహారథులు పాలించిన కాలము క్రీ. పూ. 50 నుండి క్రీ. శ. 400

ఇట్టి నిర్ణయము చేయుటలో ఈ పరిశోధకులు దక్కనులో చరిత్రవల్ల బ్రహ్మగిరి, మాస్కి, సంగనకల్లు, హల్లూరు, పాలవాయి మున్నగు స్థలములలో ఇతర పరిశోధకులు త్రవ్వకములుచేసి, కార్బన్-14 వంటి శాస్త్రీయ విధానములతో కనుగొన్న ఫలితములను ఆధారముగాగొని వాటిని బోలియున్న అవశేషములు ఇచట లభించుట వలన ఆ కాల పట్టికను (క్రానాలజీని) అనుసరించిరి.

ఈ కాల నిర్ణయముచేసి ఒక్కొక్కరి కాల వ్యవధిలో చేర్చ దగిన నిర్మాణములను, రాతి వస్తువులను, కుండలను, నాణెములను, ఇనుప వస్తువులను, గవ్వ పెంకుల ఆభరణాలు, పూసలు వీటినిగూర్చి వివరించుచు తరువాత ప్రకరణములలో వివరించిరి. పరిశోధన దృష్టిలో ఇవి యన్నియు అతి విశదముగా పరిశీలించి కొన్ని నిర్ణయములు చేసిరి.

ఈ పుస్తకంలో చూపబడిన పటములలో ఫోటోగ్రాపులు, సిరాతో వ్రాసిన నమూనాలు చాలమటుకు స్పష్టముగానే యున్నవి. నాణెములను గూర్చి కొంత చెప్పవలసియున్నది. క్రీ. పూ. 50 వరకు గల ప్రాచీన కాలపరిమితిలో పంచ్ మార్కులుగల నాణెములు వెండివి, ఆ తరువాతి కాల పరిమితిలోనివి వాటిని యిచ్చిన రాజుల పేర్లుగల సీసపు నాణెములు దొరకెను. నాలుగైదు నాణెములు నిజాం నవాబువి ఈస్టు ఇండియా కంపెనీవి గలవు. పంచ్ మార్కు నాణెములు మౌర్యుల నాటి నుండి ఆ తరువాత రెండు శతాబ్దాలుకూడ దక్కనులో చెల్లుచుండెడివి. ఆ తరువాత వీరాపురంలో మహారథి అను బిరుదుతో రెండు, మూడు పేర్లుగల నాణెములు కొన్ని దొరకెను. శాతవాహనుల నాణెము ఒకటి మాత్రమే దొరికినట్లు తెలిపిరి. అది పులుమావిది. దినిని బట్టి ఈ పరిశోధకులు మౌర్యుల తరువాత క్రీ. పూ. 230 ప్రాంతం నుండి మహారథులు ఇచ్చట పాలించు చుండెడివారు అని చెప్పిరి. కాని వారి నాణెములు కూడ క్రీ. పూ. 50 నుండి మాత్రమే దొరికినట్లు తెలియుచున్నది. వీరు పులుమావి నాణెమని చెప్పుచున్నది సందేహము. మొదటి పులుమావివి మాత్రమే పై వైపున మూడు ఆర్చిలు పేర్చినట్లుండు కొండ గుర్తుగల నాణెములు కలవని తెలియ చున్నవి. ఇది సీసపుది అగుటచే స్పష్టతలేదు. తిరిగి పరీక్షించవలసి యున్నది, వెనుక వైపున ఉజ్జయిని గుర్తు అని చెప్పబడు రెండేసి

సున్నాలు ఎదురెదురుగా ప్లస్ గుర్తుకి కలుపబడి యుండు చిహ్నము గలదు. ఇట్టి చిహ్నమును ఇక్ష్వాకులు కూడ వాడిరి. కనుక వీరు చెప్పుచున్న పులుమావి నాణెము సంశయాత్మకము. మహారథులు శాతవాహనుల క్రింద ఉన్నతోద్యోగులని చెప్పుటలో అభ్యంతరము కనుపించదు. ఇటీవలనే సాతాని కోటలోను మరి కొన్ని చోట్ల కూడ త్రవ్వకాలలో శాతవాహన నాణెములు దొరకినట్లు తెలియుచున్నది. వీరాపురంలో మొత్తం 13 మహారథ నాణెములు, శాతవాహనులవి 3 దొరకినవి. మిగిలినవి అన్ని కలిపి 37 ఇతర కాలాలకు చెందినవి.

వీరాపురంలో దొరకిన నాణాలన్నిటిలోను అతి ముఖ్యమైనది యొకటి గలదు. అది కూడ సీసపుది. రోమను చక్రవర్తి టిబేరియస్ అగస్టసు (క్రీ. త. 14 నుండి 37 సంవత్సరము వరకు) కు చెందిన ముద్రవంటి గుర్తింపు చిహ్నమై యుండునని చెప్పిరి. దీనిపైన ఒక ప్రక్క ఆ రాజు బొమ్మ (తల), పేరు గలవు. రెండవ వైపున వేఱొక బొమ్మ (తల) బ్రాహ్మీ అక్షరాలను బోలిన పేరు గలదు. ఈ పేరును ఈ పరిశోధకులు 'రజోహకుణో' అని యెడమవైపున, 'సతకనస' అని కుడివైపున ఉన్నట్లు చదివిరి. దీనిని బట్టి శాతవాహనులలో మొదటి సాతకర్ణి కుమారుడగు నానెఘాట్ శాసనంలో పేర్కొనబడిన శక్తిశ్రీ, 'కుమారొహకుసిరి'యే యీ ముద్రమీద రెండవ వైపునగల బొమ్మలో గూడిన పేరుగల 'హకున సాతకణి' కావచ్చునని చెప్పు చున్నారు. అది నిజమగుచో చారిత్రకముగా రెండు వైపుల బొమ్మలు గల ఈ ముద్ర అతి ముఖ్యమైనదన వలెను. టైబిరియస్ రోమ చక్రవర్తి కాలానికి సాతవాహన హకుసిరి కాలాన్ని సరిచేయవచ్చున రెండవది, సాతవాహనుల బొమ్మగల ముద్ర ఇదియే మొట్ట మొదటి అగును. మూడవది రోమను దేశముతో ఇచట వ్యాపార సంబంధమ లున్నట్లును సరుకుల గుర్తింపుకై ఆరాజులుపయోగించు ముద్రలపై సాతవాహన రాజులు తమ ముద్రను కూడ రెండవ వైపున వేయ చుండిరనియు తెలిసికొనవచ్చును.

కాని దీన్ని కూర్చి సందేహములు గలవు. ఇట్టి ముద్ర అప్పుడు వాడకములో నున్నట్టు తెలియవలెను. రెండవ వైపునగ అక్షరాల్లో 'హకున', 'తకన' అనునవి మాత్రం కొంత వరకు పోలు కొన వీలుగా నున్నవి. అవి కూడ హ. త లు ముఖ్యంగా బ్రాహ్మీ ఆక్షరాల కంటె కొంత భిన్నంగా కలవు. 'జ' 'స' అక్షరాలు పోలు కొనుట కష్టము. ఈ పరిశోధకులు పరమేశ్వరిలాల్ గుప్త, వం నిపుణులకు చూపించినట్లు తెలుపుచున్నారు గనుక కొంత మటుకు వీరి అభిప్రాయాన్ని స్వీకరించవచ్చును. సిముక సాతవాహనుడి కాల క్రీ. పూర్వం 30 ప్రాంతానికి చెందియుండునని కోటిలింగాల నాణె లను బట్టి చెప్ప వీలగుచున్నది. సిముకుని మనుమడు హకుశ్రీ క్రీ తరువాత రెండు, మూడు దశాబ్దాలలో రోమను చక్రవర్తి టైబిరి సుకు సమకాలీను డైయుండు నను కుదురుతుంది, ఈ ముద్ర యొ కాల నిర్ణయానికి తోడ్పడగలదు.


ముందువైపు


వెనుకవైపు

తొమ్మిదో ప్రకరణంలో ఈ త్రవ్వకాలవలన తెలియ వచ్చు చున్న సాంస్కృతిక విశేషములను ఆ ప్రజల జీవిత విధానంలో వచ్చిన మార్పులను వివరించిరి.

ఇందు చూపబడిన ఫోటోలు, ఇతర పటములు చాలా స్పష్టముగా నున్నవి. కాని నాణాలకు పైజెప్పిన ముద్రను వర్ణించునపుడు వాటి డ్రాయింగులను ఇచ్చిరి. వాటి కంటె ఆయా నాణాల ముద్రయొక్క సిరాన కళ్లు (ఇంకు ఇంప్రెషన్లు) ఇచ్చినచో యితరులకు ప్రామాణికంగా ఉండెడివి.

ఆంధ్ర దేశంలో ఒక సామాన్య ప్రాచీన స్థలాన్ని గూర్చి పరిశోధించి ప్రచురించిన నివేదికలలో ఇది ముఖ్యమైనదగ నెన్నదగి యున్నది. చరిత్ర పరిశోధకులకు రచయితలకు ఆధార గ్రంథము కాగలదు.

**శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి**

# శ్రీ మధ్వ భారతి

[రచన : డాక్టర్ ఆకొండి విశ్వనాథం ప్రతులకు : శ్రీమతి ఆకొండి అమరజ్యోతి, శ్రీ రమణ నిలయము, సీతారామపురం, హిల్ కాలనీ, ఒంగోలు-523 001. వెల ఆరు రూపాయలు.]

త్రిమతాచార్యులలో మధ్వాచార్యులొకరు. వీరు ఆంధ్రులనీ ఇంటిపేరు నడిమింటి వారనీ మునుపెప్పుడో విన్నాను. ఈ 'మధ్వ భారతి' చదివాక నిజమే అనుకున్నాను.

మధ్వాచార్యులవారి జీవితం దీనిలో సంక్షిప్తంగా ఉన్నా ముఖ్య విషయం ఉంది. వాయుదేవుని అంశతో పుట్టిన వాడని దీనివల్ల తెలుస్తుంది. చిన్ననాటి ముచ్చటలు ఒకటి, రెండు భీముని పసితనాన్ని గుర్తుకు తెస్తాయి. శరీరం కూడ అలాగే ఉండేదట! చిన్ననాడు చదువూ సందే లేక అల్లాటప్పాగా తిరిగినవాడు ఆచార్యత్రయములో ఒకడయాడు.

ఇటు నుంచి అటు సంచారంచేసి పండితా ఖండలులనిపించు కున్నవారిని ఇట్టే ఓడించి ద్వైతాన్ని నెలకొల్పి మతాలు ఏర్పరచిన మధ్వాచార్యుల ప్రవృత్తి ఆది శంకరుల ప్రవృత్తికి తులతూగేదిగానే కనిపిస్తుంది. ఆయనలాగే యీయన కూడా ఓడిన పండితునికి పేరు పెట్టుతూ అక్కడ స్థాపించిన మతానికి అతనిని మఠాధిపతిగా నిర్ణయించేవాడు.

అద్వైత ప్రతి పాదనకుగీతాచార్యుని వాక్కులతోనే మధ్వాచార్యుడు ఖండించి ద్వైతాన్ని ప్రతిపాదించడం దీనియందు శ్రీ విశ్వనాథం చక్కగా వివరించడం జిజ్ఞాసువులకు ఉపకారమయింది. శ్రీహరి ఒక్కడే సర్వోత్తముడు. జగత్తు సత్యము. పరమాత్మ స్వతంత్రుడు. జీవుడు అస్వతంత్రుడు. జీవులు శ్రీహరి సేవకులు. జీవులలో సాత్వికులే ముక్తికి తగినవారు. స్వరూప సుఖాను భూషియే ముక్తి. జీవుని నిజస్వరూపము సచ్చిదానందము. శ్రీహరి యందలి అమలభక్తియే ముక్తికి సాధనము. ప్రత్యక్ష-అనుమాన ఆగమాలు ప్రమాణాలు. శ్రుతులవలననే పరమాత్ముని తెలిసి కొనవలెను. శ్రీహరిని సదా స్మరించండి. తరించండి.

ఇవి మధ్వ సూక్తులు. వీటిని ముందుంచుకుని యీ గ్రంథాన్ని చదివితే మధ్వాచార్యుని హృదయం ఇట్టే అర్థమవుతుంది. ఔనని తల లూపవలసిందే.

ఆకొండివారి ప్రయత్నం, రచన స్తవనీయాలు. ఈ పవిత్ర గ్రంథముద్రణకు తిరుమల-తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయం సార్థకమయిందని భావిస్తాను. శ్రీ మధ్వాచార్యులు మనవాడని మరొక్కమారు మనసా స్తుతిస్తూ విశ్వనాథంగారి విశిష్ట ప్రయత్నాన్ని అభినందిస్తున్నాను.

# లక్ష్మీ నృసింహ స్తోత్రం

[మూలం : శ్రీ శంకర భగవత్పాదులు, అనువాదం : శ్రీ జోస్యుల సూర్యనారాయణ మూర్తి, అవనిగడ్డ, కృష్ణాజిల్లా వెల : 0-60 పైసలు.]

ఆదిశంకరులు లక్ష్మీనరసింహస్వామిని స్తుతించడానికి పరం పరయా వినవచ్చే చిన్న కథ ఒకటి ఉంది. (ఇది ఇటీవల శంకర విజయంలో) చదవినట్టు జ్ఞాపకం)

అద్వైత మత స్థాపనకు దేశ పర్యటనంలో ఆది శంకరుడు ఒక పట్టణమందు మండన మిశ్రుడనే పండితునితో వాదించి ఓడించగా అతని భార్య పతి అర్థ శరీరమైన నన్ను కూడా వాదంలో ఓడిస్తే నీ కాయన శిష్యు డౌతాడన్నది. సరే అంటే సరే అన్నారు. కొంత సేపు వాదం అయాక ఆమె కామశాస్త్రములో ప్రశ్నించింది. శంకరున కది అననుభూత విషయం. ఒక మాసం వ్యవధి కావాలనగా సరే అన్నదామె. శంకరుడు శిష్యులతో వెనుదిరిగి వచ్చి ఒక అడవిలో చెట్టు క్రింద పడి ఉన్న రాజు కళేబరములో తన వ్యక్తిని ప్రవేశ పెట్టుతూ శరీర రక్షణ చేస్తూ ఉండండని శిష్యులకు చెప్పాడు. వారా శరీరాన్ని ఒక కొండ గృహలో భద్రపరచి కాపున్నారు. రాజు లేచి

నగర ప్రవేశం చేసి యథాపూర్వంగా ఉన్నాడు. కాని అతని ప్రవర్తన అన్ని విషయాల్లోనూ లోకాతిశయరీత్యా ఉండడం చూసి రాణి, అనుమానించి ఎక్కడేనా ఏకాంత ప్రదేశములో ఏ యోగి కళేబరమైనా కనిపిస్తే కాల్చిరండని సేవకులను పంపించింది.

నెల దాటిపో వచ్చింది. గురువుగారు ఇంకా రాలేదని శిష్యులిద్దరూ ఆ రాజు సభకు చేరి పీఠముపై ఉన్న రాజుకెదుటనిల్చి తుమ్మెదతో చెపుతున్నట్లు ప్రబోధించారు. వెలుపలకు వచ్చారు. కొంత సేపటికి రాజు పడిపోయాడు. ఇక్కడ గుహలో రాజభటులు శంకర శరీరానికి నిప్పంటించారు. శరీరం అగ్గి సెగకి మాడింది. అంతలో చప్పున మంటల్లోంచి శంకరుడు బయటికి లంఘించి వచ్చి దేహ బాధ నివృత్తికై యీ స్తోత్రం చెప్పాడు. 'లక్ష్మీనృసింహా! నీ చేయూత నాకు ఇయ్యవయ్యా' అని

'సంసార దావ దహ నాకుల భీకరోగ్ర
జ్వాలావళీ భి రభిదగ్ధ తనూరుహాస్య
త్వత్పాదయుగ్మ సరసీరుహ మస్తకస్య
లక్ష్మీనృసింహా! మమ దేహి కరావలంబమ్'

ఈ మకుటంతో ఉన్న శ్లోకాలు 22. వీటికి శ్రీ సూర్యనారాయణ మూర్తి తేటగీతానువాదం సమర్ధనీయంగా ఉంది.

ఘోర సంసారదావాగ్ని కుటిల కీల
కాలి పోయెను నారోమజాల మెల్ల
శిరము నొగిలి నీ పాద సరసిజమున
చేరి చేయూత నిమ్ము లక్ష్మీనృసింహా !

# భజగోవింద శ్లోకాలు

[తెలుగు వ్యాఖ్యాత: డా॥ పప్పు వేణుగోపాలరావు; ప్రతులకు: వ్యాఖ్యాతపేర 2 ఫోర్త్ క్రాస్ స్ట్రీట్, సి. వె. టి. కాలనీ, మైలాపూర్, మద్రాస్-4 ; లేదా శ్రీ పి. వి. రమణయ్య రాజా, 5, సెకండ్ క్రాస్ స్ట్రీట్, టి. టి. కె. రోడ్, మద్రాసు 18; వెల : లేదు.]

శ్రీ శంకరాచార్యులు చెప్పిన శ్లోకాలూ వారి శిష్యులు చెప్పినవన్నీ దీనిలో ఉన్నాయి. ముందు ఆచార్యుల వారి జీవిత చరిత్ర సంగ్రహించి ఉంది.

భజగోవిందం అంటేనే చాలు ఈ శ్లోకాలు జ్ఞాపకం వస్తాయి. ఇతర భాషల్లోకి కూడా వెళ్లాయి యివి. సామూహిక భజనల్లో పాడుతూ ఉంటారు కూడా వీటిని. జీవిత రహస్యం, ప్రబోధించే తాత్త్విక గ్రంథాలకు వేటికిరాని ప్రచారం యీ శ్లోకాలకు వచ్చిందని ఎవరూ కాదన లేరు.

ఈ సంసారమనే నిద్రలో ఉన్న శిష్యులకు తీయని కొరడా దెబ్బలు ఈ శ్లోకాలు. ప్రేమతో కూడిన తీక్ష్ణమైన హెచ్చరికలు శ్లోకాలు ఈ వ్యాఖ్యాత ఉద్బోధ.

ప్రతి శ్లోకానికి సామాన్యమైన తాత్పర్యం చెప్పి తరువాత శ్రీ వేణుగోపాలరావిచ్చిన వివరణ విశిష్టభావోపేతమై ఉంది. అక్షరాలు అందరి చేతుల్లో భద్రంగా ఉండవలసే సత్కృతి. శ్రీ బాపు వ పత్ర చిత్రం గోవింద శంకరుల దర్శనం ప్రసాదిస్తూంది.

ఈ చిన్నారికృతి (ఆకృతికి)కి ఎంతో చక్కని ముద్రణాకలిగించిన త్యాగశీలి శ్రీ పి. వి. రమణయ్య రాజాను అభినందించ

# జ్ఞాన మూర్తి

[శ్రీ హయగ్రీవ-అవతారతత్త్వము రచన : శ్రీ ఎన్. రామానుజాచార్యులు, ఆల్కాట్ బంగళా, థియసాఫికల్ సొసై అడయార్ - మద్రాసు - 20 వెల : రూ. 3/-]

'జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే'

ఈ శ్లోకం విద్యార్థులూ విద్వాంసులూ జ్ఞానులూ... అంద పఠించదగినది. అన్ని మంత్రాల్లోనూ బిరుసైనది హయగ్రీవ మంత్ర అని అంటాను. నారాయణుని విద్యా విజ్ఞానావతారం హయగ్రీవతారం స్వచ్ఛమైన స్ఫటికం లాంటి ఆకారం, ఆనందమూలమై ఆత్మజ్ఞానం తానే అయి అన్ని విద్యలకూ ఆలంబనం అయిన శ సాత్త్వికమూర్తి హయగ్రీవుడు ... లౌకికములూ ఆధ్యాత్మికము అయిన విద్యలన్నిటికి ఆధారం ఆయన. అయితే ఉపాసన పద్ధతిన సరించి ఉపాసకుడు ఫలితం పొందుతాడు. ఏమైనా హయగ్రీవోపాస ఉగ్రతాస్ఫూర్తి కలదని విశేషజ్ఞులంటారు.

ఆది దానవులైన మధుకైటభులను వధించడానికీ వారు సృ కర్తయైన బ్రహ్మను బెదిరించి ఎత్తుకు పోయిన వేదాలను ఉద్ధరిం డానికే నారాయణుడు (అప్పటికి క్షీరసాగరమందు యోగనిద్రలో ఉన్న వాడు) హయగ్రీవుడయాడని దీనిమూలాన తెలుస్తుంది.

లౌకిక విద్య మాటకేమిగాని ఆధ్యాత్మిక విద్యను సాధిం డానికి హయగ్రీవోపాసన ఆవశ్యకమనేది నిర్వివాదాంశం.

వేదాంత దేశికులు హయగ్రీవారాధకులనీ వారారాధించిన హయగ్రీవ విగ్రహం ఆయన శిష్యునకువచ్చి క్రమంగా అది మైసూరు సంస్థానాధీశుల సేవలందు కుంటూ ఉన్నదనీ యీ గ్రంథం చెబు తూంది.

ముందు హయగ్రీవావతారానికి సంబంధించిన విషయం, హయ గ్రీవమూర్తి తత్వం విపులంగా ఉంది,

వేదాంత దేశిక కృతిగా ముప్పై రెండు శ్లోకాలు, వాటికి అర్థ తాత్పర్యాలూ ఇచ్చి ఏతద్గ్రంథకర్త జిజ్ఞాసువులకు మహోపకారం చేశారు. ముద్రణ మరి కొంచెం శ్రద్ధగా చూస్తే శ్లోకాలు నిర్దుష్టంగా ఉండేవి.

సత్ఫల దాయకమైన యీ గ్రంధాన్ని ముద్రించడానికి ఆర్థిక సాహాయ్యం అందించిన తిరుపతి దేవస్థానంవారి సత్కార్యపరత అభినంద్యం.

# సుప్రభాత గోష్ఠి

[వ్యాఖ్యాత : శ్రీచరణ రేణువు. ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు-521 207, కృష్ణాజిల్లా, వెల : 6.00 రు.]

ప్రభాత సమయములో నిత్యమూ శ్రద్ధాభక్తులతో దైవ నామ స్మరణ పాపహరణమూ, శుభంకరణమూ అని సనాతనోక్తి. దీని యందు మొదటిది శ్రీ రామానుజ ప్రతిబోధనమ్ - రామానుజులను మేల్కొల్పడం.

'ఉత్తిష్ఠ శఠజిత్పాద పద్మ ప్రావణ్య జీవన!
శ్రీ మద్వేంకట శైలేశ శంఖచక్ర ప్రద! ప్రభో!...'

శ్రీ వేంకటేశ్వరునకు శంఖచక్రాలు ఇచ్చినవాడట రామా నుజులవారు. దీనినిబట్టి వెంకటాచలపతి శంఖ చక్రాంకితు డయాడనీ అంతకుముందు ఈ చిహ్నాలు లేవనీ అనుకోవచ్చునేమో! ఏమో మరి!

మిగిలిన పదునైదూ 'సుప్రభాత స్తోత్రాలు' అందరికీ తెలిసిన ప్రసిద్ధ సుప్రభాతంకూడా దీనిలో ఉంది. ప్రపత్తి వగైరాలు లేవు. చెన్నపురిలో తిరుపళ్ళిక్కేణి (ట్రిప్లికేన్) యందున్న పార్థసారథిని మేల్కొల్పేదీ భద్రాచలమందున్న రఘుపర సుప్రభాతం... ఇలా అన్నీ కావాలనేవారికి ఒకచోట చేర్చి ముద్రించి గోదా గ్రంథమాల వారు పుణ్య కార్యం చేశారు.

# యా మా సా

[ (శంకర భగవత్పాదుల మాయా వాదం) రచయిత : శ్రీ కొమరవోలు వెంకట సుబ్బారావు, 18/37 ఆఫీసర్స్ కాలనీ, రామ కృష్ణాపురం, సికిందరాబాద్-500 556 వెల : రూ. 5/-]

'యా మా సా మాయా'- ఏది లేదో అదేమాయ.

'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా'- బ్రహ్మసత్యం. జగత్తుమిథ్య

'జీవో బ్రహ్మైవ నాపరః'- జీవుడు బ్రహ్మయే-వేరుకాడు.

విద్య - అవిద్య అనే పారిభాషిక పదాలకు తాత్విక దృష్టిలో చెప్పవలసే అర్థం వేరు. విద్య = చదువు అని చెప్పడం లౌకికం. 'అవిద్య = విద్యకానిది - ఇదీ అంతే. వీటికి తాత్వికార్థం వేరు.

అవిద్య, మిథ్య, మాయ-అనేవి సమానార్థకాలు కావనే నిర్ణయం కూడా ఉంది. నా ఉద్దేశంలో సారం ఒక్కటే. అజ్ఞానం, అసత్యం-అనేవి ప్రసిద్ధంగా వినవచ్చే పదాలు. అయితే - అసత్యపదానికి లౌకికార్థం వేరు....

ఆదిశంకరుల మాయావాదమును ఛందోబద్ధమైన పద్యపద్ధతిని శ్రీ వెంకట సుబ్బారావు గారు సాధ్యమైనంత సుగమంగా తెలుగులో చెప్పారు. దీనిని 'ప్రవేశకము' పేరుతో శ్రీ దివాకర్లవారు పరిచయం చేశారు. గ్రంథతత్వం స్పష్టీకరించారు. అదికాక, 'ప్రస్తావన' పేరున శ్రీ శ్రీ శ్రీ విమలానంద భారతీస్వామివారు తాత్విక భావనతో నడుమ చెప్పిన రెండు వాక్యాలూ గ్రంథ స్వరూపాన్ని సువ్యక్తం చేశాయి. గ్రంథకర్త 'ఆ ముఖము'- అసలు విషయాన్ని సంగ్రహించి సుగతం చేసింది.

'అపవాద' శీర్షికతో వ్రాసిన మూడు పద్యాలూ గ్రంథ హృదయాన్ని ప్రదర్శించాయి. నాకు ఆ మూడు పద్యాలూ పర తత్వాన్ని సన్నిహితం చేశాయని అనుకున్నాను.

'బ్రహ్మ భిన్నంబుగా నేది పలుగదనుచు
బ్రహ్మయే తాననుచు స్వానుభవమునందు
గనెడు వాడె జీవన్ముక్తుడనగ బఱగు
నదియె వేదాంత సిద్ధాంతమగును జూవే-

పారిభాషిక పదజాలముతో క్లిష్ట రూపమైన సంస్కృతం తెలియని తత్వ జిజ్ఞాసువులకు ఈ గ్రంథం సత్పదార్థ చింతామణి. నాయీ నాలుగు మాటలూ ఈ గ్రంథానికి పరిచయ వాక్యాలుగా భావించగోరుతున్నాను.

శ్రీ యమావింజాల పద్మనాభ స్వామి

## కళాసౌరభం (సాహిత్య మాస పత్రిక)

[ప్రతులకు : కళా సౌరభం, తారా నగర్, బి. హెచ్. ఇ. ఎల్. దగ్గర, హైదరాబాదు-500 133, వెల : రు. 2-00.]

ఈ సాహిత్య మాస పత్రికలో కొన్ని సమీక్షలు, సమీక్షా చర్చలు ఒక స్కెచ్ ఉన్నాయి. ప్రధానంగా సిద్ధారెడ్డి ఎల్లోరాపై రాసిన విషయాలను చర్చిస్తూ దాసరాజు రామారావుగారు రాసిన వ్యాసం పరిశీలనార్హం. సాహిత్యంలో విమర్శ ఆరంభమైన నాటినుండి నేటివరకూ కూడ ఏవో తగాయిదాలు, వ్యక్తిగత దూషణలు ఉన్నాయి; ఉంటున్నాయి. వీటన్నింటికీ ఒకటే కారణం రచన మీద, తాను నమ్మిన భావం మీదను ప్రీతి కంటె కీర్తి మీద వ్యామోహం ఎక్కువటం. విమర్శలో వ్యక్తిగత దూషణ ఏనాడూ ఆదరించతగినది కాదు. కె. భరత్‌బాబుగారి కవిత్వం అర్థం కావడంలేదు అనే వ్యాసం కూడా ఈనాటి కవిత్వాన్ని గురించిన వేదనకు సంబంధించినదే. ...త్వం అర్థం కావటం అనేది సాపేక్షం. అస్పష్టత, అయోమయం ...హరణీయం. ఇంత చిన్న పత్రికను రెండు రూపాయలు పెట్టి ...హిత్యాభిమాని కొనడం కష్టమే కాని వారి కృషి మాత్రం అభినంద...యం.

## చైతన్య దీప్తి

[చక్కా సత్యనారాయణమూర్తి. వెల : రు. 6-00 లు ...ప్రతులకు : విద్వాన్ చక్కా సత్యనారాయణమూర్తి. చిన్న మసీదు ...దుట; మెయిన్‌రోడ్; అమలాపురం - 533 201; తూ॥ గో॥ జిల్లా]

సాహిత్యసంస్థలు ఈనాడు ఔత్సాహిక కవులను రచయితలను ఎక్కువగా ప్రోత్సహిస్తున్నాయి. రచయితల సంఘాలు రచయితలు ...ని వారిని రచయితలుగా తయారు చెయ్యలేవు గాని రచయితగా ...కి రావలసిన వారికి చేయూత ఇవ్వటంలో వాటి పాత్ర విస్మరింప ...నిది. ఈ కావ్యం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి ఆర్థిక ...యంతో సమతా రచయితల సంఘం అమలాపురం వారిచే ప్రచు...బడింది. దీనికి ఎల్లోరాగారు, వక్కలంక లక్ష్మీపతిరావు గారు ...ము మాటలు రాశారు. కవిగారు కవితా రచనలో ప్రాథమిక ...లో ఉన్నారు. అయితే భవిష్యత్తులో మంచి కవిత్వం సాధనపై ...గలరని ఈ కావ్యం చెబుతోంది. వీర దృష్టి మానవతా దృష్టి. ...ప్పుడప్పుడు పండుగల మీద రాసిన గేయాలు కూడా దీనిలో ...న్నాయి. ప్రకృతిని పర్శించే లక్షణం కవి గారిలో ఉంది. అది ...షం ఎంత మాత్రం కాదు.

"నిశీధి వీథిలో వెలుగుల్ని కురిపిస్తాను
విషాద గాథకు ముగింపు పలికిస్తాను
దేశ ప్రజల యెదలో
దాస్య భావము తొలిగిస్తాను
చీకటి గుప్పెట్లోంచి
వెలుగును విడిపిస్తాను"

అని చెబుతున్న కవి తన వాక్కు జన వాక్కుగా మారటానికి ఎంతో శ్రమపడాలి. అట్లాంటి ఆశయసిద్ధి కోసం పరిశ్రమిస్తూ మం... కవిత్వం రాయగలరని ఆశిస్తాను.

## సూర్యుడు కూడా ఉదయిస్తాడు

[విశ్వనాథ సూర్యనారాయణ; జయప్రభ వెల : రు. 5/- లు. ప్రతులకు : 1) యువ భారతి, 5 కింగ్స్‌వే, సికింద్రాబాద్-500 003 2) యువ భారతి కార్యాలయం; ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు; తిలక్ రోడ్, హైదరాబాద్-500 001.]

యువ భారతి సాహిత్య సంస్థ ద్వారా ఇప్పటికి లబ్ధప్రతిష్టులు, ప్రతిష్టను సంపాదించవలసినవారూ చాలా మంది కవులూ, రచయితలూ విమర్శకులు పరిచయ మయ్యారు తెలుగు సాహిత్య ప్రపంచానికి అట్లా పరిచయమైన కవులలో సూర్యనారాయణగారు, వారి జీవిత భాగస్వామిని జయప్రభగారు 'సూర్యుడు కూడా ఉదయిస్తాడు' కావ్యకర్తలు. వీరి కావ్యానికి దాశరథిగారు మంచి ఉపోద్ఘాతం రాశారు. వారి ఉపోద్ఘాతంలో 'సూర్యుడు కూడా ఉదయిస్తాడు' అని నామకరణం చెయ్యటంలోని ఔచిత్యాన్ని చక్కగా వివరించారు. "అశాంతిలో, అజ్ఞానంలో అనారోగ్యంతో ఆకలితో అలమటించి పోతున్న లోకం, గాఢాంధకార బంధుర భయంకర కాళరాత్రి. ఈ రాత్రిలో చుక్కలు సైతం ఉదయించడానికి జడుస్తున్నాయి, చంద్రుణ్ణి ఎప్పుడో కబళించింది ఈ కాళరాత్రి. ఈ కాళరాత్రి తెల్లవారాలి. సూర్యుడు ఉదయించాలి. ఈ యువ కవి దంపతులు కోరుకొనే జ్ఞాన సూర్యుడు ఉదయిస్తాడా ఏనాటికైనా?" అంటున్నారు దాశరథిగారు. సూర్యుడు కూడా ఉదయిస్తాడు అనటంలోని ఔచిత్యం కావ్యంలో ధ్వనించటమేకాక దాశరథిగారి ముందు మాటలో పాఠకులకు వాచ్యం చెయ్యబడింది.

ఈ సమాజ రుగ్మతమీద వీరికున్న ఏహ్యం, రావలసిన వ్యవస్థ మీద వీరికున్న మమకారం ఈ కావ్యంలో ప్రతి ఖండికలోనూ కనబడుతుంది, ఖండికలు చదవేటప్పుడు వచనత్వ స్పృహ పాఠకునికి కలగక పోవటం వీరి కవితల్లో ప్రత్యేకత. సునిశితమైన వ్యంగ్యం, అవధులు దాటిన ఆగ్రహం కూడా ఒకే సమయంలో వ్యక్తం కావటం

కొన్ని ఖండికల్లో చూస్తాం. 'కాలికింద ఎండుటాకుల ఎదలు చిట్లి పోతున్న చప్పుడు' అన్నప్పుడు హృదయం ఆర్ద్రంకాక తప్పదు. పాములకు పగవాళ్ళు, చీమలకు చిరకాల మిత్రులు కావాలని కవి కోరుకోనటం ఆయన విశ్వశ్రేయో దృష్టికి తార్కాణం.

"ఈ దేశానికి గుండె ఎక్కడ ?
పొట్ట కనిపిస్తోంది-
ఎవరూ చెప్పనక్కర లేకుండా,
చూపించ నక్కర లేకుండా-
కోట్ల మంది మన దేశంలో
చేత్తో పట్టుకు తిరుగు తున్నది అదే కదూ !"

అన్నప్పుడు దేశంలోని అసంఖ్యాక ప్రజానీకాల ఆకలి బాధ వ్యక్త మవుతుంది. శ్రమ ఉన్నది; జీవనం లేదు. వెలుతురు ఉన్నది; కాంతి లేదు. ఇదీ మన దేశం

అణగని ఆవేదనిని నిట్టూర్పుల్లో
అణచాలని చూడకు
రగులు తున్న ఆవేశాన్ని ఆరనీయకు;
చైతన్యపు తూరుపులా ప్రజ్వరిల్లు
అప్పుడు-
బిగిసిన నీ పిడికిలి మాటునే
సూర్యుడు కూడా ఉదయిస్తాడు"

అంటున్నారు జయప్రభగారు, అట్లాంటి సూర్యోదయం కోసం వీరిద్దరూ ఇంకా కావ్యాలు రాస్తారని ఆశ.

**శ్రీ టి. యల్. కాంతారావు**

# గ్రంథ స్వీకారాలు

*** ప్రహారిక :** ఆధునిక సాహిత్య వేదిక. సంపాదకులు : శ్రీ, నమిలికొండ బాల కిషన్‌రావు. వెల ఒక రూపాయి. ప్రతులకు నమిలికొండ బాల కిషన్‌రావు, 6-7-42/ఎ రంగన్నదర్వాజ, హనుమకొండ-506011.

*** సాహితీ మిత్రులు :** ఆధునిక సాహితీ మిత్రుల పరిచయ సంచిక. వెల ఐదు రూపాయలు. ప్రతులకు : సాహితీ మిత్రులు, విజయపురి. నాగార్జున సాగర్-508 202

*** నవత :** సాహితీ ఉద్యమ వేదిక. మాస పత్రిక సం॥చందా 10రూపాయలు. నిర్వాహకులు: శ్రీ కొలపల్లి ఈశ్వరరావు శ్రీ కండికటు సూర్యప్రకాశరావు, శ్రీ ఈతకోట సుబ్బారావు. ప్రతులకు: సింహపు సాహితీ సమాఖ్య 3/95 నవాబుపేట, నెల్లూరు-524 002

*** వెల్లువ :** నూతన సాహితీ వేదిక, మాస పత్రిక. స చందా 15 రూపాయలు. సంపాదకుడు : శ్రీ తోట మహాదే ప్రతులకు : సంపాదకుడు, వెల్లువ. ఇంటి నెం. 10-3-12 గచ్చుబౌలి, సిరిసిల్లా, కరీంనగర్-505 301.

*** స్వతంత్ర జనశక్తి దాని మహత్తు :** రచయిత : శ్రీ ఉమ్మెత్తల కేశవరావు. వెల 2 రూపాయలు. గాం గారి ప్రయోగ ప్రక్రియలు అంటూ రచయిత గాంధీగారి ఉద్యమా సత్యాగ్రహములు మొదలయిన వాటిని గురించి సంక్షిప్తంగా వర్ణించా హరిజన్, యంగ్ ఇండియా పత్రికలనుండి సమాచారాన్ని క్రో కరించారు. ప్రతులకు : ఉమ్మెత్తల కేశవరావు, 3-4-83 బర్కత్‌పుర, హైదరాబాద్-500 027.

*** వడిసెల :** సాహిత్య సాంస్కృతిక మాస పత్రి సంపాదకుడు : శ్రీ వి. ప్రకాశరావు. వెల: 2 రూపాయలు. ప్రతు సంపాదకుడు, వడిసెల. 324, న్యూ సంతోష్ నగర్ కా హైదరాబాద్-500 659.

*** కవిత :** ఆధునిక కవిత్వ వేదిక. త్రైమాసిక పత్రి సంపాదకుడు : శ్రీ రావి రంగారావు. సంవత్సర సభ్యత్వం 10- రూపాయలు. క్రొత్త కవులను పరిచయం చేయడం ఒక కార్యక్రమం పెట్టుకొన్నదీ పత్రిక. రకరకాలయిన శీర్షికలతో ప్రసిద్ధ రచయి రచనలతోపాటు క్రొత్త రచయితల రచనలు కూడా అందించబడ్డా ప్రతులకు : రావి రంగారావు, సాహితీ మిత్రులు, 25-36 బుటాయి పేట, మచిలీపట్టణము,

*** ఎక్స్‌రే :** ఆధునిక సాహిత్య మాస పత్రిక. సం చందా 6 రూపాయలు. సంపాదకుడు: శ్రీ కొల్లూరి. ప్రతులకు ఎక్స్‌రే, కొల్లూరి హౌస్, అమలాపురం-533 202.

*** కొల్లేటి పాటలు :** రచయిత : శ్రీ క్రాటగ జానపదులు పనిపాటలలో శ్రమను అనుభవించకుండా హాయిగా పా కుంటూ పని చేసుకోవడానికి వీలుగా ఉన్నాయి పాటలు. ప్రతులకు క్రాటగడ్డ, పెదపాడు-534 437 ఆంధ్ర ప్రదేశ్.

*** అంకితం :** సాహితీ సంకలనం-2 (మాస పత్రి వెల 2 రూపాయలు. సంవత్సర చందా 25-00. సంపాదకుడు శ్రీ మద్దూరు శ్రీనివాసులు. ప్రతులకు : మేనేజర్ అంకితం సాహి సంకలనం 21/542 భాష్యకార్ల వీధి, పెద్ద బజారు. నెల్లూ 524 001 నెల్లూరు జిల్లా.

*Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radhakrishna at the Andhra Pat Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 6124*

పత్రికా లోకంలో మరో సంచలనం!

కొత్త పంథాలో కొత్త పత్రిక!!

సమగ్ర విజ్ఞానవాణి

# శ్రీవాణి

సాంస్కృతిక మాస పత్రిక

ప్రారంభ సంచిక:

**డిశంబర్ 9 విడుదల**

సంపాదకుడు:

**కొమురగిరి కృష్ణమోహనరావు**

ప్రఖ్యాత రచయితలు:

శ్రీమతి రావినూతల, మంగళగిరి ప్రమీలాదేవి, సోమంచి రామం, పురాణపండ రంగనాథ్, తుర్లపాటి కుటుంబరావు, జోస్యుల సూర్యనారాయణమూర్తి, ఆర్. ఎస్. కె. మూర్తి, డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు, డా॥ కాజ లక్ష్మీనరశింహారావు, డా॥ పి.జి. కృష్ణమూర్తి, రావి రంగారావు, డి. యస్. ఆర్. ఆంజనేయులు, జోరాశర్మగారలు నిర్వహించే ఆబాల గోపాలాన్ని అలరించే వినూత్న శీర్షికలతో...

సుప్రసిద్ధ రచయితలు:

డా॥ సంజీవదేవ్, మల్లాదివెంకటకృష్ణమూర్తి, జమ్మలమడక మాధవరామశర్మ, డా॥ ప్రసాదరాయ కులపతి, శ్రీకృష్ణ భగవాన్లు, ముదిగొండ శివప్రసాద్, బుద్ధవరపు వెంకటరత్నం, మన్నవ గిరిధరరావు, డా॥ ఐ. సత్యసుందరం, భావరాజు నరసింహారావు ప్రభృతుల ప్రత్యేక వ్యాసాలతో

"క్లిక్ క్లిక్ క్లిక్" నవలతో ఓ చరిత్ర సృష్టించిన ప్రఖ్యాత సస్పెన్స్ రైటర్

శ్రీమతి రావినూతల సువర్నాకన్నన్ కలంనుండి వెలువడిన మరో ఆణిముత్యం

సీరియల్ **"యవనిక"** ధారావాహికంగా **"శ్రీవాణి"** లో రాబోతున్నది

శ్రీ నందం రామారావు, శ్రీమతి విన్నకోట సుశీలాదేవి ప్రభృతుల
కథలతో ప్రముఖుల కవితలతో, జోకులతో, కార్టూన్‌లతో...
ఇంకా రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలపై
విశ్లేషణాత్మక వ్యాసాలతో... నూతన విలువలు కోరే ఉత్తమ పాఠకులకు వినూత్న కానుక

కాపీలను రిజర్వు చేసుకోనండి!    చందాదారులుగా చేరండి!!    ఏజంట్లు త్వరపడండి!!!

సంప్రదించండి:

విడి ప్రతి రు. 2.50 2-50

సంవత్సర చందా రు. **27.00**

మేనేజర్,
"శ్రీవాణి"
సాంస్కృతిక మాస పత్రిక.
**24-51**, రామానాయుడుపేట,
మచిలీపట్నం-**521001**, ఏ.పి.